

ప్రచురణ సంఖ్య : 1042
ప్రతుల సంఖ్య ; 2000
ప్రథమ ముద్రణ : జూన్, 1983

వెల : రు. 8/-

ముద్రణ :
స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్,
విజయవాడ-520 004.

# చీలని పాయలు

డా॥ పొన్నాల యాదగిరి

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్ విజయవాడ-520004

# సమీక్ష

గత సంవత్సరం మేం వ్యక్తం చేసిన ఆకాంక్షకి ప్రతి స్పందించే ప్రయత్నం చేసినందుకు యీ సంవత్సరం నవలల పోటీలో పాల్గొన్న రచయితల్ని, రచయిత్రుల్ని అభినందిస్తున్నాం.

ఈ సంవత్సరం పోటీకి వచ్చిన రచనల్లో వస్తువైవిధ్యం వుంది. కొత్తరచయితల రచనల్లో అనుభవం, పరిశీలన కూడా వున్నాయి. కాని శిల్పదృష్ట్యా వాటిని చాలా మెరుగు పరచుకోవలసివుంది. ఆ దిశగా ఆయా రచయితలు కృషి చేస్తారని సఫలీకృతులవుతారని ఆశిస్తున్నాం.

మా ఆకాంక్షని రచయితలు అర్థం చేసుకుంటారని, సహకరిస్తారని, సమకాలీన, సామాజిక జీవితాన్ని ప్రతిబింబించే, నాలుగు కాలాల పాటు నిలబడే నవలల్ని సృజించి, తెలుగు నవలని సుసంపన్నం చేసేందుకు కృషి చేస్తారని విశ్వసిస్తున్నాం.

—ప్రకాశకులు

# 1

హైదరాబాదు నుంచి పయనించిన రైలు సాయంత్రం నాలుగు గంటల వేళ హౌరా స్టేషనులోకి ఆయాసంగా వచ్చి ఆగింది. రెండు రోజుల నుంచి కదులుతున్న రైలులో కూచుని అలసి, విసిగిన ప్రయాణీకులు ప్లాట్‌ఫారమ్ రాగానే హుషారుగా సామానులతో క్రిందికి దిగుతున్నారు. కూలీల అరుపులతో, తినుబండారాలు అమ్ముకునేవారి కేకలతో స్టేషనంతా వింత రొదతో నిండిపోయివుంది.

రమేష్ కూలీ సహాయంతో సామాను క్రిందికి దింపాడు. స్టేషనుని ఒకసారి కలయచూశాడు. మానవాళి స్టేషను ఆవరణను తివాచీలా కప్పివేసినట్లు తోచింది. జనసమూహం సముద్రాన్ని చేరబోయే నదిలా నిండుగా, మందంగా సాగుతూ ఎటు దిక్కుగా వెళుతుందో అర్థం కావడం లేదు. ఆ గుంపులో మనిషిని విడి విడిగా చూడ్డం ఎంతో కష్టతరమైన పనిగా తోచింది రమేష్‌కి.

కూలీ ప్రక్కన జాగ్రత్తగా నడుస్తూ స్టేషను వెలుపలికి రాసాగాడు రమేష్. బుక్కింగ్ కౌంటర్ల దగ్గర జనం పెద్ద క్యూలలో నిలుచున్నారు. అక్కడున్న పెద్ద హాలులో బిచ్చగాళ్లు, బంగ్లాదేశ్ నుంచి వచ్చిన కాందిశీకులు ఎడం లేకుండా వున్నారు. అందులో కొంతమంది నిద్ర

పోతున్నారు. మరికొంతమంది పిచ్చాపాటి మాట్లాడుతున్నారు. కొంత మంది స్త్రీలు నిద్రపోయిన పసిపిల్లల్ని, చిరిగిన గుడ్డలలో వుంచి, నిర్లక్ష్యంగా గచ్చుమీద పడుకోబెట్టారు. ఇంకోచోట నాలుగు, ఎనిమిది సంవత్సరాలమధ్య వయస్సుగల పిల్లలు గుంపుగూడి ఏదో ఆడుకొంటున్నారు. వారిలో సగం మంది నగ్నంగా, మరో సగం అర్ధనగ్నంగా ఉన్నారు. కారుతున్న ముక్కులను చేతుల్తో తుడుచుకొంటూ, స్టేషను లోపలినుంచి వస్తున్న వారిని తలెత్తికూడా చూడ్డంలేదు.

ప్రయాణీకులు తమకు తోచిన విధంగా దారి చేసుకొంటూ బయటికి నడుస్తున్నారు. రమేష్ గచ్చుమీద వున్న పిల్లల్ని తప్పించుకొంటూ, వేగంగా వెళ్తున్న కూలీని వెంబడించాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

కూలీ సామానుని టాక్సీలో వుంచాడు. అతనికి డబ్బు యిచ్చి 'భవానీపూర్ ఛలో' అని కూచున్నాడు రమేష్. అంతకుముందే వర్షం కురిసి వెలిసినట్లుంది. స్టేషను చుట్టూ మురికి కుప్పలుగా వుంది. అక్కడక్కడ గుంటలుపడి, నీరు నిలిచి వుంది. టాక్సీ కదిలింది.

రమేష్ కొత్తగా ఉద్యోగంలో చేరడానికి వచ్చాడు. ప్రభుత్వోద్యోగం, కలకత్తాలో పోస్టింగుతో వచ్చింది.

ఎదురుగా హౌరాబ్రిడ్జి ఎత్తుగా, మానవాభ్యుదయానికి ప్రతీకగా కనిపించింది. దాన్ని చూచిన ఆనందం రమేష్‌లో ఎక్కువసేపు నిలువలేదు. బ్రిడ్జి క్రింద హుగ్లీ నీరు మురికితో నిండిపోయి వుంది. దాని ప్రవాహం మందంగా వుండి, అస్సలు కదులుతుందో లేదో తెలియడం లేదు. నీటి ఒడ్డు బురదతో నిండిపోయి వుంది. ఒకవైపు కొంతమంది బురద నీటిలో స్నానాలు చేస్తూంటే, ఇంకా సదూరంలో చాలమంది మరుగుదొడ్డిగా వాడుకొంటున్నారు. రమేష్‌కి కడుపులో ఏదో త్రిప్పినట్లయింది. అంతటి ముఖ్యమైన చోటుని పరిశుద్ధంగా వుంచక పోయినందుకు అతనికి ఎంతోబాధ కలిగింది.

హుగ్లీలోని నీరుని చూడగానే రమేష్‌కి తన సొంత వూరు కంది జ్ఞాపకానికి వచ్చింది. అది హైదరాబాదుకి యాభై కిలోమీటర్ల దూరంలో వుంది. అతను వీలుచిక్కినప్పుడల్లా పొలాల దగ్గరవున్న బావి దగ్గరికి చేరేవాడు. పాలేరు బావిలోని నీరుని పొలాలకి పారిస్తూ వుండేవాడు.

ఎద్దులను అదిలిస్తున్న పాలేరుకేకలు, గిలకమీద ఒరిపిడితో తిరుగుతున్న త్రాడు చేసే కిర్రుమనే చప్పుడు, బొక్కెన చిల్లుల నుండి కారుతున్న నీటిధ్వని–ఆ బావి చుట్టు వింత లయలను సృష్టిస్తుంటాయి. ఆ శబ్దాలను వింటూ, కాలువలో ప్రశాంతంగా ప్రవహిస్తున్న నీటిని చూస్తూ రమేష్ ఎన్ని గంటలైనా గడిపివేయగలడు. ఏ అడ్డంకులు లేక, తన గమ్యస్థానం చేరి, పచ్చని పైరుకి నిండు ప్రాణం పోస్తుంది ఆ నీరు. దారికి అడ్డంగా కట్టవేస్తే, ప్రవహించే నీరు ఆగిపోయి అదే మురికిగుంటగా మారి పోతుంది. రమేష్‌కి తన జీవితం కూడా ఏ అడ్డంకులు లేక గడిచిపోవాలని ఆకాంక్ష.

వర్షాల వలన బాగా గుంటలు పడిపోయిన రోడ్డుమీద, నిర్విరామంగా వస్తున్న కార్లను తప్పించుకొంటూ, టాక్సీ ఒక అరగంట తర్వాత భవానీ పూర్‌లోని మహారాష్ట్ర భవన్ ముందు ఆగింది.

దూర ప్రదేశాల నుంచి వచ్చేవారికి మహారాష్ట్ర భవన్ వసతి గృహం ఆశ్రయమిస్తుంది. కలకత్తాలో కాస్త మంచి హోటల్ కావాలంటే భరించలేని ఛార్జీలు. రెండో, మూడో మదరాసు హోటళ్ళు చౌకబారువి వున్నాయి. కానీ అక్కడ వున్న భోజనం, యితర వసతులను చూస్తే, ఎప్పుడు కలరా వస్తుందోనని భయం కలుగుతుంది.

స్నేహితుల సలహా మీద యీ చోటికి వచ్చాడు రమేష్. మహారాష్ట్ర భవన్‌లో గదులు చిన్నవిగా వున్నా, భోజన వసతులు బాగుంటాయి. అద్దె కూడా అంత ఎక్కువగా వుండదు.

సామాను సర్ది, స్నానం చేసి అలసటతో మంచం మీద ఒరిగాడు రమేష్. అంతే, మరుసటి ప్రొద్దునే అతనికి మెలకువ వచ్చింది.

# 2

రమేష్ కలకత్తాకు వచ్చి అప్పుడే రెండు నెలలయింది. రెండు సంవత్సరాలేమో అన్నంత విసుగు కలిగింది అతనికి. రోజూ ఆఫీసుకి

వెళ్ళి రావడం ఎంతో కష్టతరమైన పని. బస్సులు, ట్రాములు జనంతో క్రిక్కిరిసి వుంటాయి. బస్సు లోపల ఒక్క అంగుళం స్థలం కూడా మిగలక పోయేసరికి, తలుపు దగ్గర ఇనుప కడ్డీలను పట్టుకొని ఎంతోమంది వ్రేలాడుతారు. ఆ ఆసరా కూడా అందనివాళ్ళు, బస్సు వెనక బంపర్ మీద నిలబడతారు. రమేష్‌కి వాళ్ళని చూడగానే భయమవుతుంది. ఏ క్షణంలో, ఎక్కడ జారిపడతారో అని అంత రద్దీతో వున్న బస్సులదగ్గరికి వెళ్ళాలంటేనే జంకుతాడు రమేష్. అందుకని రోజూ ఆఫీసుకి నడిచి వెళ్ళేవాడు. కాని నడక కూడా సుఖంగా ఉండేదికాదు. సముద్రతీరందగ్గర వుండటంతో గాలిలో తేమ ఎక్కువగా వుంటుంది. ఎండలో నడుస్తుంటే, ధారలుగా చెమట కారి చికాకు కలిగిస్తుంది.

కొన్ని పరిస్థితుల ప్రభావం వలన మనం ఎంతోమందిని కలుసుకొంటాం. అందులో చాలామంది పరిచయస్తులుగానే మిగిలి పోతూంటారు. మరికొంతమంది సన్నిహితులుగా, అందులో ఏ ఒక్కరో యిద్దరో మనస్సులు కలసిన మిత్రులుగా నిలిచిపోతారు. అటువంటి సంఘటనే రమేష్ విషయంలో కూడా జరిగింది.

మహారాష్ట్ర భవన్‌లోనే వుంటూ కలకత్తాలోని ఆంధ్ర సంఘం మెంబరుగా చేరాడు ప్రవీణ్. అతని ఆహ్వానంపై రమేష్ ఒకరోజు వెళ్లాడు. బాలీగంజ్‌లోని ఒక పాత భవనంలో ఆంధ్రసంఘం నెలకొని వుంది. మీటింగులు జరుపు కొనడానికి ఒక పెద్దరూము, ఆఫీసు గది, మరోచిన్న రూము అందులో వసతి.

ప్రవీణ్ అంతకుముందే ఆంధ్ర సంఘం గురించి వివరించాడు. చాల సంవత్సరాల క్రిందట స్థాపించిన ఒక తెలుగు మీడియం స్కూలు ఆ సంఘం ఆధ్వర్యంలో నడుస్తోంది. అది నిజంగా విశేషమని మెంబర్ల భావన. మేమంతా తెలుగువారమే అని చెప్పుకోవడానికి అప్పుడప్పుడు అక్కడికి వచ్చి చాలామంది హాజరు అవుతారు. కాని, యితర విషయాలు ఏవీ పట్టించుకోరు. ఓపిక వుంటే సంవత్సరానికొకసారి ఏదో ఒక సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటవుతుంది. లేకపోతే మరుసటి సంవత్సరానికి వాయిదా పడుతుంది. ఆ క్రిందటి సంవత్సరం ఒక తెలుగు సినిమాని ప్రదర్శించారట. వారి అదృష్టం కొద్దీ అది ప్రదర్శన

సమయంలో పదిసార్లు తెగిపోయింది. అదీగాక ప్రతి ఫ్రేములో వర్షపు భావన కలిగించడానికి కాబోలు, నీటి ధారలు కారినట్లు పాత ఫిల్మ్ తెరమీద నీడలని పారచేసింది. ప్రేక్షకులు కణతలు నొక్కుకుంటూ 'ఎంత తెలివి తక్కువ పనిచేశాను. హాయిగా ఏ హిందీ సినిమాకో వెళ్లక, ఏమిటీ శిక్ష' అని లోలోనే గొణిగారు.

మీటింగు హాలులో అయిదారుగురు కూచుని ఏదో వాదిస్తున్నారు. అందులో నడి వయస్కులు, సీనియర్ అకౌంటెంట్‌గా పని చేస్తున్న రామనాథంగారిని చూడగానే రమేష్‌కి గౌరవభావం కలిగింది. మిగతా వారితో కూడా పరిచయాలు జరిగాయి. సంభాషణ మళ్లీ మొదలైంది.

'నా ఉద్యోగ రీత్యా దేశం నలుమూలలా తిరిగాను. అన్ని పెద్ద పట్టణాలలో మూడు సంవత్సరాలకు తక్కువ కాకుండా వున్నాను. ఎక్కడికి వెళ్లినా, మొదట్లో అక్కడ తెలుగువారు అస్సలు లేరనిపించేది. అలా కొన్నిరోజులు పోయిన తర్వాత స్నేహితుల ద్వారా కొన్ని తెలుగు కుటుంబాలు పరిచయమైనా, వారు తెలుగులో మాట్లాడటానికే వెనుకాడే వారు' అని సాగించాడు రామనాథం.

'అవునండి, మనవారు మేము తెలుగువారమని చెప్పుకోవడానికి సిగ్గు పడతారేమో ! ఇప్పుడు యీ కలకత్తాలో లేక్ మార్కెట్‌నుంచి, దేశప్రియ పార్కు వరకు చూడండి. హోటళ్లు, దుకాణాలు, రోడ్లమీద లుంగీలు ధరించిన పురుషులు, తలలో కనకాంబరాలు తురిమి, నుదుట చిన్న విభూతి బొట్టుని ధరించిన స్త్రీలు—మనం చూడగానే మదరాసు వీధిలో ఉన్నట్లు ఫీలవుతాము. ఎక్కడికి వెళ్ళినా ఆ తమిళులకి ఒక గుర్తింపు వుంటుంది. అందుకే ఉత్తర హిందూస్తానీలు దక్షిణ భారతము అంటే మద్రాసు అని, తమిళులని యిప్పటికీ అనుకొంటారు. అక్కడ నాలుగు రాష్ట్రాలున్నాయని, అందులో ఒకదానికి హైదరాబాదు ముఖ్యపట్టణమని ఏదో కొద్దిమందికి తెలుసు' ప్రవీణ్ కంఠం కలిపాడు.

రమేష్ గొంతుని సవరించుకొని 'ఎవ్వరైనా వారి సాంప్రదాయాలను వెల్లడి చేయందే నలుగురికి ఎలా తెలుస్తాయి? ముఖ్యంగా యీ బెంగాలీలను చూడండి, వాళ్లు ఏ రాష్ట్రంలో వున్నా ఒక కాలనీని ఏర్పరుచుకొంటారు. ఏ యిద్దరు కలసినా చక్కగా తమ స్వంత భాషలో మాట్లాడుకొంటారు.

వాళ్ళ భాష రసవత్తరమైనదని, టాగూర్, శరత్, బంకిమ్‌చంద్రలాంటి గొప్పవారు ఎన్నో విలువైన సాహిత్య పంటలు పండించారని, దేశంలో వాళ్ల భాషకు సరితూగే భాష యింకోటి లేదని వాళ్ళు గట్టిగా నమ్ముతారు. ఆ నమ్మకానికి ఆచరణగా ప్రతి బెంగాలీ, ముఖ్యమైన కవుల రచనలు చదివి ఆకళించు కొంటాడు. ఏమాత్రం చదువుకొన్న వ్యక్తి అయినా, ఎటువంటి సమయంలో అయినా, మీరు నిలదీసి రెండు పద్యాలు చెప్ప మంటే టాగూర్ రచనలు నాలుగు మృదుమధురంగా వినిపిస్తాడు. అది వాళ్ళ భాషమీద వున్న భక్తి శ్రద్ధలకు తార్కాణం. మన తెలుగు సోదరు లొక్కరైనా యిలా గర్వంగా ఒక్క తెలుగు పద్యమైనా పూర్తిగా చెప్పగలుగుతారా? లేదు' అని ఆవేశంగా మాట్లాడాడు.

'మన వారిలో యింకో పెద్ద లోపం వుంది. మనలో వున్న వారి గొప్పతనం మనకే తెలియదు. ఇతరులు వేలెత్తి చూపితే 'అలాగా' అని చప్పరించి వూరుకొంటారు' మధ్యలో ఒకతను అభిప్రాయపడ్డాడు.

'బెంగాలీల సామూహిక కార్యక్రమాలను నేను హైదరాబాదులో చూచి ముగ్ధుణ్ణయ్యాను. దసరాకి వాళ్ళు దుర్గ పూజలు జరుపుతారు. ఆ వారం రోజులు అక్కడ వాళ్ల కలకత్తాలోని వాతావరణం సృష్టించుకొంటారు. పాటలు, నాటకాలు, పూజలు, భజనలు అన్నీ జరిపిస్తారు. భోజనాలు ఒక్కచోటే చేస్తారు. అక్కడ వున్నది కొంతమందే అయినా, ప్రతి ఒక్కరు ఏదో ఒక పనిని ఆనందంగా స్వీకరించి, సంతృప్తిగా నెరవేరు స్తారు. అలాగే మనం కనీసం సంక్రాంతి, ఉగాది యిక్కడ తెలుగు నాడులోలాగా జరిపితే నలుగురికి తెలుగుజాతి గురించి తెలుస్తుంది' రమేష్ అనగానే రామనాథం, మిగతావారు ఆనందంగా చప్పట్లు కొట్టారు.

రామనాథంగారు దగ్గరిగా వచ్చి 'రమేష్, నీలాంటివారు యితర రాష్ట్రాలలో బ్రతుకుతున్న తెలుగువారి గుంపులో ఒక్కరున్నా చాలు. తెలుగుతనం నలుగురికీ తేటతెల్లమవుతుంది. ఐయామ్ వెరీ హాపీ టు మీట్ యు' అని కరచాలనం చేశాడు.

ఆ ఉత్సాహంతోనే రమేష్ ఆ సంఘంలో సభ్యత్వ తీసుకొన్నాడు.

ఆ రోజునుంచి వీలుచిక్కిన సాయంత్రాలు, ఆదివారం తప్పనిసరిగా ఆంధ్ర సంఘానికి వెళ్ళేవాడు రమేష్. ప్రతిరోజు తప్పనిసరిగా అక్కడికి వచ్చే రామనాథం ఇంకా యితర సభ్యులతో ఏవేవో విషయాలు చర్చించే వాడు. ఆ పరిచయాన్ని పురస్కరించుకొని తన యింటికి ఆహ్వానించాడు రామనాథం.

ఆరోజు సాయంత్రం రామనాథంగారి యింటికి వెళ్ళాలని ట్రాము ఎక్కాడు రమేష్. ఖాళీగా వున్న సీటు కనిపించేసరికి అతని మనస్సు సంతోషంతో గెంతులేసింది. కలకత్తాకు వచ్చినప్పటినుంచి అతను రద్దీగావున్న ట్రాముల్లో ఎప్పుడూ కూచోలేకపోయాడు. సాయంత్రం ఆరు దాటడంతో ఆఫీసునుంచి తిరిగివచ్చేవారి రద్దీ తగ్గిపోయింది.

ట్రాము దిగి అడ్రసు ప్రకారం రామనాథంగారి యింటికి సులభంగా చేరగలిగాడు. గేటులోపలికి రాగానే రామనాథంగారు ఒకమూల వంగి ఏదో పరీక్ష చేస్తూ కనిపించారు. ప్రక్కన పనిమనిషి ఏదోపట్టుకొని నిలుచున్నాడు.

'గుడ్ ఈవినింగ్' అంటూ రమేష్ దగ్గరగా వచ్చాడు.

'హలో' అని రామనాథంగారు క్రింద పడుకొని ఒగురుస్తున్న కుక్క కడుపుభాగాన్ని అటూ, యిటూ ఒత్తి చూశాడు. పనిమనిషి చేతిలోని సిరెంజీని తీసుకొన్నాడు. ఒక వైపు సూది, రెండవ వైపు రబ్బరు తొడుగు వున్నాయి దానికి. రామనాథం పొడుగ్గావున్న సూదిని దాని కడుపులో వున్న నరానికి గ్రుచ్చాడు. ఒక్కక్షణంలో క్రొద్దిగా నీరు, కొంత రక్తం వచ్చింది సిరెంజిలోకి. సూదిని వెలుపలికి లాగి మళ్లీ యింకో చోట గ్రుచ్చాడు. ఈసారి నీరు బొట్లు, బొట్లుగా సిరెంజీలోకి రాసాగింది. అంతవరకు రామనాథం ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రమేష్ ఆసక్తిగా చూస్తున్నాడు.

'దీనికి మూత్రనాళం పదిహేను రోజుల క్రింద చెడిపోయింది. ఆ రోజు మూత్ర విసర్జన లేక దీని కడుపు ఉబ్బిపోయింది. వెంటనే వెటర్నరీ డాక్టరు దగ్గరికి తీసుకవెళ్ళాం. ఆపరేషను చేసి సరిచేయాలంటే వృద్ధాప్యంవల్ల తట్టుకోలేక పోవచ్చునని, యీ పద్ధతిలో మూత్రాన్ని విసర్జింప చేశాడు. అప్పటినుంచి యిలాగే రోజుకి నాలుగైదుసార్లు తీసే

స్తుంటాము. దానికి అవసర మనుకొన్నప్పుడు 'కుయ్, కుయ్' మంటూ నా దగ్గరికి వస్తుంది. నేను లేనప్పుడు యీ పనివాడి దగ్గరికి వస్తుంది. అంటూ ఆప్యాయంగా ఆ కుక్క తల నిమిరాడు రామనాథం.

పది సంవత్సరాల కాలం తనతో కలసి వున్న ఆ కుక్క మీద ఎంత అభిమానం! ఎంతో దగ్గరివారు అనారోగ్యంతో మంచానపడితే, అంతకుముందున్న ఆప్యాయతలు మరిచిపోయి వారొక బరువుగా ఫీలయే వారు మనలో ఎంతమంది లేరు!

రామనాథం లేచి రమేష్ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ 'కట్టుకొన్న భార్యని చంపిన యీ కసాయివాడు నోరులేని ప్రాణికి జీవన్మరణ స్థితిలో సాయం చేయడం హాస్యాస్పదంగా వుందికదూ?' అని ఠక్కున అడిగే సరికి రమేష్ ఉలిక్కిపడ్డాడు.

మాటలు వెతుక్కొంటూ 'నాకు మీ విషయాలన్నీ తెలుసునని ఎందు కనుకొంటున్నారు' అడిగాడు.

రామనాథం విషాదంగా నవ్వాడు. అతని నుదుటి మీద నిలువుగా ఒక నరం పెల్లుబికింది. కళ్ళచుట్టు గీతలు ఎక్కువైనాయి. ఆ క్షణాన అతను తన వయస్సుకి మించిన వృద్ధునిలా కనిపించాడు.

'మన అసోసియేషన్ సభ్యుల సంగతి నాకు బాగా తెలుసు రమేష్. మనం కలిసిన మరురోజే నా గురించి వారు తప్పనిసరిగా చెప్పి వుండాలి. అలా వారు చెప్పలేకపోతే, ఆరోజు వారికి భోజనం జీర్ణం కాదు' అంటూ రామనాథం బరువుగా అడుగులు వేస్తూ లోపలికి నడిచాడు.

రమేష్ అతన్ని వెంబడించాడు— ఆంధ్ర సంఘంలో తెలిసిన విషయాలను నెమరువేసుకొంటూ.

మూడవ రోజు రమేష్ సంఘానికి తొందరగా వచ్చాడు. అప్పటికి యింకా రామనాథంగారు రాలేదు. విశ్వనాధ్, శాస్త్రి ఎంతో ఆప్యాయంగా పలకరించి తన చెరో ప్రక్కన చేరారు.

'మీరు క్రొత్తగా వచ్చారు. ఇక్కడివారి గురించి మీరు పూర్తిగా తెలుసుకోవాలి. ఎవ్వరు ఎటువంటి వారో కనుక్కొని మసలాలి' అని శాస్త్రి మొదలుపెట్టాడు.

'మీరు రామనాథంగారితో సన్నిహితంగా వుండటం సంతోషమే' కాని ఆయన పైకి ఎంత అమాయకంగా కనిపిస్తారో, లోన అంత కపటి' అన్నాడు విశ్వనాథం.

రమేష్ కనుబొమలు ముడిపడ్డాయి వాళ్లు ఏమి చెప్పదలుచు కొంటున్నారో అతనికి తెలియదు. కాని యేదో అనుమానం అతడ్ని ఆవరించింది.

'అలాగా !' అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు రమేష్.

'చూడటానికి పెద్దమనిషిలా వుంటారు కదా ! భార్యతో లెక్క లేనన్ని పేచీలు. ఇద్దరికీ ఎప్పుడూ పడేది కాదు. ఇక్కడికి ఎప్పుడో ఒక సారి తీసుకువచ్చేవారు. వచ్చిన మరుక్షణమే యితను యేదో అంటే, ఆమె విసుగుతో వెళ్ళిపోయేది.' అసలు విషయానికి దిగాడు శాస్త్రి.

'భార్యాభర్తలమధ్య తేడాలు వుండడం మామూలే కదా!' అన్నాడు రమేష్.

అతను త్రాగుబోతని, వ్యభిచారని మొదటి నుంచి చాలామంది అంటూనే వున్నారు. మేముకూడా నమ్మలేదు. కాని వాళ్ళయింటి ప్రక్క వారు, రామనాథంగారు చాలసార్లు భార్యని కొట్టి హింసించారని చెప్పితే, మేము విన్న విషయాలు నిజమని తేలాయి.'

రమేష్ ఏమీ మాట్లాడలేకపోయాడు దానితో యింకా ఉత్సాహంగా 'వారి మధ్య భేదాలు పెరిగిపోయాయి. అతనిహింసలకు అంతులేకపోయింది. చివరికి మూడు నెల్ల క్రితం కిరసనాయిలు పోసి ఆమెకు నిప్పంటించాడు. నిండు ప్రాణాన్ని పొట్టన పెట్టుకొన్నాడు' శాస్త్రి పూర్తిచేశాడు.

రమేష్‌కి ఒళ్లు జలదరించింది. ఎంతో మంచి మనిషిగా తను రూపొందించుకున్న రామనాథంగారికి, యింత పశుత్వాన్ని అంటగట్టు తున్నారే వీరు అని విస్తుపోయాడు.

'మీ రన్నట్లు అతను చేస్తే, పోలీసు చర్య తీసుకోలేదా ?' అనుమానం వెలిబుచ్చాడు రమేష్. 'ఆ, పోలీసు దేముందండి? రామనాథం గారు మంచి హోదాలో వున్నారు. డబ్బు పారవేస్తే ఎన్ని నోర్లయినా మూయించవచ్చు' అంటూ శాస్త్రి, విశ్వనాథం వెళ్ళిపోయారు.

రమేష్ ఏదీ నిర్ధారణ చేసుకోలేకపోయాడు. మానవుల గురించి పూర్తిగా తెలుసుకోవాలంటే కష్టమే అని మాత్రం అనుకొన్నాడు. నిజం కానిదే విశ్వనాథం, శాస్త్రి తనకి యీ విషయాలు ఎందుకు చెప్పుతారు? రామనాథంగారితో కలసి మాట్లాడినప్పుడుగాని, ఆయన్ని చూచినప్పుడుగాని రమేష్‌కి యీ విషయాలు గుర్తుకి వచ్చేవికావు. వ్యక్తిగత విషయాలు తనకు అవసరం లేదనుకొని మామూలుగా రామనాథంగారితో కలసిపోయాడు.

* * *

కడిగిన చేతులను తుడుచుకొంటూ, రమేష్ కూర్చున్న చోటికి వచ్చాడు రామనాథం.

'రమేష్! కొంతమందిలో ఏముంటుందో కాని మొదటి పరిచయం తోనే సన్నిహితులవుతారు. నిన్ను చూడగానే ఏదో వాత్సల్యం, చనువు నాలో చోటుచేసుకొన్నాయి. కలకత్తాలో నావాడు అని చెప్పదలుచుకోవా లంటే, ముందు నీ రూపమే నాముందు నిలుస్తుంది. మన స్నేహం అపార్థాలకు, అనుమానాలకు తావివ్వకుండా నా విషయాలు పూర్తిగా చెప్ప దలుచుకొన్నాను.' గంభీరంగా చెప్పడం మొదలు పెట్టాడు రామనాథం.

వయస్సులో పెద్దవారైనా రామనాథంగారు, అలా తన గత విష యాలు చెప్తానంటే అడ్డు చెప్పక, ఆసక్తిగా వినసాగాడు రమేష్.

రామనాథం, అరుంధతి వివాహం పెద్దవాళ్ల ఆదరణలో యిరవై ఏళ్ల నాడు జరిగింది. పెళ్లిచూపుల నాటి పరిచయం, పెళ్లి తర్వాత ప్రేమగా మారింది. వాళ్ల ప్రేమ ఫలితంగా రఘు, అరుణ సంతానం. నాలుగేళ్లు నిండకముందే అరుణ జబ్బుపడి కన్నుమూసింది. కన్నతల్లి మనస్సు యీ నష్టానికి ఎంతో తల్లడిల్లింది. రామనాథంగారిది కేంద్ర ప్రభుత్వోద్యోగం. ప్రతి మూడు సంవత్సరాలకు ముడుపు చెల్లించినట్లు ట్రాన్స్‌ఫర్ ఆర్డరుని అధికారులు ఆయన చేతిలో వుంచేవారు. ఊరూరా తిరుగుతూంటే రఘు చదువు పాడవుతుందని రామనాథంగారు, అతన్ని హైదరాబాదులోని పబ్లిక్ స్కూల్లో చేర్పించాడు. అది అరుంధతికి గొడ్డలి పెట్టు అయ్యింది. అంతకుముందే అరుణని కోల్పోయిన మనస్సుకి రఘుని వదిలి దూరంగా

వుండటం సాధ్యం కాదని భర్తకు నచ్చజెప్పింది. ఇంగ్లీషు మీడియం స్కూల్లోనే చదివిస్తూ, తను కొడుకు బాధ్యత తీసుకొంటానని హామీ యిచ్చింది. ముందు యిలాగే అనుకొని చాలామంది దంపతులు తమ పిల్లల భవిష్యత్తుని పాడు చేశారని, రఘుకి దూరంగా వుండలేకపోతే, హైదరాబాదులో అబ్బాయిని చూచుకొంటూ కాలం గడపమని కోరాడు రామనాధం.

అరుంధతికి అంతా అయోమయ మనిపించింది. భర్తను వదిలి వుండడమనే విషయాన్ని ఆమె కలలో కూడా ఊహించలేకపోయింది. మనస్సుని రాయిగా చేసుకొని భర్తతో వుంటూ, అప్పుడప్పుడు వెళ్ళి కొడుకుని చూచి వసుందేది

రోజంతా గడవటానికి ధనికవర్గాల స్త్రీలతో స్నేహం ఏర్పరచుకొంది అరుంధతి. అమితంగా సినిమాలు చూడటం, పేకాడటం, సాయంత్రాలు క్లబ్బుకు వెళ్ళడం మొదలైన అలవాట్లు ఆమెకు అబ్బాయి. అరుంధతిలో యీ మార్పుని గమనించి రామనాధం ఆశ్చర్యపోయాడు. రెండు మూడు సార్లు ఆమెని మందలించినా ఆమె అలవాటు మానుకొనలేదు.

ఉద్యోగంలో ఉన్నత శిఖరాలు అందుకోవాలని, జీవితంలో ఒక స్థాయిని సంపాయించుకోవాలని ఆశపడుతూ రామనాధంగారు, రాత్రింబవళ్లు ఆఫీసు వ్యవహారాల్లో మునిగి తేలుతూ అరుంధతి విషయం ఎక్కువగా పట్టించుకునేవాడు కాదు. సినిమాల్లో, క్లబ్బుల్లో ఎంతో ప్రేమగా వ్యవహరిస్తున్న జంటలను చూచి, తను యేదో అమూల్యమైన వస్తువుని పొందలేకపోయిందని బాధపడసాగింది. ఆ బాధ రామనాధంపై ఈసడింపుగా మారింది. రాత్రుళ్ళు ఆమె మత్తుమాత్రలు వేసుకోనిదే నిద్రపోయేది కాదు.

పని మనిషి కాఫీకప్పులు టేబిలు మీద వుంచాడు. ఒక కప్పుని రమేష్‌కి అందించి, రెండవది తీసుకొన్నాడు రామనాధం. ఇంతలో కుక్క తోక ఊపుకుంటూ రామనాధం దగ్గరికి వచ్చింది. అతను దాని తల నిమిరి ప్రక్కకు వెళ్ళమన్నట్లు వీపుమీద నెమ్మదిగా తట్టాడు. ఆ కుక్క ఆజ్ఞను వెంటనే అమలు పరిచింది.

రామనాధం రెండు గ్రుక్కలు కాఫీ త్రాగి నెమ్మదిగా చెప్పసాగాడు.

'అలా మారిన గుణం అరుంధతికి యజమానె కూచుంది. నాకు

తెలిసిన పాత అరుంధతి ఎక్కడో మాయమైంది. ఎంత ఈసడించుకొన్నా, తొందరపడినా ఆమె మనస్సు బాగులేదని సహించేవాణ్ణి. నా పట్టుదల ఫలితంగా మా రఘు యిప్పుడు ఇంజనీరింగులో వున్నాడు.

'కలకత్తాకు వచ్చిన తర్వాత అరుంధతి పరిస్థితి యింకా విపరీత ధోరణిలో పడింది. స్త్రీలకు మినోపాజ్ (బహిష్టు ఆగిపోవడం) అనే స్థితి నలభై దాటిన తర్వాత వస్తుంది. ఆమె సరిగ్గా అదే స్థితిలో వుంది. ఇంతకుముందు వున్న ఈసడింపుకి, మినోపాజ్‌తో వచ్చిన చిరాకు తోడైంది. ఎన్నోసార్లు నలుగురిలో నానామాటలు అని నవ్వులపాలు చేసింది. బాధతో కుమిలిపోయాను.

'ఆరోజు సాయంత్రం అలసటగా యింటికి వచ్చాను. ఫ్లూ జ్వరం అప్పుడే మొదలైనట్లుంది. శరీరం వెచ్చగా వుంది.

ముస్తాబై బయటకు వెళ్తున్న అరుంధతి ఎదురైంది. ఏమిటిలా వున్నారు ? అని యీ పది సంవత్సరాలుగా నన్ను ఒకసారి కూడా ఆమె ప్రశ్నించలేదు. ఈసారి కూడా నేను ఆమె సానుభూతిని ఆశించలేదు. లోపల బరఖా వున్నాడేమో, కాస్త కాఫీ చేసి యివ్వమని చెప్పు అని నెమ్మదిగా అడిగాను.

'ఆమె కనుబొమ్మలు విసుగుతో ముడిపడ్డాయి. వాడు యిప్పుడే బజారుకి వెళ్ళాడు. వచ్చిన తర్వాత అడగండి అని ఆమె ఒక అడుగు వేయబోయింది.

'ఒంట్లో కాస్త సుస్తీగా వుంటేను........ అని నాలో నేను అనుకొంటూ వంట గదిలోకి వెళ్ళాను. వేడి కాఫీ తీసుకొంటే ఒళ్లు నొప్పులు తగ్గుతాయనిపించింది.

'అగ్గిపెట్టెను వెదికి గ్యాస్ స్టౌవ్‌ను వెలిగించుదామనుకొన్నాను. అంతలో అరుంధతి లోనికి వచ్చింది. ఆమె ఆరోజు ప్రశాంతంగా కనిపించింది 'నేను చేసి తెస్తాను వెళ్లండి అని ఆమె అగ్గిపెట్టెను నా చేతిలో నుండి తీసుకొంది. ఆమె వంగి గ్యాస్‌స్టౌవ్‌ను సరిచేస్తుంటే నెమ్మదిగా యివతలికి వచ్చాను. సోఫాలో కూచున్నానో లేదో ఏమండీ మంటలు, నన్ను రక్షించండి! అని వంట గదిలో నుండి అరుంధతి ఆర్తనాదాలు చెవుల్లో పడ్డాయి. మరుక్షణంలో నేను వంట గదిలోకి పరుగెత్తాను.

'అప్పటికే అరుంధతిని చుట్టివేయాలని మంటలు ఎగిసి పడుతు న్నాయి. ఒకమూల చిల్లి పడ్డ ట్యూబునుంచి వస్తున్న గ్యాసు పెద్దమంటలుగా లేస్తోంది. వెంటనే ప్రక్క రూంలోకి వెళ్ళి బ్లాంకెటు తెచ్చి అరుంధతికి కప్పాను. కాని అప్పటికే టెరిలీను చీర మంటల్లో మసి అయిపోయింది.

'ఇరుగు, పొరుగు వచ్చారు. మరోపది నిమిషాల్లో అంబులెన్సు వచ్చింది. మూడు రోజులు మృత్యువుతో తీవ్రంగా పోరాడి, చివరికి అరుంధతి ఓడిపోయింది' అని నిట్టూర్చాడు రామనాథం. సగం చల్లారి పోయిన కాఫీని రెండు గ్రుక్కలు మ్రింగాడు.

రమేష్ నిశ్చేష్టుడైనాడు. రామనాథంగారిది రవ్వంత దోషం కనిపించలేదు. ఒక వైపు భార్యను పోగొట్టుకొని. మరొకవైపు లోకనింద నెత్తినవేసుకొని ఎంతో బరువుగా కాలం గడుపుతున్నాడు. అతని ఎడ సానుభూతి, ఎంతో ఆదరం కలిగాయి రమేష్‌కి.

'భార్యాభర్తలు పరస్పరం అర్థం చేసుకొని జీవితం గడిపు తేనే సుఖముంటుంది. ప్రతి వ్యక్తిలో ఏవో లోట్లు వుండకపోవు. వాటిని సహించి, ఎదుటివారికి బాధ కలిగించకుండా నడుచుకుంటేనే సంసారంలో స్వర్గం చూస్తాం. అన్నట్లు— నీవు ఉద్యోగరీత్యా ఆరునెలలు నాగరిక ప్రపంచానికి దూరంగా, అడవుల్లో, కొండల్లో గడపాల్సి వస్తుంది కదూ! జాగ్రత్త! నీవు జీవిత భాగస్వామిని ఎన్నుకునేముందు బాగా ఆలోచించాలి. నిన్ను మెచ్చుకునేదిగా, నీ పనికి ఒప్పుకునేదిగా వుండాలి' అన్నాడు రామనాథం.

ఇంకా ఏవేవో విషయాలు మాట్లాడి రమేష్ లాడ్జికి బయలు దేరాడు.

# 3

ట్రాములో ఒక పదిమందికంటే ఎక్కువగా లేరు. డ్రైవరు ట్రాముని జోరుగా నడుపుతున్నాడు. రమేష్ ఆలోచనలు కూడా వేగంగా పరుగెత్తసాగాయి.

'నిన్ను మెచ్చుకొనేదిగా, నీ పనికి ఒప్పుకునేదిగా వుండాలి' అన్న రామనాథంగారి మాటలు చెవుల్లో గింగుర్లు పెడుతుంటే, తులసి రూపం మసక మసకగా కనిపించసాగింది. అంతలో మెరుపు తళుక్కున మెరిసిన భ్రమ— క్షణంలో అంతా వెలుగు, మరుక్షణంలో అంతులేని చీకటి. ఏ రూపమూ కనిపించలేదు.

తులసి కంది గ్రామం పటేలు రంగారెడ్డి కూతురు. చిన్నప్పటి నుంచి రమేష్‌తో బాగా చనువు. ఆ ఊరి స్కూల్లో రమేష్ అయిదవ తరగతి వరకు చదివి, ఆ తర్వాత ఆరవ తరగతికని, కందికి నాలుగు మైళ్ళ దూరంలో వున్న ఇబ్రహీంపేటకి వెళ్ళవలసి వచ్చింది. రోజూ కాలి నడకనే వెళ్ళి వచ్చేవాడు.

అప్పుడు తులసి మూడవ క్లాసులోవుంది. తను చిన్నదైనందుకు, రెండు తరగతులు వెనక వున్నందుకు ఎంతో బాధపడింది. రమేష్ తరగతిలో వుంటే అతనితో ఆడుతూ, పాడుతూ స్కూలుకి వెళ్ళివచ్చేది. ఆమెకు చదువుమీద ధ్యాసలేదు. ఎప్పుడు యీ రెండు తరగతులు దాటుతానా అనే ఆలోచనే ఆమె మస్తిష్కంలో తిరగసాగింది.

అయిదవ తరగతి అయిందనే సంతోషం ఆమెతో ఎక్కువసేపు నిలువలేదు.

'ఆడపిల్లకి యీ మాత్రం చదువు చాలు. పైకి చదివి ఉద్యోగాలు చేయాలా? ఊళ్లు ఏలాలా?' అని తులసి తల్లి చల్లగా అంది.

తులసి గుండె ఆగిపోయినట్లయ్యింది. రమేష్‌తో కలసి చదువుకోవాలని, కలసి తిరగాలని యీ రెండేళ్ళగా దినమొక యుగంలా గడిపింది. ఆమె ఆశల్ని నల్లబల్లమీద సుద్దముక్కతో రాసివున్న బొమ్మలను తడిగుడ్డతో తుడిచివేసినట్లయింది.

'ఏమిటే ఆ బూజుపట్టిన ఆలోచనలు? నీవు చదువుకోలేదని, పిల్లల్ని కూడా చదవ వద్దంటావా? ఇప్పుడు తులసి వయసెంతని? చదువుకోనీ, లోకజ్ఞానమైనా పెరుగుతుంది' అని రంగారెడ్డి మందలించాడు.

ఆ ఊరినుంచి ఇబ్రహీంపేటకి కనీసం పదిమంది పిల్లలు వెళ్ళే వారు. కాని రమేష్, తులసిది ఒక జట్టు. కబుర్లు చెప్పుకొన్నా, ఆటలాడు కొన్నా యిద్దరే!

ఆరోజు స్కూలుకి త్వరత్వరగా నడుస్తూ పోతున్నారు. వరి పొలాల మధ్య గట్లమీద హుషారుగా ముందు నడుస్తోంది తులసి. పండిన వరిమీద నుంచి వస్తున్న చల్లగాలికి తోడుగా ఈల వేస్తున్నాడు రమేష్.

'అమ్మో! పాము!' అనే తులసి కేక తనని చేరేలోపలనే, ఆమె వెనక వస్తున్న రమేష్ని గట్టిగా అల్లుకొంది. ఆత్రంగా అతను ముందుకి చూశాడు. గట్టుమీద అడ్డంగా పాము పాకుతూ పోతోంది. నీరెండలో పండిన వరిచేను రంగును పోలి మెరిసి పోతోంది ఆ పాము. చూడగానే నాగు అని తెల్సుకొన్నాడు రమేష్. ఇంకో రెండడుగులు ముందుకి వేసి వుంటే ఆమె పాముమీద నిలిచేది. తులసిని చూశాడు రమేష్.

ఆమె భయంతో వణకిపోతుంది. కళ్ళను గట్టిగా మూసుకొంది గుండె ఎంత వేగంగా కొట్టుకుంటుందో చెప్పలేం. నెమ్మదిగా ధైర్యాన్ని యిస్తూ వీపు తట్టాడు. తర్వాత ఆమెతలని మృదువుగా రాస్తూ "తులసీ, పాము వెళ్ళిపోయింది. ఏం భయంలేదు, కళ్ళు తెరువు" మెల్లగా అన్నాడు.

తులసి నెమ్మదిగా కళ్ళు తెరిచింది. మొదట ఆమె కళ్ళు పూర్తిగా వదలని భయంతో అటూ, ఇటూ కదిలాయి. పాము పోయిన చోటు వైపు చూచింది. ఆమె కళ్ళల్లో నుండి ఒక్కుమ్మడిగా నీరు కారసాగింది. రమేష్ ఆందోళన పడ్డాడు.

'ఎందుకు ఏడుస్తున్నావ్ తులసీ.... అది వెళ్ళిపోయిందిగా?'

'ఇంకో అడుగు ముందుకి వేసి వుంటే......... అమ్మో పాము నన్ను కరిచేది. నేను చచ్చి పోయేదాన్ని' యింకా ఏడ్వసాగింది.

'ఊరుకో. గండం గడిచిందని సంతోషించాలి కాని ఏడ్వకూడదు. పద స్కూలుకి టైము అవుతోంది' అని ఆమె కళ్ళను తుడిచాడు రమేష్.

'అమ్మో, యీ గట్టు మీద నుంచి నేను చచ్చినా యిక నడవను. అటువైపు నుంచి వెళ్దాము. నీవు ముందు నడువు' అంది తులసి.

ఆ రోజు నుంచి రమేష్ ఎప్పుడూ ముందు, అతని వెనకాల తులసి నడిచేవారు.

రమేష్ స్కూలు ఫైనల్‌కి వచ్చాడు. తులసి ఎనిమిదవ క్లాసులో వుంది. ఆరు నెలల పరీక్షలు మొదలైనాయి. మూడు రోజుల నుంచి తులసి స్కూలుకి రావడంలేదు. పరీక్షల గొడవల్లో అతను వాళ్ళ యింటికి వెళ్లి కనుక్కోలేకపోయాడు. పరీక్షలు అయిపోయిన సాయంత్రం తిన్నగా తులసి యింటికి వెళ్లాడు. గుమ్మంలో ఆమె తల్లి కనిపించింది. ఆమె ఆదరంగా 'రా బాబు, బడినుంచి వస్తున్నావా ?' అని అడిగింది.

'అవును. మూడు రోజుల నుంచి తులసి రావడం లేదు. కను క్కుందామని....'

'తులసా ?' అని ఎదురుగా వున్న గదివైపు తల త్రిప్పింది. అంత వరకు ఒక అమ్మాయితో 'కైలాసము' ఆడుతున్న తులసి రమేష్ ధ్వనితో ఆటను ఆపి లేచింది. రమేష్ చూపుని అటువైపు త్రిప్పేసరికి తులసి చటుక్కున గదిలోకి దూరింది.

'తులసి మొన్న రజస్వల అయింది. ఆమె యిక బడికిరాదు.'

'ఓహో !' అని తలూపి బయటికి నడిచాడు రమేష్. పుష్పవతి అవగానే చదువుకి చాలమంది ఫుల్‌స్టాప్ పెడతారని తెలుసు. కాని శారీరకంగా వచ్చే మార్పులు, దానితో మనస్సుమీద ఏర్పడే ప్రభావము అతనికి తెలియవు.

గ్రామాలలో ఆడపిల్ల పుష్పవతి అవగానే ఆ ఊరిలో వున్న వారందరికి తెలిసిపోతుంది. అది ఒక విశేషమైన సంఘటనగా భావిస్తారు. పట్టణాల్లో రజస్వల సంగతి అటుంచి, పిల్లల్ని కన్న స్త్రీయో, కాదో తెలుసుకోవడం కష్టం.

పదిరోజుల తర్వాత ఒక ఆదివారం దొంగచాటుగా బావి దగ్గరికి వచ్చింది తులసి. అలవాటు ప్రకారం అంతకుముందే వచ్చిన రమేష్ పొలాలకు పారుతున్న నీటిలో కాళ్ళుని కూచున్నాడు. ఆ బావి దగ్గరికి రాగానే అతని కదో వింత అనుభూతి. పాలేరు జంగన్న ఎద్దులను హుంషారుగా తోలుతుంటాడు. రెండు, మూడు నిముషాల కొకసారి బొక్కెన వంచిన నీరు అతని పాదాలకు ఒక వింత చల్లదనాన్ని అందించి పోతోంది.

తులసి రమేష్‌ని చూచి సిగ్గుపడుతున్నట్లు అతను మొట్టమొదటిసారి

గ్రహించాడు. ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా నడుస్తోంది.

జంగన్న నడుస్తున్న ఎద్దులను ఆపి 'ఏమమ్మో! పప్పన్నం ఎప్పుడు?' అని హాస్యంగా అడిగాడు, పెళ్ళెప్పుడని.

ఆమె తనతో గుడ్డలో కట్టి తెచ్చిన ఎండుకొబ్బరి, బెల్లం ముక్క, పూలపప్పు గుప్పిటతో జంగన్న చేతుల్లో పోస్తూ 'ఇప్పటికైతే యివి తీసుకో' అంది.

అవి కాస్తా నోట్లో వేసుకొని యింకా హుషారుగా ఎద్దులను అదిలించాడు జంగన్న.

తులసి నెమ్మదిగా రమేష్ దగ్గరికి వచ్చి అతని ప్రక్కన కూచొని కాళ్ళని నీళ్ళల్లో వదిలింది. ఆమెలో వింతకాంతి మెరిసిపోతోంది. పది రోజులుగా పట్టించిన పసుపు యింకా వదిలిపోక ఆమెకు బంగారు వన్నెని తెచ్చిపెట్టింది.

'ఇదిగో' అంటూ రమేష్ చేతిలో ఫలహారం పెట్టింది. అతను తీసుకొని కొద్దిగా నోట్లో వేసుకున్నాడు.

'జంగన్నకు పప్పన్నం కావాలట, ఎప్పుడు తినిపిద్దాం' అని తులసి నవ్వింది.

రమేష్ నోటిలో వెలగపండు పడిందన్న భావన కలిగింది. అమ్మాయిలు ఎంత తొందరగా ఎదుగుతారు. తన మనస్సులోని మాట ఎంత ధైర్యంగా చెప్పగలుగుతోందని ఆశ్చర్యపోయాడు.

'నేను పెళ్లి గురించి ఆలోచించేముందు చదువు పూర్తి చేసుకోవాలి- తర్వాత ఉద్యోగం వెదుక్కోవాలి.

'అంతే కదా! అంతవరకు నేను ఆగగలను. ఎటొచ్చీ మావాళ్ల వేరే సంబంధాలు చూడకుండా చేయాలి.'

'ఇప్పుడేం తొందర ? సమయం వచ్చినప్పుడు నేనే చెప్తాను మీ బాబుతో' అని హామీ యిచ్చాడు రమేష్.

'ఏమో ! ఈ పదిహేను రోజులు నిన్ను చూడకపోతే ఏదో పోగొట్టు కొన్నట్టుంది. ఇంతకుముందులాగా ఎక్కడికంటే అక్కడికి వెళ్ళవద్దని, అందరితో చనువుగా మాట్లాడవద్దని మా అమ్మ నన్ను హెచ్చరించింది.

'నీకు వీలు చిక్కినప్పుడు యిక్కడికే రా' అని కోరాడు రమేష్
'వస్తాను. చాలా సేపయింది వచ్చి' అని తులసి బయలు దేరింది.

*   *   *

తులసి కొరకు రంగారెడ్డి ఎన్నో సంబంధాలు చూశాడు. కొన్ని అతనికి నచ్చలేదు. ఒక్కటో, రెండో నచ్చాయి కాని వాళ్ళు అడిగిన కట్నాలు ఆకాశానికి అర్రులు చాచిన వారి కోరికల్లా వుండడంతో వదులుకొన్నాడు.

'ఇప్పుడే యేం తొందరలే' అనుకునేంతలో సంవత్సరాలనే గట్లను అయిదింటిని కాలప్రవాహం వేగంగా దాటిపోయింది.

రమేష్ యిప్పుడు ఎం. యస్సి., ఫైనలియర్‌లో వున్నాడు. ఇంకో రెండు నెలల తర్వాత పరీక్షలు. అతను తులసిని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడు. సెలవుల్లో ఊరుకి వచ్చినప్పుడు ఆమెను ఎప్పుడు చూడాలా అని మనస్సు ఆరాటపడేది. జంగన్న నీళ్ళుపారిస్తూ పరధ్యానంలో వుంటే, చల్లగా పారుతున్న నీటిలో ప్రక్కనే వుంచిన తులసి పాదాలను తన పాదంతో నిమిరినప్పుడు విద్యుత్ప్రవాహం ఒళ్ళంతా పాకిపోయేది. పరీక్షలు వ్రాసి వచ్చిన వెంటనే అన్ని విషయాలు రంగా రెడ్డిగారితో మాట్లాడుతానని మాట యిచ్చాడు రమేష్.

కాని అతని ఆశాసౌధాలు ఒక్క ఊపుతో కూలి పోయాయి. తను కలలు గంటున్న విషయాలు, కేవలం కలలుగా, కల్లలుగా నిలిచి పోయే పరిస్థితి ఏర్పడుతుందని అతను ఊహించనైనా లేదు.

ఆరోజు తులసి మొదటి సారిగా వ్రాసిన వుత్తరం అందించి. తండ్రి తనకు సంబంధం కుదుర్చుతున్నాడని, త్వరగా రావలసిందని కోరింది.

రమేష్ తులసి ప్రేమించుకొన్నట్లు కంది గ్రామ ప్రకృతికి బాగా తెలుసు. తానుగా యింకా చెప్పలేదు కాని, తాము చనువుగా తిరుగుతున్న విషయం జంగన్న యింట్లో చెప్పేవుంటాడు. వాళ్ళు కొంచెమైనా శ్రద్ధ తీసుకోలేదని బాధ పడ్డాడు రమేష్. పోనీ, తండ్రితో యీ విషయం తులసి చెప్పవచ్చుగా! తులసి మీద జాలి కలిగింది రమేష్‌కి. అబల, గౌరవ ప్రతిష్ఠలు కలిగిన యింటి ఆడబడుచు. తల్లితండ్రులు యిష్టపడిన సంబంధానికి నిరసన ఎలా వ్యక్తం చేయగలుగుతుంది?

ఎలాగైనా ఆ సంబంధాన్ని ఆపి, తన తులసిని దక్కించుకోవాలని, వెంటనే కందికి బయలు దేరాడు రమేష్.

బస్సు దిగిన తర్వాత కంది గ్రామానికి రెండు గంటలసేపు నడవాలి. అతి వేగంగా నడుస్తున్నాడు. సాయంత్రం మూడు గంటలవుతోంది. ప్రొద్దున కాఫీ తాగాడంతే! భోజనం చేయకపోయినా తొందరగా చేరు కోవాలనే ఆ కాంక్ష, అతనిలోని సత్తువని ద్విగుణీకృతంచేసి ముందుకు తోస్తోంది.

ప్రేమ వివాహాలు ఈ రోజుల్లో ఎన్ని జరగడంలేదు? చదువు, ఆస్తి, మంచి కుటుంబం కలిగివున్న తనని తులసి తల్లి తండ్రులు ఎందుకు కాదంటారు? కాకపోతే, తను ముందుగా చెప్పలేక పోయాడు. అది పొరపాటే! చదువు పూర్తి అయిన తర్వాత చెబుదామని నిర్లక్ష్యం చేశాడు. కాని ఒక్క పొరపాటుతో రెండు నిండు మనసుల్ని విడదీయడం భావ్యమా? జీవితాంతం వారు పగిలిన హృదయాలతో కాపురం చేయడం అన్యాయం. తులసి లేని జీవితం రమేష్ ఊహించుకోలేక పోతున్నాడు. అతని ఆలోచనలు అడుగులతో పందెం వేస్తున్నాయి.

నేరుగా తులసి యింటికే వచ్చాడు రమేష్. గుమ్మంలో అడుగు పెట్టగానే ఎదురుగా రంగారెడ్డి వాలుకుర్చీలో చుట్టకాలుస్తూ కనిపించాడు. అతను కొంత ఆశ్చర్యంగా ముందుకి వంగి, దాన్ని కనిపించకుండా మామూలుగా 'రా రమేష్! ఎప్పుడు వచ్చావు ఊరునుంచి?' అని పలకరించాడు.

'ఇప్పుడే వస్తున్నాను' అని దగ్గరగా వచ్చాడు రమేష్.

'అలాగా, కూచో' అని ప్రక్కన వున్న కుర్చీని చూపించాడు.

అసలు విషయం ఎలా మొదలు పెడదామా అనే ఆలోచనలో రమేష్ కూచోలేకపోయాడు. అతను కూచోలేకపోయేసరికి, రంగారెడ్డి నెమ్మదిగా లేచి, చుట్ట చివరలో పట్టిన బూడిదను రాలుస్తూ;

"నీవు ఎందుకు వచ్చావో నాకు తెలుసు. కాని తులసి పెళ్ళికి ముహూర్తం కూడా నిశ్చయమైంది. ఈ సంబంధం ఖాయం చేద్దామనుకునే సరికి తులసి నీ విషయం చెప్పింది. వాళ్ళ అమ్మ ఆక్రోషంతో తులసిని చితకబాదింది. పరువే ప్రాణంగా బ్రతికే నాకు తలను తీసివేసినట్లయింది. నలుగురిలో నవ్వులపాలుచేస్తే, ముందు ఆమెని చంపి, తర్వాత నేను

చస్తాను అని బెదిరించాను' చెప్పుకుపోయాడు.

'మా విషయం తెలిసిన తర్వాత కూడా నన్ను కాదనడానికి, నాలో ఏం లోపం వుందని?- ఎందుకు మమ్మల్ని విడదీస్తున్నారు?' అడుగుదామని రమేష్ పెదవులు తడిచేసుకోవడంతో,

'బాబు, నీవు బాగా చదువుకొన్నవాడివి, బుద్ధిమంతుడివి - నీవు అన్ని విషయాలు గ్రహిస్తావని నమ్ముతున్నాను. మీది గౌడ కులం, మేము రెడ్లం. ఈ కుల వ్యవస్థ మన సంఘంలో యిప్పటికీ చెక్కు-చెదరకుండా వుంది. ఇంకా కొన్ని తరాలు గడిచిన తర్వాత కూడా యిలాగే వుంటుంది. వర్ణాంతర వివాహం జరిపించాలని నీతులు చెప్పడం వేరు, చేసుకోవడంవేరు. చేసుకొన్నవారు ఎంతటి నవ్వుల పాలైనారో, ఎటు వంటి యిబ్బందులు పడ్డారో, నేను కళ్లార చూశాను. అందుకే నా కూతు రుని అటువంటి ఆపదనుంచి కాపాడుకొన్నాను. నీవు తులసిని పూర్తిగా మర్చిపో.'

నిజమే. తను గౌడ కులంలో పుట్టాడు తన తండ్రికాని, అన్న కాని ఈత చెట్లనుండి మద్యం తీయడంలేదు. ఆ కులానికి సంబంధించిన ఏ పని చేయడంలేదు. రెడ్ల లాగానే వ్యవసాయం చేసుకుంటూ, ఆస్తిని పెంచు కొన్నారు. కాని కులతత్వాన్ని గౌరవించే రంగారెడ్డికి ఆ విషయం ఎలా నచ్చచెప్పాలో అర్థం కాలేదు. మేము ప్రేమించుకున్నాం అని మనస్సు విప్పి చెప్పిన కూతురిపై చేయి చేసుకోవటం అన్యాయం అనుకున్నాడు. తులసి ఎంత ధైర్యవంతురాలు. తను చెప్పకపోయినా, ఆమె అన్ని విష యాలు చెప్పగలిగింది. ఇప్పుడు వీళ్ళని ఎదిరించి తులసిని తనదానిగా చేసుకోవాలి. మనసార ప్రేమించిన తులసిని చేయిపట్టుకొని తనవెంట తీసుకెళ్ళితే?

రమేష్ ఒళ్లు జలదరించింది. అతను ఆ పని ఎన్నటికి చేయలేడు. వృద్ధాప్యంలో వున్న తండ్రి యీ విషయం తెలిస్తే గుండె పగిలి చస్తాడు. ఎంతో ప్రేమతో చూస్తున్న అన్నయ్య ఊరిలో తల ఎత్తుకోలేడు. మొండి పట్టుదలతో వున్న రంగారెడ్డి ఎలాంటి అఘాయిత్యమైనా చేయగలడు, ఇంతటి కల్లోలం లేపి, ఆ అలలు తమని అంటకుండా నిశ్చలంగా'

వుండి సంసారం చేయడం సాధ్యమా ? అస్సలు అటువంటి సంసారం సార్ధకమవుతుందా ?

'నేను, తులసి ఒక్కటౌతామనే యిన్ని రోజులు ఆశ పడ్డాను, మీరు మళ్లీ ఒకసారి ఆలోచించండి. మా జీవితాలను బలి చేయవద్దు' అని చివరిసారిగా అన్నాడు రమేష్.

'రమేష్! మనస్సు అనేది ఒక్క మనిషికి సంబంధించినది. మనస్సు విరిగినా ఆ మనిషి చచ్చినా అతనితోనే అంతమవుతుంది. కాని పరువు, నలుగురితో కూడిన విషయం. ఒక్కసారి ఒక్కరి పరువు పోయిందంటే తరతరాలుగా ఆ యింటి వారికి అది శాపమై పీడిస్తుంది. నలుగురు వేలెత్తి చూపించినప్పుడు బ్రతకడం వ్యర్థం, నేను నమ్మిన విషయాలు యివి. ఇక వాదించక వెళ్లిపో. తులసిని, మమ్మల్ని వదిలి వెళ్ళిపో. లేకపోతే, మా యింటిలోని వాళ్ళందరం నీ ముందే చచ్చేది ఖాయం.'

రమేష్ ! ఉలిక్కిపడ్డాడు ఆ మాటలకు. అంతలో తలుపు చాటున ఏదో గాజుల చప్పుడు వినిపించింది. ఎదురుగా తులసి ధారాపాతంగా కన్నీరు, పెదవులు ఒణుకుతున్నాయి.

'వెళ్లిపో రమేష్, బాబు పంతం నీకు తెలియదు. ఆయన అన్నంత పని చేస్తాడు, వెళ్ళు' అంటూ తులసి వెనక్కి తిరగకుండా లోనికి పరుగెత్తింది.

రమేష్‌కి ఏడుపు ముంచుకు వచ్చింది. అది ఎక్కడ కట్టలు త్రెంచు కొంటుందోనని గిరుక్కున తిరిగాడు.

తొలిప్రేమ సఫలీకృతం కావించుకొన్నవారు ఎంతటి అదృష్ట వంతులు. నవలల్లో, సినిమాల్లో ఒక్క చూపులోనే ప్రేమించుకోవడం జరిగి పోతుంది. తనకు కూడా అలాగే సులువుగా పెళ్లి జరుగుతుందని, చిన్న నాటి నుంచి చనువుగా వుండి ప్రేమించిన తులసిని దక్కించుకొంటాననని భ్రమపడ్డాడు. కలలు వేరు, జీవితం వేరు. మనసార ప్రేమించిన మనిషిని, సంఘం కొరకు, పెద్దలు నమ్మిన సిద్ధాంతాల నిమిత్తం ఆమెని తనకు కాకుండా చేస్తుంటే, నిస్సహాయుడిగా, నిశ్చలంగా వుండిపోయాడు.

అలా ఆలోచనలతో ఊగుతూ ఊరి వెలుపలికి వచ్చాడు రమేష్ స్మశాన వాటికలో ఒక చితి చివరి దశలో మందంగా మండుతోంది. జనం

ఎవ్వరూలేరు. ప్రక్కనే ఉన్న బండమీద కూలబడ్డాడు.

తాను నిజంగా పిరికి వాడా ? చదువుకొన్నవాడివని, బుద్ధిమంతుడ వని రంగారెడ్డిగారు ముందుగానే తన కాళ్ళకు బేడీలు వేశాడు. మంచి వాడంటే పిరికివాడా?

తన మంచితనానికి నిదర్శనంగా, తన వారి మేలుకోరిన ఫలితంగా తన మనస్సులో చిన్ననాడు నాటుకొని, రెక్కలు తొడిగి, అప్పుడే పూలు పూయనున్న ప్రేమ మొక్కని విరిచి, చితిగా పేర్చుకొన్నాడు. ఈ క్షణంలో తులసికి, తనకు ఎటువంటి బంధం లేదు. ఆమె రూపాన్ని బలవంతంగా చెరిపి వేయాలి. అతనికి సుడులు, సుడులుగా ఏడుపు ముంచుకు రాసాగింది.

'భవానీపూర్' అని కండక్టరు అరవగానే రమేష్ ఉలికిపడి, యీ లోకంలోకి వచ్చాడు. ట్రాము దిగి లాడ్జివైపు బయలుదేరాడు.

# 4

రమేష్‌కి మహారాష్ట్ర భవన్ రానురాను విసుగెత్తించింది. ఒక్కొక్క రూములో యిద్దరు వుండాలి. ప్రొద్దున లేవగానే బాత్‌రూముల దగ్గర క్యూ. ఏకాంతం గాని, ప్రశాంతం గాని అక్కడ బొత్తిగా కనిపించవు. ఆదివారం రోజు మరీ విపరీతంగా వుంటుంది. ఏవో పాటలు, కేకలు పదిమంది ఒక రూంలో చేరి పేకాడుతూ చేసే అల్లరి అక్కడ మామూలు ఎలాగైనా ఒక గదిని అద్దెకు తీసుకొని అక్కడి నుంచి వెళ్ళిపోవడం మంచిదనుకొన్నాడు రమేష్.

ఆ రోజు సాయంత్రం అతను ప్రవీణ్‌తో కలసి విక్టోరియా వైపు బయలుదేరాడు. భవానీపూర్‌లో భవనాలు చాల పాతగా వున్నాయి వంద సంవత్సరాలని అవి వెనక్కితోసినట్లనిపిస్తున్నాయి. శరత్‌బాబు తన నవలల్లో ఆ యిళ్ళని, అందులో ఊహాకందని వ్యక్తులని ఎందరినో సృష్టించాడు.

అప్పుడే ప్రకృతి చీకటి ముసుగు కప్పుకుంటోంది. వెల వెలబోయిన వెన్నెల కాంతిలో చలువరాయితో మలచబడిన విక్టోరియా కట్టడం, ముసుగులోంచి సిగ్గుగా చూస్తున్న యువతిలా వుంది.

కాంపౌండు ప్రక్కన విశాలమైన మైదానం, చక్కని మెత్తటి గడ్డి, నిలువుగావున్న చెట్లు ఎంతో అందాన్ని యిస్తున్నాయి. గడ్డిలో కూచుంటూ ఎదురుగా వున్న బిర్లా ప్లానేటేరియమ్ (నక్షత్ర ప్రదర్శనశాల) భవనాన్ని చూస్తున్నాడు రమేష్.

దృష్టిని అటువైపే కేంద్రీకరించాడు. చక్కగా ముస్తాబైన నలుగురు అమ్మాయిలు రోడ్డుమీద వరుసగా నిలుచున్నారు. టాక్సీ ఒకటి వారి ముందు ఆగినట్టే ఆగి కొంత ముందుకుపోయింది. మళ్ళీ తిరిగి వచ్చి యీసారి వాళ్ళముందు ఆగింది. టాక్సీలో వున్న యిద్దరు పురుషులు వారితో యేదో మాట్లాడారు. కొద్దిసేపట్లో యిద్దరు అమ్మాయిలు అందులోకి ఎక్కగానే టాక్సీ కదిలిపోయింది.

మరికొంచెం సేపటికి ఒకతను అక్కడ నిలుచున్న అమ్మాయిల దగ్గరికి వచ్చాడు. ఏదో మాట్లాడి ఒక అమ్మాయిని చేయి పట్టుకొని రోడ్డు యివతలకి తీసుకవచ్చాడు. తిన్నగా రమేష్ వాళ్లు కూచున్నవైపు వచ్చి చెట్లు గుబురుగా వుండి, నీడలు క్రమ్మినవైపు వెళ్లారు. ఆ వ్యక్తి పైపై సుఖాల కొరకు వెళ్తున్నాడని చూడగానే తెలుస్తోంది.

రమేష్ కడుపులో యేదో తిప్పినట్లయింది. 'ఛీ' అనుకొన్నాడు.

'ఇక్కడ ఎప్పుడు యిలాగే జరుగుతోందా ? వ్యభిచారం యింత పబ్లిక్‌గా జరుగుతూంటే అధికారులు ఎలా వూరుకొంటున్నారు !' రమేష్ ప్రశ్నించాడు.

ప్రవీణ్ నవ్వాడు. అతను సంవత్సరం నుంచి ఆ విషయాలు చూస్తున్నాడు. అప్పుడప్పుడు పోలీసువ్యాను వస్తుంది. కాని అంతకు ముందే, ఆ అమ్మాయిలదగ్గర మామూలు తీసుకొంటున్న పోలీసు వాళ్ళకు తెలియబరిచివుంటాడు. దూరంగా వస్తున్న వ్యానుని చూచి ఆ అమ్మాయిలు నీడల్లో, జనంలో కలసిపోతారు. పోలీసు జవానులు వ్యాను ఎక్కగానే, మళ్ళ మామూలు కథే!

'మన హైదరాబాదులో కూడా బిజీగా వున్న రోడ్లమీద, పుట్ పాత్‌ల నిండా పళ్ళు, కూరగాయలు అమ్ముతుంటారు. పోలీసు ఎన్నో సార్లు దుకాణాలు ఎత్తేయిస్తారు, పోలీసు అటు పోగానే మళ్ళీ దుకాణాలు వెలుస్తాయి' అన్నాడు ప్రవీణ్.

'నీవు అనేది యీ వ్యభిచారం, నీతిగా తమకు తోచిన వ్యాపకం చేసుకోవటం ఒక్కటంటావా?' రమేష్ అనుమానం వెలిబుచ్చాడు.

'నా ఉద్దేశ్యం అదికాదు. వీళ్లందరూ చేసేది కేవలం పొట్ట కొరకే; చుట్టు ప్రక్కల వున్న గ్రామాలనుంచి బ్రతుకుదామని వచ్చిన వారితో, శరణార్థులతో కలకత్తా నిండి వుంది. అందరికీ పనులు ఎక్కడ దొరుకుతాయి? ఉండడానికి యిళ్లు వుండవు. రోడ్లమీద, పార్కులలో కాలం వెళ్లబుచ్చుతారు. పని లేక, తిండి లేక వాళ్లు వ్యభిచారమనే నీచ వృత్తికి దిగుతారు.'

'పని చేయదలుచుకొన్నప్పుడు ఏదో ఒక్కటి దొరక్కపోదు. ఒక వ్యక్తిగాని, జాతిగాని, దేశంగాని అభివృద్ధిలోకి రావాలంటే కాలం వృధా చేయకుండా పని చేయాలి. ఎటువంటి పనైనాసరే ఉత్పత్తిని పెంచడానికి సాయపడాలి' అని మాట్లాడుకొంటూ యిద్దరు లేడ్జివైపు నడిచారు.

# 5

రమేష్, ప్రవీణ్ ఆశగా బాలీగంజ్‌లోని కోమల విలాస్ హోటలు దగ్గరికి వచ్చారు. మూడు రోజుల నుంచి వరుసగా వస్తూనే వున్నారు. కాని అక్కడే కలుస్తానన్న అప్పలస్వామి అంతులేడు. వారం రోజుల క్రింద అతన్ని వారికి ఒక మిత్రుడు పరిచయం చేశాడు. అప్పలస్వామి వ్యాపకం యిళ్ళను అద్దెకు కుదర్చడం. ఇంటివారి దగ్గర అద్దెకు తీసుకొంటున్న వారి దగ్గర చెరో నెల అద్దెని వసూలు చేసుకొంటాడు.

పేపర్లో ప్రకటనలు చూచి, కుదుర్చుకొందామని వెళ్లేలోపల యింకెవరో తీసుకోవడం ఎన్నోసార్లు జరిగింది. తెలిసిన మిత్రుల ద్వారా ఎంతగానో వాకబు చేయించి ఫలితం పొందలేకపోయారు. మహారాష్ట్ర భవన్ వసతి విసుగొచ్చి బ్రోకర్ ద్వారానైనా యిల్లుని సంపాయించాలని అప్పలస్వామి దగ్గరకు వచ్చారు.

మడమల పైకి తెల్లలుంగీ, గీతల చొక్కా, బీడ వేసుకొన్న అప్పలస్వామిని చూడగానే అరవవాడు అనే భావన కలుగుతూంది.

రమేష్‌తో వచ్చిన స్నేహితునితో తెలుగులో మాట్లాడ్డం మొదలు పెట్టాడు అప్పలస్వామి. తమిళం, బెంగాలీ భాషలతో అతిగా సంపర్కం కలిగించుకొన్న అతని తెలుగు అదోరకంగా వుంటుంది.

'ఆంధ్రులా? ఎన్ని రూముల యిల్లు కావాలి? పెళ్ళి అయిందా?' వాకబు చేశాడు అప్పలస్వామి.

'హైదరాబాదు నుంచి వచ్చారు. బాత్‌రూం వసతి కలిగిన ఒక పెద్ద గది వుంటే చాలు. ఇంకా పెళ్లి యిద్దరిలో ఎవ్వరికి కాలేదు. ప్రస్తుతానికి యిద్దరు కలిసే వుంటారు' వివరించాడు మిత్రుడు.

'మన వాళ్ళనగానే యిక్కడి వారు యిళ్ళని సంతోషంగా యిస్తారు. మున్ముందు ఎటువంటి పేచీలురావని వారి నమ్మకం. కానీ, పెళ్లి కాని వారు అంటే కొంచెం జంకుతారు. వీలైతే అద్దెను కూడా పెంచుతారు. ఇంతకు ఏ ఏరియాలో కావాలి.'

'బస్సు స్టాండుకి దగ్గర్లో, హోటలు వసతి వున్న ఏ స్థలమైనా సరే; ఈ చుట్టు ప్రక్కల అయితే బావుంటుంది' అన్నాడు రమేష్.

'మీరు కోరిన ఏరియాలో అయితే కనీసము నూట యాభై అద్దె అవుతుంది.'

'గది నచ్చితే. అది మేము యిచ్చుకోగలము. కొంచెము త్వరగా కుదర్చాలి' అన్నాడు ప్రవీణ్.

'అలాగే; ముందు ఓ పాతిక అడ్వాన్సు యివ్వండి. నాలుగు రోజుల తర్వాత వస్తే యీలోగా నేను ఆచూకీ తీస్తాను' అనగానే డబ్బుని అప్పలస్వామి చేతిలో వుంచి బయలు దేరారు మిత్రులు.

వరుసగా మూడు రోజులనుంచి అప్పలస్వామి కనిపించకపోయే సరికి ఆరోజు నిరాశచెందారు. ప్రక్కనే నిలుచున్న యింకో బ్రోకరుతో అప్పలస్వామి గురించి అడిగారు.

'నాలుగు రోజుల నుంచి రావడంలేదు. ఏమైనా ఇళ్ల అద్దెకు కావాలా సార్ ?' ఆత్రంగా అడిగాడు అతను.

'అవును. కాని అప్పలస్వామి అరేంజ్ చేస్తానని అడ్వాన్సు తీసు కొన్నాడు. ఇంకో రెండురోజుల్లో ఫస్టు. అంతలోపునే యిల్లు కుదిరితే బావుండేది' విషయం చెప్పాడు ప్రవీణ్.

'అలాగా స్వామి యిల్లు యిక్కడికి నాలుగు ఫర్లాంగులు. లేక్ మార్కెట్ వెనుక' అని గుర్తులు చెప్పాడతను.

గుర్తుల ప్రకారం బాగా పాతబడిన ఒక యింటి ముందు నిలుచు న్నారు రమేష్, ప్రవీణ్. వాకిట్లో ఆడుకొంటున్న పిల్లల్ని అడిగి, అదే యిల్లు అని తెలుసుకొని తలుపు తట్టాడు రమేష్. రెండవసారి తట్టుదా మనుకునేంతలో తలుపు తెరుచుకుంది.

ఎదురుగా ఒక అమ్మాయి. ముడువని కురులను భుజం మీది నుంచి ముందుకి వదిలింది. ఎర్రని అంచుతోవున్న తెల్లటి చీర, లేత ఆకు పచ్చని జాకెట్టు ఆమెకేదో విశిష్టతను యిస్తున్నాయి.

ప్రశ్నార్థకంగా ఆమె క్షణం సేపు చూచి 'కి చాయిశ్చేన్' బెంగాలీలో అనేసరికి, రమేష్ యీ లోకంలోకి వచ్చాడు.

అతను గొంతు తడిచేసుకునేంతలో, 'మేము అప్పలస్వామిని కలుద్దామని వచ్చాము' అని ప్రవీణ్ హిందీలో జవాబు చెప్పాడు.

ఆమె గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళింది. మరుక్షణంలో తిరిగి వచ్చి 'రండి' అని హిందీలో ఆహ్వానించింది.

గది పెద్దగా వుంది. పాతదైనా, వస్తువులు పొందికగా అమర్చ డంతో అందంగా కనిపిస్తోంది. ఒక మూల అప్పలస్వామి పడుకొన్నాడు.

'రండి..... మిమ్మల్ని కలుద్దామనుకుంటే.... నాలుగు రోజులుగా నన్ను యీ జ్వరం వదలడంలేదు' అని ఓపిక చేసుకొని అప్పలస్వామి కూచున్నాడు.

'జ్వరమెచ్చినట్లు మాకు తెలియదు. ఫస్టుకి యింకా రెండు రోజులే మిగిలాయి. అంతలో యిల్లు కుదిరితే బావుంటుందని కలవడానికి వచ్చాం.'

'మంచి పని చేశారు కూచోండి' అని ఎదురుగా వున్న రెండు పాత కుర్చీలను చూపించాడు. అంతవరకు ఎదురుగా నిలుచున్న అమ్మాయిని వుద్దేశించి 'ఈమె నా కూతురు రేణు' అని పరిచయం చేశాడు.

'మా రేణు ఇక్కడే పుట్టి పెరిగింది. బెంగాలీ భాషలోనే చదువు కొంది. కాని తెలుగు కూడా బాగానే మాట్లాడుతుంది' చెప్పుకుపోతున్నాడు అప్పలస్వామి.

'ఎక్కువగా మాట్లాడకు బాబా! జ్వరం యింకా తగ్గలేదు........ మాగో (అమ్మో!) యీ మాటల్లోపడి నేను పొయ్యిమీద వేసిన పప్పు సంగతి మరిచేపోయాను' అని రేణు ఆత్రంగా లోనికెళ్ళింది.

'దేశప్రియ పార్కు వెనకాల ఒక రూమ్ చూశాను. దాని తలుపు, కిటికీ రెండూ దక్షిణంవైపే వున్నాయి. మీకు తెలుసనుకొంటాను. కలకత్తాలో అలావున్న వాటికి అద్దె ఎక్కువ అడుగుతారు. ఎందుకంటే- దక్షిణంవేపు నుంచే యిక్కడ గాలి వీస్తుంది. తలుపు అటువేపు వుంటే, గదిలో ఫ్యాను కూడా వేసుకోవలసిన పనిలేదు' చెప్తూపోయాడు అప్పలస్వామి.

'ఈ రెండు రోజుల్లో నేను లేచి నడిచే వీలు కనిపించడం లేదు. ఆ యింటి గుర్తులు, యజమాని పేరున లెటరు వ్రాసి యిస్తాను. రేపు వెళ్ళి కలవండి.'

'అలాగే! అవును, మొదటి నుంచి మీరు యిక్కడే వున్నారా?' కుతూహలంగా అడిగాడు ప్రవీణ్.

'లేదు బాబు! అదో పెద్ద కథ. నేను పుట్టి పెరిగింది బరహంపూర్‌లో. తాతలు సంపాదించిన పొలం శ్రీకాకుళం దగ్గర్లో వుండేది. అది అమ్ముకొని మా నాన్న బరహంపూర్ పట్టణానికి వలస వచ్చాడు. బాగా సంపాదించి, ఆ స్తిని కూడ బెట్టుకోవాలనే ఆశ తీరకుండానే కన్నుమూశాడు. అమ్మను చూచుకొంటూ, చిల్లర పనులు చేయసాగాను నేను. అక్కడ ఒక టీ కంపెనీలో బంట్రోతుగా చేరాను. ఆ పనిలో నాకు తృప్తి కలగలేదు.

నాన్న మరణంతో ఆగిపోయిన చదువును సాయంత్రాలు కొనసాగించాను. శ్రద్ధగా పనులు చేస్తూ, తెలివిగా మాట్లాడుతుంటే అందరు నన్ను మెచ్చుకునేవారు' అంటుండగానే రేణు టీ కప్పులతో ప్రవేశించింది.

ఒక కప్పు ప్రవీణ్‌కి యిచ్చింది, ఇంకోటి రమేష్‌కి యివ్వడానికి వచ్చింది. అబ్బా! ఆమె ముఖం ఎంతస్వచ్ఛంగా, సున్నితంగా వుంది. సన్నని ముక్కు, కణతలను దాటిపోవాలని ప్రయత్నించే కళ్లు, మచ్చుకైనా మచ్చలేని మొహము.....నిజంగా స్వచ్ఛమనే పదానికి ఆమె ముఖం చూచే అర్థం చెప్పాల్సివస్తుంది అనుకొన్నాడు రమేష్.

ఆలోచనల అలల్లో అయోమయంగా చూచిన రమేష్‌కి ఆమె అల వోకగా నవ్వినట్లనిపించింది. అతను టీ కప్పుని అందుకొంటుంటే ఆమె చేయి వణికినట్లు భ్రమ కలిగింది. తన చేయికూడా వణికిందో, ఏమో అతనికి సరిగా తెలియదు.

ఒక గ్రుక్క త్రాగి బ్రహ్మాండంగా వుందన్న భావాన్ని కళ్ళతోనే చెప్పాడు రమేష్. ఆ మెప్పుని అరమోడ్పు కన్నులతోనే అందుకొని వంటగదివైపు దారితీసింది రేణు.

అప్పలస్వామి కూడా రెండు గుక్కల టీ తాగి, 'కలకత్తా నుంచి అప్పుడు ఒక ఇంగ్లీషు ఆఫీసరు బరహంపూర్‌కి వచ్చాడు. రెండు రోజులు నా పనిని చూచి మెచ్చుకొని కలకత్తాకు వస్తే పెద్ద ఉద్యోగం ఇస్తానన్నాడు. ఆ మరునటి నెలలోనే నేను కలకత్తాకు చేరుకొన్నాను. మా అమ్మ రావ డానికి నిరాకరించింది. సంవత్సరం కాగానే నాకు వివాహ మయ్యింది. బరహంపూర్ నుంచే రేణు తల్లి వచ్చింది. ఆ తర్వాత నా దౌర్భాగ్యపు రోజులు మొదలైనాయి. ఆ దొర తన దేశానికి వెళ్ళిపోయాడు. మరి కొన్నాళ్ళకు మా కంపెనీ మనవారి స్వాధీన మయ్యింది. పై పదవుల్లో వున్న బెంగాలీలు తమ వారికి ప్రమోషన్లు, లాభాలు యిచ్చారు. నన్ను, మరికొందరిని క్రిందికి నెట్టివేశారు. ఇంటి అద్దెలకు, పెరిగిపోతున్న ఖర్చు లకు వచ్చిన జీతం బొటాబొటీగా సరిపోయేది. ఏమీ కూడబెట్టలేక పోయామే అనుకునేంతలో రిటైరు అయ్యాను. అప్పటినుంచి అద్దెకు ఇళ్లు కుదర్చడంతో జీవనం గడిచిపోతోంది' అని అప్పలస్వామి కప్పులో మిగిలిపోయిన టీని పూర్తిగా త్రాగాడు.

'రేణు' అన్న కేకకు, ఆమె జవాబుగా వచ్చింది. అప్పలస్వామి చెప్పిన పేరు, అడ్రసు వ్రాసి ఆమె ప్రవీణ్ చేతికి కాగితం యిచ్చింది.

'రేపు వస్తాం' అని నమస్కారం చేసి రమేష్, ప్రవీణ్ బయలుదేరారు.

# 6

కొత్తగదిలోకి మారిన తర్వాత రమేష్ హాయిగా ఫీలవుతున్నాడు. రూముకి రాగానే ప్రశాంతంగా వుంటుంది.కూర్చుని ఏదైనా ఆలోచించేందుకు వీలవుతుంది.

ఆ రోజు ఆదివారం అసోసియేషన్ మీటింగు వుంది. ప్రవీణ్ ఏదో మార్నింగ్ షో సినిమాకి వెళ్లిపోయాడు.

రమేష్ ఆంధ్ర సంఘం ఆవరణలో అడుగు పెట్టేసరికి, అప్పటికే చాలమంది వచ్చారు. కొంతమంది ఒకమూల కూర్చుని రాజకీయాల గూర్చి తీవ్రంగా చర్చించు కొంటున్నారు.

అసోసియేషన్ సెక్రటరీ రాగానే పదకొండు గంటలకి మీటింగు మొదలైంది. ఆ రోజు ఎజెండాలో ముఖ్యమైనవి మూడు విషయాలు వుంచారు. రాబోయే సంక్రాంతికి సాంస్కృతిక కార్యక్రమాలు, ఈ కార్యక్రమాల ఖర్చులకు నిధి వసూలు.

చర్చల తర్వాత మెంబర్లు కలసి రెండు మంచి నాటకాలు వేయాలని, ఆంధ్రనుంచి మంచి పేరున్న పార్టీని పిలిచి కూచిపూడి నాట్యాన్ని ఏర్పాటు చేయాలని నిర్ణయించారు.

'ముఖ్య అతిథిగా రైల్వేలో మంచి హోదాలోవున్న శ్రీరామమూర్తి గారిని పిలిస్తే బావుంటుందని నేను భావిస్తున్నాను,' అని సెక్రటరి రఘునాథ్ సూచించాడు. కొంతమంది మెంబర్లు యింకా కొన్ని పేర్లని సూచించారు.

'నా వుద్దేశ్యంలో ఏ సంఘానికైనా, సమాజానికైనా ప్రభుత్వ ఆదరణ ముఖ్యం. అందుకుగాను మంత్రిని పిలిస్తే బావుంటుంది. ఆంధ్ర నుంచి విద్యాశాఖ మంత్రిగారిని ఆహ్వానించాలి. ఇక్కడ ముందు ముఖ్య మంత్రిగారిని ఒప్పించడానికి ప్రయత్నించాలి. అతనికి వీలుకాని పక్షంలో, యిక్కడి విద్యాశాఖ మంత్రిని రప్పించాలి. మన స్కూలుకి సొంతభవనం లేదు. మన మంత్రిగారి చేత అసోసియేషను నిమిత్తం స్థలం యిప్పించ వలసిందిగా యిక్కడి మంత్రిగారికి చెప్పించాలి.' అని రమేష్ సలహా యిచ్చాడు.

'అది నిజమే! ఇద్దరు మంత్రులను పిలవాలి అంటే మాటలు కాదు. ముందు వారికి అనువైన టైము చిక్కాలి. యిద్దరికి తగినట్లుగా ఇక్కడ మనం అన్ని అరేంజిమెంట్స్ చూడాలి' సందేహం వెలిబుచ్చాడు రఘునాధ్.

'మనం కాస్త ఘనంగా చేస్తేనే మన పనులు కూడా నెరవేరు తాయి. రమేష్ సలహాని నేను పూర్తిగా సమర్థిస్తున్నాను.' అన్నాడు రామనాధం.

'మినిష్టర్లతో ఉత్తర, ప్రత్యుత్తరాలు జరిపి అనువైన తేదీలు నిర్ణయించడానికి ఎవ్వరికైనా బాధ్యత యివ్వాలి. రమేష్‌కి యిది ఒప్పజెప్పితే బావుంటుంది.' మూర్తి సలహా.

'నాకు చేతనైనంత సాయం చేస్తాను. కాని ఉద్యోగ రీత్యా బహుశా నేను డిశంబరులో క్యాంపుకి వెళ్ళవలసి వుంటుంది. నేను యిక్కడ వున్నంతకాలం మీరేది చెప్పినా నేను చేయగలను."

ఆ సందర్భంలో ఒక మాగజైన్‌ను వేయాలనుకొన్నారు. అందులో వివిధ కంపెనీల వారి దగ్గర అడ్వర్‌టైజ్‌మెంట్లు అడిగి వేయించి, ఖర్చులకు కావలసిన డబ్బుని విరాళంగా వసూలు చేయవచ్చునని అంచనా వేశారు.

'వచ్చేవారం మొదటిసారిగా సుధగారి దగ్గరికి వెళ్దాం. ఇంతకు ముందు సాయంచేసినట్లు యిప్పుడు కూడా కనీసం అయిదు వందలకు తక్కువ యివ్వరు!' అని రఘునాధ్ సలహా.

'ఎవ్వరీ సుధగారు?' నెమ్మదిగా మూర్తిని అడిగాడు రమేష్.

'గొప్ప ఆస్తిపరురాలు— మంచి మనస్సు కలది. మన అసోసియేషన్‌కి ఆమె ముఖ్యమైన పాట్రన్.'

తరువాత మీటింగుని పదిహేను రోజుల తర్వాత జరపడానికి నిశ్చయించారు.

# 7

రమేష్‌కి యిప్పుడు చదువుకోడానికి రాత్రిళ్ళు వీలవుతోంది. లైబ్రరీలో మెంబర్‌షిప్పు తీసుకొన్నాడు. తన ఆఫీసుకి దగ్గరలో వుండడం వలన మధ్యాహ్నం లంచ్ సమయంలో లైబ్రరికి వచ్చాడు. ఆ రోజు తనకు యిష్టమైన రెండు పుస్తకాలను ఎన్నుకొని కౌంటర్ దగ్గరికి వచ్చాడు, అప్పుడే పుస్తకాలు ఇస్యూ చేయించుకొని ఒకతను ప్రక్కకు జరిగేడు.

రమేష్ ఆశ్చర్యపోయాడు. కౌంటరులో కూర్చున్నది రేణు. ఆమెని చూడగానే అతని గుండె వేగంగా కొట్టుకోసాగింది. తెల్లని చీరమీద నీలి రంగు సన్నని డిజైను, చక్కగా కట్ చేయబడిన నీలిరంగు జాకెట్టు ఎంతో చక్కగా కుదిరాయి. చెవులకు ముత్యాల్లాంటి దుద్దులు ఆమెకు ఎంతో అందాన్నిస్తున్నాయి.

కళ్లు దించుకొని ఏదో రాస్తున్న రేణు, రమేష్ అడుగుల చప్పుడు విని 'ఎస్ ప్లీజ్' అని చేయిని ముందుకి చాపింది, పుస్తకాలు యివ్వమని. తన ఆలోచనల్లోంచి తేరుకొనడానికి ఒక్క క్షణం ఆలస్యమైంది రమేష్‌కి.

'ఎస్.........'అని రేణు తలెత్తింది. ఆమె ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసే ధ్వనితో 'మీరా?' (మీరా!') అంది.

'అవును, నేనే! ఏం నేను రాకూడదా మీ లైబ్రరీలోకి?' నవ్వుతూ అన్నాడు.

'మోస్ట్ వెల్‌కమ్! సడెన్‌గా చూచేసరికి నమ్మలేక పోయాను. రండి యిలా కూచోండి' అని ప్రక్కనే వున్న కుర్చీని చూపించింది.

రమేష్ కూచోగానే చేతిలోని పుస్తకాలు తీసుకొని స్టాంపువేసింది.

'ఇంకో రెండు నిమిషాల్లో లంచ్‌కని గంట సేపు లైబ్రరీని మూసి వుంచుతారు. మీరు కొంచెము ముందుగా రావాలి.

'నేను ఆఫీసు నుంచి లంచ్‌కని బయలుదేరి తిన్నగా యిక్కడికే వచ్చాను.'

'పదండి. నేను కూడా లంచ్‌కి వెళ్లాలి. ఆకలి దంచేస్తోంది' మరేమి వినిపించు కోకుండా రేణు ప్రక్కన వున్నతనికి చెప్పి రమేష్‌తో బయలు దేరింది.

'ఎన్ని రోజులైంది. మీరు యీ లైబ్రరీలో చేరి?' ప్రశ్నించాడు రమేష్.

'ఆరు నెలలయింది' సమాధానం.

ఛౌరంగి రోడ్ల మీద జన సముహం ముమ్మరంగా వుంది. ఇద్దరు కలిసి నడవడం చాలా కష్టంగా వుంది. అంతలో రేణు ప్రక్క సందులోకి తిరిగింది.

'ఇక్కడ మదరాసు హోటలు వుంది రండి' అని హోటల్లోకి దారి తీసింది.

జనం ఎక్కువగా ఉన్నారు. సీట్లు చాలక చాలామంది నిలుచున్నారు. ఫ్యామిలీ రూములో ఒక టేబులు ఖాళీగా వుంటే యిద్దరు కూచున్నారు.

కలకత్తాలో మదరాసు టిఫిను అంటే చాలామందికి యిష్టం. ఆ పేరుతో ఎంత నాసిరకం టిఫిన్లు యిచ్చినా జనం పరమానందంగా తింటారు. ఆ విషయం గ్రహించి అక్కడి వారే హోటలుపెట్టి 'సౌత్ ఇండియన్ డిషెస్' అని సర్వ్ చేస్తుంటారు.

దోసెలకు ఆర్డరిచ్చాడు రమేష్. 'మీ నాన్నగారు యిప్పుడు బాగా కోలుకొన్నారా?' అని అడిగాడు.

'ఆఁ. రెండురోజులనుంచి తన వ్యవహారాలు కూడా చూసుకుంటు న్నాడు?'

ప్రక్కనే కూచున్న ఒక పడుచు జంట ఆర్డరు చేసిన టిఫిను యింకా వచ్చినట్లు లేదు. ఆ అబ్బాయి, ఆమె చేయిని తన చేతితో

ఒత్తుతూ ఏవోకబుర్లు చెప్పుకొంటూ గట్టిగా నవ్వుతున్నారు. ప్రక్కవాళ్లు చూస్తారు, ఏమైనా అనుకొంటారనే ఆలోచన వారికి ఏమాత్రం వచ్చినట్లు లేదు.

కొద్దిసేపు వాళ్ళనే చూచి రమేష్ యిటు ముఖం తిప్పగానే, అతని ఆశ్చర్యాన్ని గమనించిన రేణు చిరునవ్వు నవ్వింది. 'ఇక్కడ యిదొక వింతకాదు. ఎవ్వరు పట్టించుకోరు' అని యింకా నవ్వింది.

'అయితే అది మీకు యిష్టమా ?' అడుగుదామని నోటిదాకా వచ్చిన మాటలను ఆపేశాడు. ఆమె చేయిని హఠాత్తుగా తన చేయివేసి పట్టుకొంటుందేమో అనే భయంతో, రెండవ చేతితో దాన్ని గట్టిగా పట్టు కొన్నాడు రమేష్.

'మనస్సులు కలసినప్పుడు వాళ్లకు యిష్టమైనవి చేయవచ్చు— కాని యింత పబ్లిక్‌గా....'

'మనస్సులు కలువవలసిన అవసరంలేదు అని యిక్కడ చాల మంది అభిప్రాయం. ఇద్దరికీ నచ్చితే, కంపెనీ కోసం బయటికి వెళ్తారు. తమ సాన్నిహిత్యాన్ని చాటటానికి పబ్లిక్‌లో యిలాంటి పనులు చేస్తుం టారు. అది కేవలం ప్రదర్శన కొరకే.'

'మీరేమైనా అనండి, నాకు యిలాంటివి చూడాలంటే చిరాకు.'

'చిరాకా ? పోనీ ఒక అమ్మాయి, మీకిష్టం లేకపోయినా వచ్చి చేయి పట్టుకొంటుంది— అప్పుడేం చేస్తారు?' కొంటెగా ప్రశ్నించింది రేణు.

రమేష్ గట్టిగా నవ్వాడు. 'మీరు భలేవారండి' అని యింకా ఏమనాలో తెలియక మళ్లీ నవ్వాడు.

ఆయన సమస్యకు పరిష్కారంగా సర్వర్ ప్లేట్లుతెచ్చి ముందుంచాడు.

దోసె ఏడిసినట్లుంది. సగం సరిగ్గా కాలలేదు. చట్నీ ఏదో వాసనగా వుంది. రేణు మాత్రం యిష్టంతో గబ గబ తినేస్తోంది. రమేష్ నెమ్మదిగా తింటూ యేదో ప్లేటు ఖాళీ అయిపోయేలా చూశాడు.

కాఫీలు తాగుతుండగా సర్వర్ బిల్లు తెచ్చి టేబిలు మీద ఉంచాడు. బిల్లు కొరకు యిద్దరు ఒకేసారి చేతులు చాచారు. రమేష్‌కి బిల్లుకు బదులు

ఆమె చేయి దొరికింది. ఏదో అమృత వాహిని సరాసరి తనలోకి ప్రవహిస్తున్న భ్రమ కలిగింది అతనికి.

'ఇది న్యాయం కాదు. బిల్లు యిటు యివ్వండి' అన్నాడు రమేష్.

'ఇది మరీ అన్యాయం. మిమ్మల్ని నేను ఆహ్వానించాను. ఈ రోజు మీరు నా గెస్టు.........వదలండి.'

'సరే, యీ సారి నేను ఆహ్వానిస్తే మీరు రావాలి. ఆ షరతుకి మీరు ఒప్పుకుంటేనే నేను వదిలేది.'

ఆమె తియ్యగా నవ్వింది. 'అలాగే. యిప్పుడైనా వదలండి' అని చేయి వదలించుకొని, పర్సులోంచి పది రూపాయలనోటు తీసి ప్లేటులో వుంచింది. సర్వర్ తీసుకెళ్లాడు.

మాట్లాడుతూ లైబ్రరీదాకా వచ్చి, రేణుకి వీడ్కోలు యిచ్చి సంతోషంగా ముందుకు సాగాడు రమేష్. అతనికి ఆలోచనలు అలలు అలలుగా వస్తున్నాయి.

రేణుని చూచిన మొదటిరోజు నుంచే రమేష్ మనస్సులో యిష్టం ఏర్పడింది. ఆమె అందంలో ఒక విశిష్టత కనిపించింది. ఇంతకుముందు ఎంతోమంది అమ్మాయిలను చూశాడు. కాని రేణులోవున్న అందం, ఆకర్షణ ఏ ఒక్కరిలో లేవు. ఆమె అందంలో పండు వెన్నెల్లాంటి తెలుపు, మంచుకొండల్లోంచి అప్పుడే లోయలోకిదిగిన నిర్మలమైన సెలయేటి నీటి చల్లదనం, మత్తు యింకా వదలని పద్మాలు, కళ్లు తెరపడానికి సూర్యుడు ప్రసరించే బంగారు కిరణాల వేడి–అన్నీ కలసి వున్నాయి. ఇది భ్రమ కావచ్చు. దానికి రమేష్ ఒప్పుకొంటాడు. కాని ఆమె శరీరం చుట్టూ ఏదో తెలియని స్వచ్ఛమైన వెలుగు ప్రసరిస్తోందని కచ్చితంగా చెప్పగలడు.

రేణుతో ఉన్నంతసేపూ ఒక్క గంట ఒక్క క్షణంలా గడిచిపోయింది. ఆమెతో యింకా మాట్లాడాలని, కలసి తిరగాలనే మనస్సుని బలవంతంగా వెనక్కు నెట్టి, ఆఫీసు వైపు నడిచాడు రమేష్. తను రేణుని ప్రేమిస్తున్నాడా ? ప్రేమ అనగానే కందిలో జరిగిన విషయాలు మళ్లీ కళ్ళ ముందర కదలాడాయి.

పరీక్షల తర్వాత రమేష్ కంది చేరుకొన్నాడు. అక్కడ కాలం గడవటమే కష్టమైంది. కాలక్షేపానికి పొలం పనులు చూడ సాగాడు. పొలం పండించే విధానంలో ఎన్నో కొత్త పద్ధతులు ప్రవేశ పెట్టాడు. ఉద్యోగాలకు మట్టుకు దరఖాస్తులు వేస్తూనే వున్నాడు.

ఆ రోజు పొలం దగ్గర వరి పొలానికి నీరు సరిగ్గా పారడానికి కాలువలను సరిచేయిస్తున్నాడు. పాలేరు వీరయ్య 'అయ్యగారు, మన పయ్య తార మీద ఆంబోతు యీ రోజు పారింద్ది' ఆనందంగా తెలియ జేశాడు.

'తారనా?' ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

'అదే అయ్యగారు, మీ చదువు అయిన తర్వాత సంకరజాతి ఆవుని తెచ్చారు కదా ! దానితో వచ్చిన ఆవు దూడే తార.

ఇప్పుడు రమేష్ నిజంగా ఆశ్చర్యంలో మునిగిపోయాడు. తనకు తెలియకుండానే ఎం.యస్సి.పాసయి నాలుగు సంవత్సరాలు గడిచిపోయాయి.

పాడితో లాభంగా వుంటుందని అప్పుడు రెండు సంకరజాతి ఆవులు, నాలుగు గేదెలు తీసుకొని వచ్చాడు రమేష్.

ఇంకో పదిహేను రోజులకి రమేష్‌కి ఉద్యోగం వచ్చింది. కలకత్తాలో పోస్టింగ్. ఇంట్లో వాళ్ళు మొదట్లో అభ్యంతరం చెప్పినా, వెళ్ళాలని రమేష్ నిర్ణయించుకోవడంతో ఏమీ అనలేకపోయారు.

సామాను ఎడ్లబండిలో వేసుకొని, దారి సరిగ్గా లేకపోవడంతో దాని ప్రక్కనే నడుస్తున్నాడు రమేష్. అతను హైదరాబాదు నుండి కలకత్తాకు వెళ్ళాలని బయలుదేరాడు.

ఊరి పొలిమేర దాటిన తర్వాత ఒక బండి ఎదురైంది. దగ్గరికి రాగానే బండిని తోలేవాడు ఆపి 'దండాలయ్యా' అని చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

అతన్ని ఎక్కడా చూచినట్లు గుర్తుకు రాకపోవడంతో లోపల ఎవరున్నారో అని రమేష్ చూపుని అటువైపు త్రిప్పాడు.

బండిలో తులసి కూచుని వుంది. తనని చూచి మందంగా నవ్వింది. రమేష్‌కి నవ్వాలనిపించలేదు. దగ్గరగా వచ్చాడు.

తులసి బాగా మారిపోయింది. బాగా లావెక్కింది. మూడేళ్ల కుర్రాడు ప్రక్కన కూచున్నాడు. ఆరు నెల్ల పాప ఒళ్లో నిద్రపోతోంది.

'ఇప్పుడేనా రావడం?' చొప్పదంటు ప్రశ్న అనుకొంటూనే అడిగాడు రమేష్.

'అవును. ఆరు నెలల నుంచి వద్దామనుకొంటూంటే ఆయన ఒప్పుకో లేదు. అందులో యీ పిల్లలతో ఎటు వెళ్ళాలన్నా వీలుకాదు పిల్లలను చూచుకొంటూ, ఆయనకు అవీ యివీ సర్దిపెట్టేసరికి దినం ఎప్పుడో గడిచిపోతుంది' అని ఆనందంగా చెప్పుకుపోతోంది తులసి.

ఆడవారు ఎంత తొందరగా మారిపోతారు. గతాన్ని పాతరవేసి తారుమారైన పరిస్థితులకు అనుగుణంగా తమని మలుచుకొంటారు. ఈ నాలుగు సంవత్సరాలుగా అనుభవించిన జీవితం ఆమె తృప్తిలోనే కనిపిసుంది. తను అనుభవించిన ఆవేదన గుర్తుకు రాగానే విస్తుపోయాడు రమేష్.

ఒకనాడు తులసిని తాను ప్రేమించినట్లు మనస్సులో ఎక్కడో కని పించినా, ఆ క్షణాన ఆ రూపాన్ని గట్టిగా తుడిచి వేశాడు రమేష్. ఎవరి జీవితం వారిది. ఎవరికితోచిన విధంగా వారు అనుభవించడం అది వాళ్లకున్న స్వేచ్ఛ.

'ఎక్కడికి ప్రయాణం?' తులసి ప్రశ్న.

'కలకత్తాకు.........నాకు ఉద్యోగం వచ్చింది.'

'చూడు బాబు, అదిగో మీ కాకయ్య! కలకత్తాకు వెళ్తున్నాడు. ఏం కావాలో చెప్పు, తెస్తాడు' అని కొడుక్కి రమేష్ని చూపిస్తూ అంది.

కొత్తగా వున్న వ్యక్తిని చూచి భయంగా తలని క్రిందికి దించు కొన్నాడు ఆ కుర్రాడు.

రమేష్ నిర్లిప్తంగా నవ్వాడు. జేబులోంచి అయిదు రూపాయల నోటు తీసి ఆ కుర్రవాడ చేతిలోవుంచి 'వస్తా, నాకు ఆలస్యమవుతోంది' అని వెనక్కి తిరిగి చూడకుండా గబగబా నడిచాడు.

మళ్లీ యీ రోజు రేణుతో చనువుగా తిరగాలని, మాట్లాడాలని అని పించేసరికి ప్రేమేమోనని అనుమానం కలిగింది రమేష్కి.

# 8

ఆ రోజు ఆదివారం కావడంతో సంఘం మెంబర్లతో కలసి విరాళాలు వసూలు చేయడానికి రమేష్ బయలుదేరాడు. ఆ క్రిందటి ఆదివారం సుధగారు కలవకపోవడంతో ఈ రోజు మళ్ళీ ఆమె దగ్గరికి బయలుదేరారు.

అలీపూర్‌లో ఒక చిన్న ఇంట్లో వుంటోంది. ఆమెకు నా అన్నవాళ్లు తల్లి ఒక్కర్తె. బాగా ఎదిగివచ్చిన తమ్ముడు మూడేళ్ళ క్రింద ఆక్సిడెంటులో మరణించాడట.

తలుపు తట్టగానే పనిమనిషి తలుపు తెరిచింది. 'అమ్మగారు వున్నారు. కూచోండి' అని లోనికి వెళ్ళింది.

రూము చిన్నగా వున్నా, అందంగా అలంకరించబడివుంది ఒకమూల అక్వేరియమ్ చక్కగా అమర్చబడింది. రకరకాల చేపలు పసందుగా నీటిలో తిరుగాడుతున్నాయి. అక్వేరియమ్ ప్రక్కనే వున్న టేబిలు మీద ఉంచిన ఫొటో పైన చూపుపడింది. రమేష్ ఉలిక్కిపడ్డాడు.

ఆత్రంగా 'ఆమేనా సుధగారంటే?' రమేష్ అడిగాడు. మూర్తి నెమ్మదిగా నవ్వుతూ? 'అవును, మీకు తెలుసా? అని ఎగతాళిగా అడిగాడు.

'లేదు, తెలుసుకొందామని....' మాటలు నాన్చేశాడు రమేష్. అతని కళ్ళముందు, పదిరోజులక్రింద చూచిన ఒక సంఘటన, ఒకదాని తర్వాత యింకోటి అంటించిన ఫొటోలమాదిరిగా తిరగసాగింది.

ఆరోజు రాత్రి తొమ్మిమ్మిది గంటలకు సినిమా వదలగానే ఫ్రీ స్కూల్ స్ట్రీట్ నుంచి నడిచివస్తున్నాడు రమేష్. ఆ వీధిలో వ్యభిచారం పబ్లిక్‌గా జరుగుతుందని మిత్రులు చెప్పారు. ఆ దారి తన రూంకి దగ్గరవుతుందని బయలుదేరాడు.

అయిదారు అంతస్థుల భవనాల కిటికీల్లోంచి అతిగా ముస్తాబైన అమ్మాయిలెందరో నిలుచుని రోడ్డుకేసి చూస్తున్నారు. అందులో చైనీయులు, మహమ్మదీయులు, ఆంగ్లోఇండియన్స్. ఆంధ్రులు, బెంగాలీలు యింకా ఎంతోమంది వున్నారు.

పాన్‌షాప్ ప్రక్కగా పోతుంటే, అప్పటివరకు నీడలో నిలిచివున్న మనిషి ముందుకు జరిగి, అమ్మాయిలు కావాలా అని, ఎలాంటి అమ్మాయి కావాలని వాకబుచేస్తూ, తన అజమాయిషీలో వున్న అమ్మాయిల గురించి వర్ణిస్తుంటే జుగుప్స కలిగింది రమేష్‌కి.

ఆ వ్యక్తిని తప్పించుకొని గబగబ నాలుగు అడుగులు వేసేసరికి, ఒక మనిషిని గుమ్మంలోంచి బయటికి త్రోసివేశారు. క్రింద ఢ్డ అతను లేచేలోపల ఒక అమ్మాయి బయటికి వచ్చింది. ఏవో నాలుగు పేర్లు పెట్టి పిలిచేసరికి యిద్దరు మనుష్యులు ప్రక్క రూమ్‌లోంచి వచ్చారు. ఏదో తగాదా జరిగి వుంటుందని ఆసక్తిగా నిలుచున్నాడు రమేష్.

ఆ అమ్మాయి ఏదో చెప్పగానే వాళ్ళిద్దరు అతన్ని తన్నడం మొదలు పెట్టారు. ఇంతలో పదిమంది రమేష్‌కి జతగా చేరారు. ప్రక్కన ఉన్నవానితో అసలు విషయమేమిటని హిందీలో అడిగాడు.

దెబ్బలు తింటున్న ఆ వ్యక్తి, వ్యభిచార వృత్తిలో వుంటున్న ఆ అమ్మాయి దగ్గరికి యాభై రూపాయలు యిస్తానని వచ్చాడట. అంతా అయిపోయిన తర్వాత డబ్బులు అడిగితే, జేబులు తడుముకొని నా పర్సుపోయిందని గాబరా పడ్డాడట. ఇదంతా నాటకమని ఆ అమ్మాయి తన్నిస్తోంది.

ఇంతలో ఆ యిద్దరు వ్యక్తులు యింకో రెండు తన్ని అతని చేతి కున్న గడియారం లాక్కొన్నారు. అక్కడున్నవారు వింతని చూస్తు న్నారు కాని, ఎవ్వరూ పట్టించుకో లేదు. ఇంత అల్లరికి మూలమైన ఆ అమ్మాయిని మరోసారి చూశాడు రమేష్. వ్యభిచారిణి అని చెప్పేవరకు ఏమాత్రం అటువంటి లక్షణాలు లేని ఆమెని గుర్తించడం చాల కష్టం.

ఫొటోలోని అమ్మాయే, ఆ అమ్మాయని రమేష్ మనస్సు పదే పదే చెప్తోంది. ఇంతలో సుధ గదిలోకి వచ్చింది. ఆమె ఆప్యాయంగా అందరికీ నమస్కరించింది.

రమేష్‌ని పరిచయం చేశాడు మూర్తి. ఆమె నవ్వుతూ పలకరించింది.

'మిమ్మల్ని యింతకుముందు ఎక్కడో చూశాను' సందేహాన్ని వెలిబుచ్చాడు రమేష్.

'నన్నా?' సుధ నవ్వింది. 'ఈ జన్మలో అయ్యుండదు. క్రిందటి జన్మలో నేను ఆంధ్రలో పుట్టివుంటే అక్కడే కలసి వుంటాం.'

'సారీ ! ఏదో చూచినట్లు భ్రమ కలిగింది.'

'ఫరవాలేదు. ఇంతకు ఏం పనిమీద వచ్చారు ?' అసలు విషయానికి వచ్చింది సుధ. అంతా విని, రెండువందల రూపాయలకు చెక్కుయిచ్చింది.

# 9

కలకత్తాలోని ఈడెన్ గార్డెనులో ఆరోజు ఫుట్‌బాల్ మ్యాచ్‌వుంది. బెంగాలీలు సామాన్యంగా ఆటలంటే ఎంతో యిష్టపడతారు. ఫుట్‌బాల్ అంటే ప్రతి ఒక్కరికి ప్రాణం.

బ్రిటీషు వారి కాలం నుంచి ఫుట్‌బాల్‌లో రెండు జట్లు పోటా పోటీగా ఆడుతుంటాయి. ఈస్టు బెంగాల్ అని తూర్పు బెంగాలీయుల జట్టు, మోహన్ బగాన్ అని కలకత్తా వాసుల జట్టు. రెండుజట్లలో బెంగాలీయులు కాక యితర ప్రాంతీయులు కూడా చేరి ఆడటం పరిపాటి.

తన దగ్గర రెండు టిక్కెట్లున్నాయి, రావలసిందని ఆహ్వానించి నప్పుడు కాదనలేక పోయాడు రమేష్. మొదటిది రేణు సాన్నిధ్యంలో రెండు గంటలు గడుపుతాననే ఉత్సుకత, రెండవది ప్రఖ్యాతిగాంచిన ఫుట్ బాల్ మ్యాచీ చూడాలనే కుతూహలం అతన్ని వెంటనే ఒప్పుకునేట్లు చేశాయి.

రేణు, రమేష్ గ్యాలరీలోకి వచ్చేసరికి ముప్పావు మంది అప్పటికే వచ్చారు. ఆట మొదలవడానికి యింకా అరగంటసేపైనా వుంది. సాయం కాలపు ఎండ నేరుగా కళ్ళల్లోకి చొచ్చుకొని పోతోంది. జనం కొంచెం పలచగా వుండి, ఎండపడనిచోటు చూసుకొని కూచున్నారిద్దరు.

క్రీడాస్థలాన్ని కుతూహలంగా చూస్తూ, ఇదివరకు ఆమె ఎన్ని మ్యాచీలు చూచిందీ, ఏ మ్యాచీలో ఎవరు గెలిచిందీ, ఆ గోలుని ఎవరు చేసింది వరుసగా చెప్పుకు పోతోంది రేణు.

అలా చెప్తూ కొద్ది సేపటికి రమేష్ ముఖంలోకి చూచేసరికి అతను నవ్వుతున్నాడు.

'ఎందుకు నవ్వుతున్నారు?' అమాయకంగా అడిగింది.

'ఇంతఅనుభవం వుందికదా! అఖిల భారత మహిళా పుట్‌బాల్ టీమ్‌కి మిమ్మల్ని కెప్టెన్‌గా వేస్తే ఎలా వుంటుంది అని ఆలోచిస్తున్నాను అని రమేష్ గంభీరంగా చెప్పాలనే ప్రయత్నంలోనే నవ్వేశాడు.

రేణు కూడా నవ్వింది 'బావుంది మీరనేది. క్రికెట్టు మ్యాచి కామెంటరీని చాలమంది వింటారు. ఆనందిస్తారు. అంతేకాని బ్యాటు పట్టి ఆడగలిగిన వాళ్ళ కామెంటరీ వినాలంటే, నూటికి తొంభై తొమ్మిది రేడియోలు ఠక్కున ఆగిపోతాయి.'

'నా ఉద్దేశ్యం అది కాదు. అభిమానముంటే ఏ ఆటనైనా ఆనందించ వచ్చు. కాని యిక్కడికి వచ్చిన ప్రతి పేక్షకుడూ ఒక మేటి ఆటగానిలా ఫోజులు పెట్టి మాట్లాడుతుంటే నవ్వొస్తుంది.'

'ఏ విషయమైనా సరే, పూర్తిగా తెలుసుకోవాలనే యిక్కడివారు తాపత్రయ పడతారు. ఇప్పుడు పుట్‌బాల్ ఆట గురించి చూడండి. ఇక్కడికి వచ్చిన ప్రతి ఒక్కరికి ఆటలోని నిబంధనలు, కిటుకులు అన్నీ తెలుసు. అభిమానం వున్న జట్టు తమ అంచనా ప్రకారం ఆడితే ఎగిరి గంతులు వేస్తారు. లేకపోతే చిందులు వేస్తారు.'

'బెంగాలీ తత్త్వం ఎంత బాగా విశదీకరించారు. మీరు కూడా బెంగాలీలా మారిపోయారు' అన్నాడు రమేష్.

'నా తత్త్వం కూడా దాదాపు అలాగే వుంటుంది. నేను ముమ్మాటికి రులా బెంగాలీనే అని చెప్పొచ్చు- మా నాన్న ఎప్పుడో ఒరిస్సా ప్రాంతం నుంచి వచ్చాడు. నేను పుట్టిందీ పెరిగింది ఇక్కడే. నేను చూడని చోటు, ఆంధ్రదేశం నాది అని, అక్కడి ఆచార వ్యవహారాలు ఎలా ఉంటాయో తెలియకపోయినా వాటిని నిలబెట్టుకోవాలని తాపత్రయపడుతూ, పుట్టి పెరిగిన యీ చోటుని మరిచిపోవాలా చెప్పండి?'

'అలా ఎవ్వరూ చెప్పరు? ఉన్నచోట కలసిపోయినా, మన సంస్కృతిని కూడా గుర్తుపెట్టుకొంటేనే బావుంటుంది' అని రమేష్

జవాబు చెప్పేలోపల 'ముధీ, ముధీ' అని చిరుతిండ్లు అమ్మే కుర్రాణ్ణి పిలిచింది. రేణు.

ఒక డబ్బాలో మరమరాలు వున్నాయి. అందులో కొన్ని ఉల్లి పాయలు తరిగి వేయబడ్డాయి. ఒక కాగితంలో పావుతో కొలిచి పోసి, దానిపైన ఆవాల నూనె కొద్దిగా చల్లి రేణు చేతికి అందించాడు ఆ కుర్రాడు. ఆ నూనెని చల్లుతుంటేనే అదో రకమైన వాసన వేసింది రమేష్‌కి.

ఆ పొట్లం రమేష్‌కి అందివ్వబోయింది రేణు.

'నాకు వద్దు, నేను తినలేను' అని నెమ్మదిగా చెప్పాడు.

'ఓ ఈ వాసన మీకు పడదు కదూ!' అని యింకా కొంచెం దూరంలో వున్న యింకో కుర్రాణ్ణి పిలిచి వేరు శనగలు తీసుకొంది. రమేష్ డబ్బులు యివ్వబోతుంటే రేణు బలవంతంగా యిచ్చింది.

ఇద్దరూ నెమ్మదిగా తినసాగారు. రమేష్ ఒకసారి కలయచూశాడు. అమ్మాయిలు చాలమంది వచ్చారు. క్రీడా స్థలంలోకి రిఫరీలు రాగానే ఈలలు, చప్పట్లతో ఆ ఆట స్థలం దద్దరిల్లి పోయింది. రేణు కూడా సంతోషంగా చప్పట్లు కొట్టింది.

రమేష్ కూడా నెమ్మదిగా చేతులుకలుపుతూ. 'గుడ్, ఇక ఆట మొదలవుతుందన్నమాట' అన్నాడు.

'అవును, యింకో అయిదు నిమిషాల్లో మొదలవుతుంది. మొన్న మ్యాచ్‌కి అడ్వాన్స్ టిక్కెట్లు కొందామని స్టేడియంకి వచ్చాను. మా గ్రూపు వాళ్లంతా పనిమీద మిదనాపూర్‌కి వెళ్లారు. ఒంటిగా ఎలా వెళ్ళాలా అని ఆలోచిస్తూంటే మీరు గుర్తుకి వచ్చారు.'

'థాంక్స్! నన్ను కూడా మీరు సన్నిహితునిగా, మీ గ్రూపులో ఒకనిగా భావించినందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది.'

'రేపు ఆదివారం నేను వాళ్ళని కలవడానికి వెళుతున్నాను. ప్రొద్దున పదింటి కల్లా మా యింటికి వచ్చారంటే కలసిపోదాం. వాళ్ళందరిని మీకు పరిచయం చేస్తాను.'

ఇంతలో రెండు జట్టుల ఆటగాళ్లు, గ్రౌండ్‌లోకి వచ్చారు. ఈలలు, చప్పట్లు యింతకుముందుకంటే రెండింతలు ఎక్కువగా వినిపించాయి. చెవులు మూసుకోవాలను కొన్నాడు రమేష్.

రేణు, రమేష్ వైపు జరిగింది. మెడను పొడుగ్గా చేసి ఆటగాళ్ళను బాగా చూడటానికి ప్రయత్నిస్తోంది.

ఆట మొదలైంది. మోహన్‌బగాన్ ఆటగాళ్లు బంతిని అందుకొని చర చర గోలు వైపు తీసుకెళ్ళారు. దగ్గరిగా వెళ్ళి బంతిని తన్నేసరికి చప్పట్లు మారుమ్రోగాయి. బంతి గోలు మీదుగా ఎగిరిపోయింది. అందరూ నిరుత్సాహపడిపోయారు.

మళ్ళీ ఆట సెంటర్ నుంచి మొదలయింది. ఈసారి ఈస్ట్ బెంగాలీ ఆటగాళ్ళు బంతిని రెండవ జట్టు వైపు తీసుకెళ్ళారు. వాళ్ళని అభినందించే వారు ఎగురుతున్నారు. రేణు మూతి ముడుచుకొంది. గోలు దగ్గరగా పోగానే ఒకతను బంతిని అందుకొని ఈస్ట్ బెంగాల్ కోర్టులోకి తన్నాడు. ఇద్దరు ఆటగాళ్ళు ఆ బంతిని అందుకొని మెరుపులాగా గోలు వైపు తీసుకెళ్ళారు. రేణు చప్పట్లు కొట్టడం, ఎగరడం మొదలుపెట్టింది. ఒక ఆటగాడు బంతిని నేరుగా గోలులోకి కొట్టాడు గోలు అయిపోయిందని అందరూ చప్పట్లు కొట్టారు. కాని బంతిని గోలు కీపరు చక్కగా పట్టుకొన్నాడు. ఇలా ఆట సాగుతూనే వుంది. విరామ సమయం వరకు ఎవ్వరూ గోలు చేయలేకపోయారు.

'మోహన్ బగాన్ యీసారి తప్పకుండా గెలుస్తుంది' జోస్యం చెప్పింది రేణు. రమేష్‌కి మాత్రం రెండు జట్లులు సమబలంగా తోచాయి. ఆటలో మెలకువలను బట్టి ఎవ్వరైన గోలు చేయవచ్చని అనుకొన్నాడు.

మళ్లీ ఆట మొదలయ్యింది. మోహన్ బగాన్ ఆటగాడికి బంతి చిక్కింది. అతను మెరుపుతీగలాగా బంతిని తన్నుతూ వెళ్లుతున్నాడు. అంతకు ముందే ఈస్ట్‌బెంగాల్ ఆటగాళ్లు యివతలి కోర్టులోకి వచ్చారు. అంచేత అడ్డుగా ఎవ్వరులేరు. ప్రేక్షకులంతా ఆదుర్దాగా లేచి నుంచున్నారు. ఆ ఆటగాడు తెలివిగా, సరిగ్గా బంతిని గోలులోకి తన్నాడు.

చప్పట్లతో ఆకాశం దద్దరిల్లింది. గట్టిగా చప్పట్లు కొడుతున్న రేణు ఆవేశంలో 'మాగో' అని రమేష్ చేయిని తీసుకొని గట్టిగా ముద్దుపెట్టుకొంది.

ఆమె స్పర్శకు అతను చలించి పోయాడు. ఆమె ముఖంలోకి చూడగానే కాస సిగ్గుగా 'అయామ్ సారీ' అంది.

'పరవాలేదు. మీరు అన్నట్లే మోహన్ బగాన్ గోలు చేసింది' ఆమె ఉత్సాహానికి జీవం పోశాడు రమేష్.

ఆ జట్టు అభిమానులు యింకా ఈలలు, చప్పట్లు కొనసాగిస్తున్నారు. పాపం, రెండవ జట్టు అభిమానులు నీరసంగా గ్యాలరీ సీట్లపై చతికిల బడ్డారు

మళ్ళీ ఆట మొదలయ్యింది. ఇంకా పది నిమిషాలు మట్టుకు టైము వుంది. ఈస్ట్‌బెంగాల్ జట్టు ఉధృతంగా ఆడసాగింది. రెండవ జట్టు వారికి. ఏ మాత్రం అవకాశం యివ్వడం లేదు.

ఇంకో అయిదు నిముషాలు వుంది. బంతిని గోలుదాకా తీసుకపోయి సరిగ్గా కొట్టలేకపోయారు. ఆ జట్టు అభిమానులు గొడవచేశారు. నిరుత్సాహంగా నిట్టూర్పులు విడిచారు.

ఇంకొక నిమిషం వుందనగా పెనాల్టి కార్నర్ దొరికింది వారికి, అభిమానులు గోలు అయి తీరుతుందను కొన్నారు. కాని బంతిని తన్నిన ఆటగాడు గురి తప్పాడు. మంచి ఛాన్సు పోయింది. ఆట ముగిసింది. మోహన్ బగాన్ జట్టు ఒక్క-గోలుతో గెలుపొందారు.

అంతవరకు కోపంతో వున్న అభిమానులు అరటి తొక్కలను, కాగితాలను గ్రౌండులోకి విసిరేయడం మొదలుపెట్టారు. మోహన్ బగాన్ అభిమానులు సంతోషంగా ఎగురుతున్నారు.

'ఇక పదండి, ఏదైనా గొడవ జరగవచ్చు' అని రేణు లేచింది.

ఆ జనసమూహంలో నడవడం అంత తేలికైన పనికాదు. ఆ ఒత్తిడికి రేణు రమేష్‌కి బాగా దగ్గరిగా జరిగింది.

'ఇంతకుముందు జరిగిన విషయానికి .... ఐయామ్ రియల్లీ సారీ' అంది రేణు.

'మళ్ళీ యింకోసారి. సారీ అన్నారంటే మర్యాదగా మీ ముద్దుని వాపసు యిచ్చేస్తాను. యిక మీ యిష్టం' గంభీరంగా అని నవ్వేశాడు రమేష్.

క్షణం సేపు నివ్వెరపోయి, పెదవుల మీద నవ్వుని చిలకరిస్తూ, 'మాగో ! మీరు భలే చమత్కారంగా మాట్లాడుతారు' అంది.

ఆమె, రమేష్‌కి యింకా దగ్గరిగావచ్చినట్లు తోచింది. ఆమె మనస్సులోనికోరికను తెలుపడానికి వచ్చిందో,రద్దీకి వచ్చిందో అతనికి బోధపడలేదు.

నెమ్మదిగా దారి చేసుకొంటూ బయటికి నడిచారు యిద్దరూ!

# 10

రమేష్ సరిగ్గా పది గంటలకు తలుపును తట్టాడు. రేణు తలుపుని తెరిచి నవ్వుతూ ఆహ్వానించింది. ఆమె ముస్తాబై తయారుగా వుంది. అప్పలస్వామి ఆప్యాయంగా 'రా బాబు, కూచో' అన్నాడు.

రమేష్ కూచునే లోపల, చేతిలో ప్లేటుతో రేణు తయారయ్యింది. అందులో చక్కగా వేయించిన మూడు చేప ముక్కలు వున్నాయి.

'ప్రొద్దున్నే మా బాబా మార్కెట్‌నుంచి చేప తెచ్చాడు. ఇది రుచి చూడండి. టీ తెస్తాను' అని లోనికి వెళ్ళింది రేణు.

'మీరు....?' అని ప్రశ్నార్థకంగా రమేష్ చూడగా,

'నీవు తీసుకో, నేను కొద్దిసేపట్లో భోంచేస్తాను' అన్నాడు అప్పలస్వామి.

చేప ముక్కలు కరకరలాడుతూ నోట్లో వేసుకోగానే కరిగి పోతున్నాయి. ఎంతో రుచిగా వున్నాయి

టీ త్రాగిన తర్వాత, రేణు సంచీలో ఏవో పేపర్లు పెట్టుకొని చంకకు తగిలించుకొని బయలుదేరింది.

బస్సులో ఢాకురియాకి బయలుదేరారు. ఇద్దరూ ఒకే సీటులో కూచున్నారు.

కిటికీవైపు కూచున్న రేణు, రోడ్డు మీదవున్న కొందరిని చూపుతూ 'వారిని చూస్తే మీకు ఎలా వుంటుంది?' అని ప్రశ్నించింది.

పార్కు ప్రక్కన ఫుట్‌పాత్ మీద ఒక స్త్రీ, యిద్దరు ముసలివారు నలుగురు పిల్లలు వున్నారు ఆమె పొగతో నిండిపోయిన పొయ్యిలో వంటను సరిచేస్తున్నది. కృశించిన శరీరాలు, చిరుగుల గుడ్డలు, వారి దౌర్భాగ్యస్థితిని తెలుపుతున్నాయి. ఆ వంట ప్రయత్నంచూస్తుంటే, ఆ ఫుట్‌పాతే వారి యిల్లు, సర్వం అని తెలుస్తోంది

రమేష్ వెంటనే జవాబు చెప్పలేకపోయాడు. తను యిటువంటి దృశ్యాలు ఎన్నోచూశాడు. పేదరికం అనేది ప్రతి పట్టణంలో, గ్రామంలో వుంది. కాకపోతే కలకత్తాలో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. ప్రభుత్వం ఎన్ని పథకాలు ప్రవేశపెట్టినా, సమాజ సహకారం ముఖ్యంగా పేదరికం అనుభవిస్తున్న వ్యక్తుల కృషివుంటేనేగాని దారిద్ర్యాన్ని రూపుమాప లేము. భగవంతుడు మనల్ని యిలా బ్రతకమని వ్రాశాడు అని చాలమంది దారిద్ర్యంతో ఒడంబడిక చేసుకొని అలాగే వుండిపోతారు

'మన దేశంలో కావలసినంత సహజ సంపద వుంది. కాని కొద్ది మందే స్వర్గసుఖాలనుభవిస్తుంటే యిలాంటివారు కోకొల్లలు దారిద్ర్యమనే చీకట్లో నలుగుతున్నారు' రేణు అంది.

'నిజమే! ఆస్తి, ఐశ్వర్యాలు అనుభవించడంలో భూమ్యాకాశాల తారతమ్యాలు వున్నాయి. మన సామాజిక పరిస్థితి మారితే కాని సమానత రాదు' రమేష్ శృతి కలిపాడు.

'మారితే కాదు, మార్చాలి. ముందు మాటలతో చెప్పిచూడాలి. లేక పోతే బలప్రయోగంతో యీ తేడాలను రూపుమాపాలి. దానికొరకే మేమంద రం కృషిచేస్తున్నాం. ఇప్పుడు కలువబోయేదికూడా మనం వాళ్ళనే' అంది రేణు.

రేణు నక్సలైటు పార్టీ వర్కరని వెంటనే రమేష్‌కి తెలిసిపోయింది. అమాయకంగా వున్న రేణు గుండెల్లో, విప్లవాత్మకమైన యిటువంటి అభి ప్రాయాలుంటాయని ముందు ఊహించుకోలేక పోయాడు. ఆమె సన్ని హితులని చూడాలని అతనికి కుతూహలం కలిగింది.

బస్సుదిగి నడుస్తూవచ్చిన రేణు ఒక పాత గేటు ముందు ఆగింది. కాంపౌండు గోడ ఎప్పుడు పడిపోతుందా అనే అనుమానం కలుగు తోంది. గేటు దాటి లోపలికి రాగానే ఫర్లాంగు దూరంలో ఒక చిన్నయిల్లు కనిపించింది. చుట్టూ చెట్లు వున్నాయి. ఇంటికి పడమరవైపు ఒక పెద్ద కొలను వుంది. దాని ప్రక్కనే పొగవస్తూ పాకలా కనిపిస్తోంది.

'ఇది జగదీష్ బాబుగారి యిల్లు. మాలో ముఖ్యమైన మనిషి. మా ఆఫీసు యిక్కడే. అన్ని వ్యవహారాలు యిక్కడినుంచే జరుగుతాయి.. అని రేణు, జగదీష్‌బాబు గురించి వివరంగా చెప్పసాగింది

'జగదీష్‌బాబు బెంగాలీ. ఇరవై సంవత్సరాలక్రింద నా అనే వారు లేకుండా, పొట్టచేతబట్టుకొని ఖరగ్‌పూరు నుంచి కలకత్తాకు వచ్చాడు పని కోసరం అడగని దుకాణం, తిరగని చోటు లేదు. ఒకరోజు 'కుమర్ టోలీ' అనే కుమ్మరుల బస్తీని చూశాడు. అక్కడ చాలమంది దసరా వేడుకలకు వందల కొలది దుర్గ మూర్తులను తయారు చేస్తున్నారు. జగదీష్ బాబు స్వతహాగా కుమ్మరి కావడంతో మట్టిని కలపడం మొదలైన పనులు బాగా తెలుసు. ఒకరి దగ్గర పనికి కుదిరాడు. ఆ తర్వాత అతని చలువతోనే బెంగాల్ సిరా మిక్స్ లో ఉద్యోగం లభించింది.

'చాలమంది మట్టితో కప్పులు, ప్లేట్లు, రకరకాల అలంకార వస్తువులు చేసుకొని వచ్చి, ఆ ఫ్యాక్టరీలో కాల్చుకునేవారు. ఛార్జీలు తీసుకొని, ఆ కంపెనీ యిటువంటి సదుపాయం కలిగించింది.

'జగదీష్‌బాబు ఆ మట్టి వివరాలు, చేసే పద్ధతులు తెలుసుకొని స్వయంగా చేయసాగాడు. మామూలుగా కప్పులు అవి తయారుచేయడానికి మట్టి, ఫెల్స్‌పార్ అనే ఖనిజాన్ని వివిధ శాతాలలో కలుపుతారు. కాని ఫెల్స్‌పార్ ఖరీదు ఎక్కువ. వస్తువులను తక్కువ ధరకు అమ్మాలంటే ముడిసరుకు మీద తక్కువ ఖర్చుచేయాలని, ఎలాగైనా గంగానది మట్టితోనే పింగాణి పాత్రలు చేయాలని పూనుకొన్నాడు. ఎన్నో ప్రయత్నాల తర్వాత మామూలు మట్టి, కొంత శాతం ఫెల్స్‌పార్ కలిపి కాలిస్తే చక్కని పసుపు వన్నెతో పింగాణి పాత్ర తయారయింది. అది యిద్దరు, ముగ్గురు నిపుణులకు చూపించితే, బ్రహ్మాండంగా వుందని మెచ్చుకొన్నారు.

'అక్కడి నుంచి జగదీష్ బాబు అదృష్టం మారిపోయింది. వేల కొలది కప్పులు, యితర సామగ్రిని చేసి బజారులోని విక్రేతలకు చౌక ధరకు యిచ్చాడు.

'ఆ తర్వాత వేలల్లో కావాలని ఆర్డర్లు రాసాగాయి. రెండేళ్ళలో వచ్చిన డబ్బుతో యీ యిల్లుని కొని, ఫ్యాక్టరీని యిక్కడే పెట్టుకొన్నాడు.

'మొదట తను పడ్డ కష్టాలను గుర్తుంచుకొని యితరులకు అటువంటి బాధలు లేకుండా చేయాలని జగదీష్‌బాబు మా అందరికీ అండదండగా వుంటారు' అంటూ రేణు రూములో అడుగు పెట్టింది.

రమేష్‌ని అందరికీ పరిచయం చేసింది. ఎనిమిది మంది వున్నారు. జగదీష్‌బాబు ధోవతి, లాల్చీ వేసుకొని స్కూల్లో టీచరులా వున్నాడు. వయస్సు దాదాపు నలభై సంవత్సరాలుంటుంది.

రమేష్, రేణు కూచోగానే, జగదీష్‌బాబు మిగతావారికి యేవో సూచనలిచ్చి పంపించాడు.

'ఊఁ, చెప్పండి' హిందీలో రమేష్‌ని అడిగాడు. రేణు, రమేష్‌ని గురించిన వివరాలు పూర్తిగా చెప్పింది. ఏవో కొన్ని విషయాలు మాట్లాడి, తనకు పనివున్నట్లు చెప్పి జగదీష్‌బాబు వెళ్లిపోయాడు.

పనిమనిషి తెచ్చిన టీని చెరో కప్పు త్రాగారు. 'అలా ఫ్యాక్టరీవైపు వెళ్దాం, రండి' అని రమేష్‌ని పిలిచింది రేణు.

కొలను ప్రక్కన ఏదో చిన్నపాక కనిపించింది. రేణు పాకవైపు దారితీసింది. గుమ్మంలో 'ఎనభై సంవత్సరాల ముసలి గోడకానుకొని ఎటో పరధ్యానంగా చూస్తున్నాడు. ఎదురుగా కాళి ప్రతిమ ముందు చిన్న జ్యోతి వెలుగుతోంది.

'కి బాబా ! బాలో ఆఛేన్‌ (క్షేమంగా వున్నారా)?' అన్న రేణు మాటలకి యిటు తిరిగి చూశాడు. ఆయన కళ్లల్లో ఏదో కాంతి తళుక్కు మంది. అది వెంటనే మాయమైంది. నెమ్మదిగా తలూపాడు ఆమెకు జవాబుగా.

ఆమె యింకా యేదో మాట్లాడి ఫ్యాక్టరీవైపు తిరిగింది.

'ఆయన పెత్తందార్ల దౌర్జన్యానికి ప్రతీక. ఇక్కడికి అరవై మైళ్ళ దూరంలో ఆయన స్వగ్రామం. నా లాంటి కూతురుండేదట. అతను కౌలుకి తీసుకొని దున్నుకునే పొలం యజమాని ఆ అమ్మాయిని కోరాడు. బలవంతాన తన మిద్దెకి తెప్పించుకొని తన కోర్కెలు నెరవేర్చుకొన్నాడు. ఆ మరుసటి రోజు ఆ అమ్మాయి శవం బావిలోతేలింది. ఆమె ఆత్మహత్య చేసుకుందా? లేదా హత్య చేయబడిందా అని ఎవ్వరు ఆచూకీ తీయలేదు.

'ఆ ముసలి కొడుకు యీ అన్యాయాన్ని ఎదురించ బోయినందుకు అతనిపై దొంగతనం, యితర అత్యాచారాలు మోపి ఏడు సంవత్సరాల జైలు శిక్ష వేయించారు. ఆ ఊరిలో మా పార్టీకి చెందిన వ్యక్తులు యిద్దరే వున్నారు. ఈ వృద్ధుని కూడా ఆ భూకామందు పొట్టన పెట్టుకొంటా డని, కలకత్తాకు తీసుకు వచ్చారు జగదీష్ బాబుగారు దయతలచి ఆశ్రయ మిచ్చారు' అంటూ రేణు కొలను ప్రక్కన వున్న ఒక బండమీద కూచుంది.

ఆమె ప్రక్కనే వున్న యింకో బండమీద రమేష్ కూచున్నాడు.

'ఇప్పటికీ యిటువంటి ఘోరాలు జరుగుతున్నాయా ?' రమేష్ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశాడు.

'దీనికి మించిన భయంకర సంఘటనలు ఎన్నో వున్నాయి. ఇప్పుడు మీరే చెప్పండి. ఏ కొద్దిమందో భూములను, ఆస్తులను చేజిక్కించు కొని తమ రక్తాన్ని చెమటగా కారుస్తున్న కష్టజీవులను రోజురోజుకి తన్నుమీద తన్ను తంతూంటే కిక్కురుమనకుండా పడివుంటారా ? ఆ భూమి నలుగురికి చెందాలి అని వారు ఎదురు తిరగడం తప్పంటారా ?'

'ఎదురు తిరగడంలో తప్పు లేదు. కాని తమకు జరిగిన అన్యా యాన్ని ఏ రూపంలో వ్యతిరేకిస్తున్నారనేదే ముఖ్యం. సంవత్సరపు పసి పిల్లకూడా అమ్మ గారాబంతో పెడుతున్న అన్నం ముద్దలను వద్దను కొన్నప్పుడు చేయితో ఆపుతుంది. ఇంకా బలవంతంగా తినిపిస్తే నోట్లో నుంచి వెళ్ళగ్రక్కుతుంది. అలాగే భూకామందులు పెడుతున్న హింస లను ప్రభుత్వం దృష్టికి తేవాలి. సమైక్యంగా వారిని ఎదుర్కోవాలి కాని హింసాకాండకు పూనుకుంటే లాభమేముంది ?'

'మీరు పొరపడుతున్నారు. సహనానికయినా హద్దుంటుంది. సహనం నశించి నప్పుడు పేద జనం తిరగబడతారు. ఇక ప్రభుత్వం అంటారా, అదెప్పుడు పేదవాళ్ళని రక్షించింది ? ధనవంతుడి దౌర్జన్యం నుంచి పేద వాణ్ణి రక్షించదు, కాని పేదవాడు తిరగబడినప్పుడు మాత్రం వాణ్ణి అణి చేసి ధనవంతుణ్ణి రక్షిస్తుంది. నిజమే, రక్తపాతం లేకుండా సమాజం మారడానికి వీలయితే మేం వద్దనం. కాని తప్పని సరైనప్పుడు వేరే మార్గం లేదు' అంది రేణు.

రేణు తన బ్యాగు తెరచి ఒక పొట్లం బయటికి తీసింది. అందులోంచి శనగలు కొద్దిగా నీళ్ళల్లోకి విసిరింది. చేపలు గుంపులు గుంపులుగా వచ్చి వాటిని అందుకొంటున్నాయి.

మళ్ళీ కొన్ని విసిరింది. ఒక పెద్ద చేప, చిన్న చేపలను త్రోసు కొంటూ వచ్చి పది పన్నెండు గింజలను గబ గబ మ్రింగింది.

రమేష్ రేణుని ఉద్దేశించి 'చూశారా బలమున్నది కాబట్టి ఆ పెద్ద చేప చిన్న చేపల నోటి దగ్గరి గింజలను లాక్కొని తినేస్తోంది. అది ప్రకృతి సహజం. జంతువులలో వున్నట్లే మానవులలో కూడా ఈ స్వార్థం వుంది. కాని మానవులు జ్ఞానపరులు. స్వార్థం తప్పు అని, ప్రకృతి ప్రసాదించిన సంపదలను సమంగ అనుభవించాలని బోధించాలి. భూకామందుల మనస్సులని మార్చాలి' అన్నాడు.

రేణు కొద్దిగా నవ్వింది. 'దొంగలకు తాళం చెవి యిచ్చి యీ రాత్రికి డబ్బుతో వున్న యినపెట్టెను కాపాడమంటే ఎంత న్యాయం జరుగుతుందో, మీరు చెప్పింది అలాగేవుంది. తనకు నష్టం కలగనప్పుడు మనిషి మీరు ఎన్ని నీతులు చెప్పినా, ఒక చెవినుంచి విని రెండవ చెవితో వదిలేస్తాడు. ఆ మాటలు అతని మనస్సుని మారుస్తాయనుకోవడంకల్ల. పెత్తందార్లలో యేదైనా మార్పు తేవాలంటే అది అలజడి, బలప్రయోగం, కౄరులైన భూ కామందులపై దాడితోనే' రేణు తన సిద్ధాంతం వివరించింది.

రేణు కొద్దిసేపు రమేష్ ముఖంలోకి నిదానంగా చూచింది. ఆయన తన అభిప్రాయాలతో ఏకీభవించడం లేదని గ్రహించి 'మన నమ్మకాలు, సిద్ధాంతాలు నిజంగా తూర్పు పడమరగా వున్నాయి. ఇక వదిలిపెట్టండి. మీకు అనవసరంగా తలనొప్పి కలిగించాను' అని మార్చింది.

ఇప్పుడు లేచి ఆమె ఫ్యాక్టరీవైపు బయలుదేరింది. రమేష్ మనస్సులో ఎన్నో ఆలోచనలు బయలుదేరాయి. విభిన్న సిద్ధాంతాలను నమ్మే తామిద్దరు ఎలా స్నేహితులుగా కలిశారు. నక్సలైటు సిద్ధాంతాలు యింత గాఢంగా నమ్మి తన శాయశక్తులా మార్పులు తీసుకురావాలని కంకణం కట్టుకున్న రేణు ఎవ్వరినైనా ప్రేమించ గలుగుతుందా? అసలు వివాహమాడ గలుగుతుందా?

'జగదీష్ బాబు వివాహితుడా ?' తన సందేహాలను నివృత్తం చేసుకోవాలని ఆ విషయం ఎత్తాడు రమేష్.

'లేదు. ఆయన వివాహం చేసుకొని తన మార్గానికి ప్రతిబంధకం ఏర్పరుచు కొనదలుచు కోలేదు.'

'వివాహం ప్రతిబంధకం అని మీరు కూడా నమ్ముతున్నారా?'

'వివాహం వ్యక్తిగత విషయం. పార్టీ సిద్ధాంతాలకు సంబంధం లేదు. నేనింత వరకు ఆ విషయాన్ని ఆలోచించ లేదు. చేసుకోవాలని మనస్సుకు తోస్తే తప్పకుండా వివాహం చేసుకొంటాను.'

చాలమంది అమ్మాయిలు పెళ్ళి అనగానే, సిగ్గుతో తల దించుకొని మాటలు రానివారిలాగా అయిపోతారు. రేణు ధైర్యంగా తను నమ్మిన విషయాలను ఖచ్చితంగా చెప్పుతుంటే విని మెచ్చుకొన్నాడు రమేష్.

# 11

రమేష్ అసోసియేషన్ పనులలో పూర్తిగా మునిగిపోయాడు. విరాళాలు బాగా వసూలైనాయి. కమిటీవారు కోరినట్లు ఆంధ్రప్రదేశ్ విద్యా శాఖ మంత్రితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, జనవరి 13వ తారీఖు ఉదయం కలకత్తాకు వచ్చేట్లు ఒప్పించాడు. మిత్రసభ్యులు కొంతమందితో కలసి బెంగాల్ ముఖ్యమంత్రిని కలిశాడు రమేష్. ఆయనకు వీలుపడదని, విద్యామంత్రిని ఆహ్వానించమని సలహా యిచ్చాడు. ముఖ్యమంత్రిగారు తమని ఆహ్వానించమన్నారు అని చెప్పగానే, విద్యామంత్రి వెంటనే ఒప్పు కొన్నాడు.

రమేష్ ఫీల్డుకి వెళ్లే సరంజామాతో వున్నాడు. సరిగ్గా ఆరు నెలలు వుండాలి. రమేష్ యీసారి డార్జిలింగు దగ్గర్లో హిమాలయాలలో పరిశోధన జరపాలి. ఆఫీసు పనిలో, అసోసియేషన్ గొడవలలో అతను రామనాథం గారిని కలవలేక పోయాడు. చాలా రోజులుగా అసోసియేషన్‌కి రామనాథం కూడా రావడం లేదు. ఆరోజు రామనాథం గారిని చూడాలని రమేష్ బయలుదేరాడు.

కాలింగ్ బెల్లు నొక్కగానే పనిమనిషి తలుపు తెరిచాడు. కుక్క కనిపించలేదు. అది చనిపోయి రెండు నెల్లయ్యిందని చెప్పాడు పనిమనిషి.

డ్రాయింగు రూములో అడుగుపెట్టగానే మూలగావున్న ఒక సోఫాలో కూచుని సిగరెట్టు కాలుస్తూ, రామనాధంగారు కనిపించారు. అతన్ని చూచి ఆశ్చర్యపోయాడు రమేష్. చాల రోజులుగా జబ్బుతో వున్నట్లు బలహీనంగా, దీనంగా వున్నాడు.

'ఏమయ్యిందండి, అలావున్నారు? నాకు కబురైనా పంపలేదు?' ఆందోళనగా అడిగాడు రమేష్.

రామనాధం నవ్వాడు. అతను నవ్వినట్లు కళ్ళను చూస్తేనే తెలుస్తోంది.

'నాకేం ? బాగానే వున్నాను. రా, కూచో' అని యింకా గంభీరంగా వుండిపోయాడు.

కాని ఆప్తులనే వారు దగ్గరికి రాగానే, మనస్సులోని చీకటిగదుల్లో దాగిన బాధలు ఒకదాని తర్వాత ఒకటి కన్నీటి పొరలను చీల్చుకొని బయటికి వస్తుంటాయి. పొరలుగా వస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకొని, 'రమేష్, నేను నిజంగా దురదృష్టవంతుణ్ణి. ఈ లోకంలో నన్ను మించిన అభాగ్యుడు యింకొకడు వుండడు!' నెమ్మదిగా అన్నాడు రామనాధం.

రమేష్‌కి అయోమయంగా వుంది. 'అన్నీ తెలిసినవారు మీరు యిలా బాధపడితే ఎలా చెప్పండి!'

'బాధా ? అవును, నేను నిజంగా బాధపడుతున్నాను. ఆ భగవంతుడు నన్ను ఎందుకు పుట్టించాడని—నా మనస్సుని రోజు రోజుకి ఎందుకు ముక్కలుగా చేస్తున్నాడని....మా అరుంధతి విషయం నీకు యింతకు ముందే చెప్పాను కదా! ఆమె దహనానికి మా ఒక్కగానొక కొడుకు రఘు రాలేదు. ఆ తర్వాత నెల నెలా డబ్బు పంపుతూ నేను ఉత్తరాలు వ్రాస్తూనే వున్నాను. రఘు ఒక్కదానికి కూడా జవాబు వ్రాయలేదు. డబ్బు మాత్రం తీసుకొంటున్నాడు. వాడిని చూడాలని రెండు మూడు ఉత్తరాలలో రమ్మని కోరాను. దానికికూడా జవాబు రాకపోయేసరికి మొన్న నేనే స్వయంగా హైదరాబాదు వెళ్లాను. నన్ను చూడగానే ముఖం మాడ్చ

కొన్నాడు. తల్లిని గురించి బాధపడుతున్నాడేమోనని సమాధాన పరుచు కొన్నాను.

'చదువు ఎలా సాగుతోంది రఘు ? మీ అమ్మ వుంటే ఎంతగా సంతోషించేదో' అన్నాను నేను.

'సంతోషపడటానికి ఆమెని మీరు ఉండనిస్తేగా?' నిష్ఠూరంగా పలి కాడు రఘు.

'అంటే, ఏమిటి నీ ఉద్దేశ్యం ?'

'అమ్మ ప్రతి ఉత్తరంలో మీ గురించే వ్రాసేది. మీరు ఎంత కఠోరంగా వుంటారో వివరిస్తూ, త్వరగా చదువు ముగించుకొని తనని తీసుక వెళ్ళమని కోరేది.'

'అలాగా' అని మాత్రం అనగలిగాను.

'అవును. మీరే ఆమెని హింసించి, బాధించి మృత్యువు నోట్లోకి త్రోసివేశారు. లోకం దృష్టిలో కాకపోయినా, నా దృష్టిలో మీరు హంత కులు.... విన్నారా ? మీరు నిజంగా హంతకులు' అని రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని ఏడ్వసాగాడు రఘు.

నా కాళ్ళ క్రింది నుంచి భూమిని ఎవ్వరో తీసివేసినట్లు ఫీలయ్యాను. నా కన్న కొడుకు యిలా మాట్లాడతాడని నేను ఎన్నడూ కలలో కూడా అనుకోలేదు. మనస్సుని గట్టిగా ఒక చేత్తో ఒత్తి పట్టుకొని, యింకొక చేతిని నెమ్మదిగా రఘు భుజం మీద వేస్తూ,

'రఘు, నీవు యింకా చిన్నవాడివి. చనిపోయిన మీ అమ్మ ఏదో వ్రాసిందని బాధపెడుతున్నావు. నేను ఎన్నడూ మీ అమ్మని బాధపెట్టలేదు. కొన్ని పరిస్థితుల వల్ల....' అనబోయాను.

భుజాన్ని విదిలించుకొని, విసురుగా 'మీరు నాకు సంజాయిషీ చెప్పనవసరం లేదు' అన్నాడు రఘు.

'రఘూ'! చనిపోయి ఏ లోకానికో వెళ్ళిపోయిన మీ అమ్మమీద వున్న గౌరవాన్ని భంగపరచటం నా ఉద్దేశ్యం కాదు. కాని నా మాటను కూడా విను.'

'వినదలుచుకోలేదు. మా అమ్మను హింసించి, ఈ లోకానికి దూరం చేసిననాడే, మీరు కూడా నాకు దూరమైనారు. నాకు మనశ్శాంతి కావాలని

కోరుకుంటే మీరు నా దగరికి రాకూడదు.' అని హాస్టలు రూంలోంచి బయటకు వెళ్లడానికి ఉద్యుక్తుడైనాడు రఘు.

'రఘు! ఒక్క మాట. నీవు వద్దంటే నా నీడను కూడా నీ మీద సోకనీయను. కాని నీ చదువుని మాత్రం పాడు చేసుకోవద్దు. నీ చదువు గురించే మీ అమ్మ మనస్సుని విరిచాను, ఇన్ని అనర్థాలు కొని తెచ్చు కొన్నాను. నెల నెలా డబ్బు పంపిస్తాను. అది తీసుకో!'

'సరే, చదువు అయిపోయేవరకు పంపించండి' అని యింకో మాట అనకుండా రఘు వెళ్లిపోయాడు.

రామనాధంగారి కళ్ళల్లో నుండి ధారాపాతంగా నీరు కారసాగింది.

'కట్టుకొన్న భార్య, నా మనస్సుని అర్థం చేసుకోక అర్థాంతరంగా వెళ్ళిపోయింది. కన్న కొడుకు చదువుకొని, సుఖపడాలని అభిలషించినందుకు నన్ను కసాయివానిలా చూస్తున్నాడు. నేనింక ఎందుకు బ్రతకాలి చెప్పు?' అని కళ్ళు తుడుచుకొన్నాడు రామనాధం.

రమేష్ కళ్ళల్లో కూడా నీరు నిలిచింది. అతను గొంతు సవరించు కొంటూ, 'మనిషి ఎప్పుడు ఎందుకు బాధలకు లోనౌతాడో ఆ భగవంతుడికే తెలుసు. మీరు మాత్రం ధైర్యంగా వుండాలని నా కోరిక. రఘు అంతరాత్మ అతన్ని హెచ్చరించి తీరుతుంది—అతను మీ దగ్గరికి వచ్చి తీరుతాడు' ధైర్యం చెప్పాడు.

'ఏమో రమేష్! మొన్న ఉద్యోగానికి రాజీనామా చేసి ఋషి కేష్‌కు వెళ్లి భగవత్సన్నిధానంలో ప్రశాంతంగా జీవితాన్ని గడిపివేయా లను కొన్నాను. కాని నీవు అన్నట్లు నా మనస్సులో, రఘు వస్తాడనే ఆశ మొలిచింది. అందుకే వుండిపోయాను.'

ఇంకా కొంచెం సేపు మాట్లాడి, ధైర్యం చెప్పి బయలుదేరాడు రమేష్.

ఏమిటో మనిషి జీవితం? ఎప్పుడూ యేదో ఒక లోటు వుండి, మనస్సుని స్థిమితంగా వుండనీయదు అనుకొన్నాడు రమేష్.

# 12

రమేష్ భవానీపూర్‌నుంచి నెమ్మదిగా నడుస్తూవస్తున్నాడు. రోడ్డు కిరువైపుల ఫుట్‌పాత్‌మీద వరుసగా చిన్న చిన్న దుకాణాలు వున్నాయి. వాటిలో బట్టలు వగైరా అమ్ముతున్నారు.

కొంచెం దూరంలో ఒక చిన్న గుంపు కనిపించింది. దగ్గరికిపోయి చూస్తే పదహారు సంవత్సరాల వయసున్న ఒక కుర్రాణ్ని నలుగురు కలసి తంతున్నారు. విషయమేమిటని రమేష్ ప్రక్కవాణ్ణి అడిగాడు. దూరంగా నిలబడ్డ ఒక వ్యక్తిని చూపి, ఆయన పర్సుని కొట్టేయాలని చూశాడని చెప్పారు.

రమేష్ దృష్టి అటువైపు పడింది. చేతిలో సంచీ, చంకలో మూడు సంవత్సరాల కుఱ్ఱాణ్ణి ఎత్తుకొన్న ఒక నడివయస్కుడు ఆ గుంపుదగ్గరికి రాగానే, కుర్రాణ్ణి దించి, సంచీ క్రిందపడేసి అందరినీ త్రోసుకొంటూ వెళ్లి టపటపమని నాలుగు తన్నాడు. దాని తర్వాత 'ఏం జరిగింది?' అని ప్రక్కవానితో అడిగాడు. వాడు చెప్పిన విషయాన్ని విని 'దొంగ వెధవని, ఇంకా నాలుగు తన్నండి' అంటూ తన బాధ్యత నెరవేరినట్లు సంచీ తీసుకొని, కుర్రాణ్ణి చంకన వేసుకొని తన దారిన బయలుదేరాడు.

ఇలాంటి ఆవేశపూరితమైన బెంగాలీ స్వభావం రమేష్‌కి క్రొత్తేమీ కాదు.

రేణు యింటికి నడుస్తూ బయలుదేరాడు. ఇంకో రెండు రోజులలో అతను ఫీల్డుకి వెళ్ళాలి. రైలు టక్కెట్టు రిజర్వు చేసుకొన్నాడు. మిగతా విషయాలు సరిచూసుకొన్నాడు.

తలుపుని తట్టగానే అప్పలస్వామి తెరిచాడు. 'రా బాబు! ఈ రోజు రేణు ఎందుకో చాల బాధతో వున్నట్లనిపించింది. ఇంతకుముందే లేక్ వైపు వెళ్లింది' అన్నాడు అప్పలస్వామి.

'అలాగా! నేను ఎల్లుండి క్యాంపుకి వెళుతున్నాను, కలిసిపోదామని వచ్చాను' అంటూ లేక్ వైపు బయలుదేరాడు.

ఇంతకుముందు ఒకసారి రేణుతో కలసి అక్కడికి వెళ్లడం వలన ఆమె ఎక్కడ కూచుంటుందో అతనికి బాగా తెలుసు.

లేక్ గార్డెన్ ఆ చుట్టుప్రక్కల వున్న వారికి చల్లగా ఊపిరి పీల్చుకునే స్థలం. మధ్యన పెద్ద సరస్సు, దాని చుట్టూ చక్కని చెట్లు, తోటలు వున్నాయి. సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది. రిటైరు అయిన వ్యక్తులు కొంతమంది ఆరోగ్యానికని అటూ యిటూ తిరుగుతున్నారు. కుటుంబీకులు కొంతమంది తమ పిల్లలు ఆడుతుంటే ఆనందిస్తున్నారు. వయస్సులో వున్న ప్రేమికుల జంటలు కొన్ని ఇవన్నీ మరిచిపోయి ఏవో కబుర్లు అల్లుకొంటున్నారు.

దూరంగా నిటారుగా వున్న పెద్ద చెట్లున్నాయి. వాటి నీడలు రెండింతలుగా ఎదిగి భూమి మీదికి ప్రాకి ప్రక్కనే వున్న సరస్సు నీటిని కప్పి వేయాలని ప్రయత్నించి విఫలమైనాయి. నీడల మధ్య అటూ యిటూ కొన్ని కాంతి కిరణాలు గుడ్డిగా వెలుగునిస్తూనే వున్నాయి. ఒక చెట్టు నీడ మట్టుకు రేణు మీద పలచని, నల్లని ముసుగులా కనిపించింది.

రమేష్ దగ్గరగా వచ్చి 'రేణూ' అని ఆప్యాయంగా పిలిచాడు. ఆమె ఉలిక్కిపడి ఇటు తిరిగింది. అతన్ని చూడగానే ఆమె కంటిలో ఒక నీటి చుక్క తళుక్కుమంది. గాలికి ముందుకి ఎగిరివచ్చిన ముంగురులు కళ్లలోని భావాలను కనపడనీయవద్దని వృధా ప్రయత్నాలు చేస్తున్నాయి.

చేరువగా కూచోని 'ఏమి జరిగింది రేణు? చాలా దిగులుగా కనిపిస్తున్నావు. విషయ మేమిటో నేను తెలుసుకోవచ్చా?' అదరంగా అడిగాడు రమేష్.

'నా జీవితంలో యీ రోజు చెప్పలేని దుర్దినం రమేష్! నా గుండెలు పగిలిపోయినాయి' అని కళ్ళు తుడుచుకొంది రేణు.

రమేష్ ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆమె మళ్ళీ మాట్లాడసాగింది.

'ఈ రోజు నేను రెండు దుర్వార్తలను వినవలసి వచ్చింది. నా చిన్ననాటి స్నేహితుడు, పార్టీ వ్యవహారాలలో సహచరుడు ప్రదీప్ యీ రోజు పోలీసు కాల్పులలో మరణించాడు. మరో పదిమంది సహచరులు మిదనాపూర్‌లో పోలీసులకి చిక్కిపోయారు.'

'ఘర్షణ ఎలా జరిగింది? కాల్పులు ఎక్కడ జరిగాయి?' సందేహంగా అడిగాడు రమేష్.

రేణు దీర్ఘంగా నిట్టూర్చింది. 'మా పార్టీ సిద్ధాంతాలు మీకు తెలుసుగా! ఆందోళన లేవదీయాలి. ప్రజలలో అసంతృప్తి నూరిపోయాలి. అందులోనే విప్లవం ఉద్భవిస్తుందని మా గట్టి నమ్మకం. ఇవ్వాళ ప్రొద్దున డమ్ డమ్ ఏరియాలో మా పార్టీ సభ్యులు ఆందోళన మొదలు పెట్టారు. అందులో కొన్ని నాటుబాంబులను కూడా వాడారు. అనుకోకుండా పోలీసు సిబ్బంది నాలుగు దిక్కులనుంచి కమ్ముకొని వచ్చింది. బాంబు వేశారనే కక్షతో తుపాకులు పేల్చారు. అందులోనే ప్రదీప్ మరణించాడు....''

ఆమె మళ్లీ శూన్యంలోకి చూడసాగింది.

రమేష్ ఆమె చేయిని తీసుకొని, మెల్లగా ఒత్తుతూ, 'మీ పార్టీ వ్యవహారాలు కత్తిమీద సాములాంటివి. ఎన్నో ఎదుర్కోవాలి. ఇంకా ఎన్నింటికో సాక్షిగా నిలవాలి. మీరు ఇప్పుడే యిలా అధైర్యపడితే ఎలా?' ధైర్యం చెప్పాడు.

'నేను నమ్మిన సిద్ధాంతాలకు నా ప్రాణాలు యివ్వడానికి కూడా వెనకాడను రమేష్! కాని ప్రదీప్.........ప్రదీప్.........నాకు అన్నలేని లోటుని తీర్చాడు. లోకమంటే ఏమిటో నాకు వివరించాడు. ఆయన హఠాత్తుగా చనిపోయాడంటే నా మనస్సు తట్టుకోలేక పోతోంది. ప్రదీప్ యిల్లు, మా యింటికి కొంచెం దూరంలో వుంది. మా అమ్మ నా ఆరవ యేటనే పోయింది. మా క్లాస్‌మేటు అర్చన వెంట వాళ్ల యింటికి వెళ్లేదాన్ని. వాళ్ల అమ్మ నన్ను ఆదరంగా చూచేది. అర్చన అన్నయ్యే ప్రదీప్. చిన్నప్పటి నుంచే మేము ముగ్గురం చనువుగా వుండే వాళ్లం. నేను స్కూలు ఫైనల్‌కి రాగానే అతను తెచ్చుకొన్న పార్టీ సిద్ధాంతాల పుస్తకాలు నాకు కూడా యిచ్చేవాడు. జీవితం అంటే ఎంతో అసంతృప్తిగా వున్న నాకు, ఆ సిద్ధాంతాలు బాగా నచ్చాయి. అర్చనకు మట్టుకు ఏమాత్రం నచ్చలేదు. కొన్ని రోజుల తర్వాత ప్రదీప్ ప్రోద్బలంతో నేను పార్టీలో మెంబరుగా చేరాను.'

'అతను వెళ్ళిపోయినా, ఆయన చూపిన మార్గం వుంది. ఆ దారిలో నడవడమే మీరు ఆయన ఆత్మకుయిచ్చే తృప్తి.'

'ఏమో రమేష్, నిజంగా నాలో సగం ధైర్యం చచ్చిపోయింది. ఈ పైంకి జగదీష్‌బాబు కూడా ఊళ్లో లేరు. మా బాబాకి యీ పార్టీల గొడవలు ఏమీ తెలియనీయను. మనసులో మసలుతున్న విషయాలను ఎవ్వరికీ చెప్పలేక యిక్కడికి వచ్చాను. మీరు ఆప్తులని నా మనస్సుకు తెలిసిందేమో' నాకు తెలియకుండానే అన్ని విషయాలు చెప్పుకుపోయాను.'

'మీరు నన్ను ఆప్తునిగా తలిస్తే అది నిజంగా నా అదృష్టం. మీరు మాత్రం ధైర్యంగా వుండాలని కోరుతున్నాను.'

ఇంకా కొన్ని విషయాలు మాట్లాడిన తర్వాత, 'మీరు క్యాంపుకి వెళ్ళేది ఎప్పుడు?' అని మాట మార్చింది రేణు.

'రెండు రోజుల తర్వాత. వెళ్ళేముందు కలసిపోదామని వచ్చాను.

'థ్యాంక్స్!'

చీకట్లు యీసారి ఆ ప్రాంతాన్నంతా పూర్తిగా లీనం చేసుకొన్నాయి. ఇద్దరూ మాట్లాడుకొంటూ బయలుదేరారు.

# 13

మూడురోజుల ప్రయాణం తర్వాత రమేష్ తాను పరిశోధన చేయవలసిన చోటికి చేరుకొన్నాడు. మొదట రైల్లో, తర్వాత బస్సులో, ఆ తర్వాత కంచెర గాడిదల మీద సామాను వేసుకొని తన గమ్యాన్ని చేరుకొన్నాడు. వెంట ఒక వంటమనిషి కూడా వున్నాడు.

కాలిగచర్ గ్రామానికి చేరుకునేసరికి మధ్యాహ్నం రెండు గంటలవుతోంది. పనిమనిషి అమర్ సింగ్ ఊళ్ళోకి వెళ్ళి నలుగురు కూలీలను తెచ్చాడు. వాళ్ళ సాయంతో భూమిని చదునుగా చేయించాడు. ఒక చెట్టుకి దగ్గర్లో తన డేరాను, వెనకవంటకు కావలసిన డేరాను, ఆవెనక వంట

మనిషికి కావలసిన డేరాను వేయించేసరికి సూర్యుడు యిక నేను వుండలేనని విసుగుతో వెళ్ళిపోయాడు.

ఒక కూలీ రెండు బక్కెట్లతో నీళ్ళకై వెళ్లాడు. రమేష్, అమర్ సింగ్‌ని పిలిచి టీ చేసి తీసుకరమ్మని అడిగాడు.

పాలు ఊళ్ళోనుంచి తీసుకురావాలని ననిగాడు. ఫర్వాలేదు, బ్లాక్ టీ తెమ్మని పురమాయించాడు రమేష్.

పదినిమిషాల్లో పొగలు గ్రక్కుతున్న పాలులేని టీని తెచ్చాడు అమర్‌సింగ్. ఆత్రంగా ఒక గ్రుక్కను మింగాడు రమేష్. అలసిన నరాల లోకి యేదో కొత్త శక్తి ఉరికి వచ్చినట్లు అతను ఫీలయ్యాడు.

పనివాళ్లు నీళ్లు పెట్టి వెళ్ళిపోయారు. అమర్ సింగ్ వెలిగించిన రెండు లాంతర్లు గ్రుడ్డిగా వెలుగుతున్నాయి. కాలి గచర్ ఊరు ఎటువేపు వుందో ఆ చీకట్లో గుర్తించడానికి ఒక్క దీపమైనా కనిపించడం లేదు.

అమర్‌సింగ్ రాత్రికి భోజనం తయారు చేశాడు. వ్యవధి లేనందు వలన బియ్యం, పప్పు, ఆలు కలిపి కిచిడీ వండాడు. రమేష్ నాలుగు ముద్దలు నోట్లో పడేసుకొని భోజనం అయ్యిందనిపించి లేచాడు.

రాత్రి పది అవుతోంది. బయట డేరా కదిలినట్లు చప్పుడయితే టార్చి తీసుకొని వచ్చాడు రమేష్. గాలి ఉధృతంగా వీస్తోంది. డేరా త్రాళ్లు బిగించిన యినుప ఊచలు భూమిలోకి లోతుగా దిగలేదు. గాలికి అవి పైకి లేస్తున్నాయి. వెంటనే అమర్‌సింగ్‌ని పిలిచి వాటిని సుత్తితో దిగేయించాడు.

మళ్ళి ఇంకో అరగంట తర్వాత అదే చప్పుడు వినిపించసాగింది. బయటికి వచ్చి అమర్‌సింగ్‌ని పిలవడానికి అతని డేరా దగ్గరికి వచ్చాడు రమేష్. బాగా అలసిపోయాడేమో, అతను గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. రమేష్‌కి అతన్ని లేపాలనిపించలేదు.

పడుకొందామని పడక సర్దుకొన్నాడు రమేష్. డేరా యింకా ఎక్కువగా కదలసాగింది. కట్లు ఊడి తనమీద కుప్పగా కూలుతుందేమో ననిపించింది. టార్చి, సుత్తె తీసుకొని బయటికి నడిచాడు. గాలి తుఫానులా వస్తోంది. రమేష్ ఓపికగా ప్రతి ఊచను భూమిలోకి దిగకొట్టాడు.

డేరాలోకి తిరిగి వచ్చిన మరో పది నిమిషాలకు మళ్లీ అదే చప్పుడు. భూమి గట్టిగా ఉండడంవలన ఊచలు లోతుగా దిగడం లేదు. మరుసటి రోజు ప్రొద్దున్నే పనివాళ్ళతో బాగా లోతుకు దిగేయాలనుకొన్నాడు. డేరా చప్పుడు ఎక్కువైనప్పుడల్లా రమేష్ బయటికి వెళ్ళి సుత్తెతో కొట్టి రావడంతో, ఆ రోజు రాత్రి అతనికి జాగరణం అయ్యింది.

మూడు, నాలుగు గంటలకు గాలి ఉధృతం తగ్గినట్లుంది. రమేష్ గాఢనిద్రలోకి ఒరిగిపోయాడు.

'సాబ్, చాయ్' అని అమర్‌సింగ్ ఏడు గంటలకు పిలిచేసరికి, మత్తుగా కళ్లు నులుముకొంటూ లేచాడు రమేష్.

* * *

వారం రోజులు గడిచిపోయాయి. రోజూ యిద్దరు పనివాళ్లని తీసుకొని శిలలని పరీక్ష చేయడానికి వెళ్లేవాడు రమేష్. రాత్రిపూట ఒకతన్ని వాచ్‌మెన్‌గా వుంచాడు.

మ్యాపు ప్రకారం కాలిగచర్ నుండి తను చూడవలసిన ప్రదేశాలకు వెళ్లేవాడు. కంపాస్‌తో శిలల మీద కొలతలు తీసుకునేవాడు. సుత్తితో రాయిని పగల గొట్టి, భూతద్దంతో ఆ రాయిని వివిధ అంశాల కొరకు పరీక్ష చేసి, పుస్తకంలో వ్రాసుకునే వాడు.

మధ్యాహ్నం భోంచేసి కొద్దిసేపు నిద్రపోయాడు రమేష్. కళ్లు తెరిచేసరికి డేరా వెనక ఎవ్వరో గట్టిగా మాట్లాడుతున్నట్లు వినపడింది. ఆశ్చర్యంగా బయటికి వచ్చాడు రమేష్.

రమేష్‌ని చూచి ఒక స్త్రీ వెంటనే ముసుగుని ముఖంమీదికి లాక్కొంది. అమర్‌సింగ్ ముందుకు వచ్చి, ఆమె పనిమనిషి భార్య అని, నిన్న వారం రోజుల కూలీ డబ్బులు యిస్తే, అంతకుముందు త్రాగుడుకై చేసిన అప్పులు చెల్లించి, మిగతాది, త్రాగి ఖర్చు చేశాడట. డబ్బులు అతని చేతికి యివ్వవద్దనిప్రార్థించడానికి వచ్చిందని తెలిపాడు.

రమేష్ విసుపోయాడు. మన దేశంలో ఏ మూలకుపోయినా త్రాగుడు దురలవాటులేని చోటులేదు. ఇంట్లో యిల్లాలు, పిల్లలు పస్తుండినా త్రాగుడు మాత్రం మరవరు.

'సాబ్.... ఈ వారం నుంచి డబ్బు నాకు యివ్వండి' అని ఆ స్త్రీ హిందీలో అంది.

రమేష్ ఆ పని పిలిచి మందలించాడు. 'తప్పయ్యింది సాబ్' అంటూనే అతను తన భార్యని కొర కొర చూశాడు. ఇంటికి వెళ్ళిన తర్వాత ఆమెకు తన్నులు తప్పవు అనుకొన్నాడు రమేష్.

# 14

ఆ రోజు మధ్యాహ్నం రెండు గంటలకి రమేష్ ఫీల్డు నుంచి తిరిగి వచ్చాడు. చెట్టు నీడన ఎవ్వరితోనో మాట్లాడుతూ కూచున్న అమర్‌సింగ్ రమేష్‌ని చూడగానే లేచి డేరాల వైపు నడిచాడు.

స్నానానికి నీళ్లు అవీ పెట్టించాడు. కుక్కలు రాకుండా వంట చేసే డేరా ముందుభాగాన్ని మూసి ఉంచాడు అంతకుముందు. వడ్డించుదామని త్రాళ్ల విప్పసాగాడు.

'పాము, పాము' అని బొలికేకలు పెట్టాడు అమర్‌సింగ్. కూలీలతో పాటు రమేష్ కూడా పరుగెత్తుకొని వచ్చాడు.

నాలుగైదు అడుగుల పొడవువున్న పాము చుట్టచుట్టుకొని హాయిగా విశ్రాంతి తీసుకొంటోంది.

కూలీల అరుపులతో అది కదిలింది. పడగను విప్పి తీవ్రంగాచూసింది. కూలివాడు తెలివిగా ఆ పడగమీద రెండు దెబ్బలు వేశాడు. అది వెంటనే చచ్చిపోయింది. కట్టెతో తీసి ఆ పాముని దూరంగా విసిరేశారు.

ఈ అయిదు నెలల్లో, రమేష్ క్యాంపులో దీనితో నాలుగు పాములను చంపారు. ఎండ తీవ్రతను భరించలేక చల్లగా వున్న డేరాలోకి దూరుతుంటాయి పాములు.

* * *

రమేష్ యింకా నెలరోజులు గడపాలి ఆఫీసు నుంచి ఖర్చుల నిమిత్తం పంపించవలసిన డబ్బు అందలేదు. తన జీతం కూడా యింకా

రాలేదు. కొంత ఆఫీసు జాప్యంకు తోడుగా, పోస్టలు వసతులు సరిగ్గా లేక పోవడంతో బాగా ఆలస్యం జరుగుతుంది

రమేష్ పని కొండ ప్రాంతంలో మిగిలివుంది. అక్కడ ఒక పల్లె కూడా లేదని కూలీలు చెప్పారు. పది రోజులకు కావలసిన వస్తు సామగ్రిని తీసుకొని, నమ్మకమైన నలుగురు కూలీలతో కొండ ప్రాంతానికి బయలుదేరాడు రమేష్.

రెండు రోజుల నడక తర్వాత, ఆ ప్రదేశానికి చేరుకున్నారు. కొండ లోయలోంచి సెలయేరు పారుతోంది. దాని ప్రక్కనే చదునుగా వున్న స్థలంలో క్యాంపుని వేశాడు రమేష్.

హిమాలయ పర్వత శిఖరాలలో పనిచేస్తోంటే ఒక వింత అనుభూతి కలుగుతుంది. ఒకదానికంటే యింకొకటి పోటీపడి పెరిగిన పర్వత శిఖరాలను చూస్తుంటే, సృష్టిముందు మానవుడు ఎంత అల్పుడో బోధ పడుతుంది.

రమేష్ త్వరత్వరగా తన సర్వేని ముగించుకొంటున్నాడు, ఇంతకుముందు నిర్ణయించుకొన్న ప్రోగ్రాం ప్రకారం యింకా మూడు రోజులే మిగిలాయి. భోజన సామగ్రి యింకా రెండు రోజులకు మాత్రమే సరిపోతుందని ఆ రోజు అమర్‌సింగ్ చెప్పాడు. పనివారి దినుసులు కూడా ఆ మరుసటి రోజుతో అయిపోతాయట.

రమేష్ ఆ ఒక్కరోజులో మిగిలిన పనిని పూర్తి చేసుకోవాలని నిర్ణయించుకొన్నాడు. ఆ రోజు చాల త్వరగా తయారై, సాయంత్రం తిరిగి వస్తామని లంచ్ ప్యాకెట్ తీసుకొని బయలుదేరాడు. ఇద్దరు కూలీలు అతనితోపాటు బయలుదేరారు.

పరీక్షించదలుచుకొన్న చోటికి చేతేసరికి పది దాటిపోయింది. కొలతలు తీసుకొంటూ, రాళ్ళని పగులగొట్టి పరీక్షచేస్తూ పూర్తిగా పనిలో నిమగ్నుడైనాడు. చూస్తుండగానే మధ్యాహ్నం రెండయ్యింది.

ఒక చెట్టు నీడన కూచుని రమేష్ టిఫిను విప్పాడు. పనివారు మరో చెట్టుక్రింద కూచుని టిఫిను తింటున్నారు.

ఒక అరగంటసేపు విశ్రాంతి తీసుకొని కొండ రెండవవైపు బయలు దేరాడు రమేష్. కొండలమీద దేవదారు మరియు యితర చెట్లు దట్టంగా పెరిగి వున్నాయి. అక్కడక్కడ ముళ్ళ పొదలు దారికి అడ్డుపడు తున్నాయి.

రమేష్ పరీక్షలు పూర్తయేసరికి మూడయ్యింది క్యాంపుకి తిరిగి వెళ్ళడానికి కనీసం రెండు గంటలైనా పడుతుంది. పనివారితో చెప్పి, రమేష్ క్యాంపువైపు బయలుదేరాడు.

కొంచెం దూరం నడిచి ఒక లోయలోకి వచ్చారు. తమ దగ్గర దినుసులు అయిపోవచ్చినవని, అనుమతి యిస్తే కొద్ది సేపట్లో ఏదైనా షికారు తెచ్చుకొంటామని అడిగారు కూలీలు.

'క్యాంపుకి వెళ్ళేసరికి యిప్పటికే ఆలస్యమవుతుంది. రేపు క్యాంపుకి దగ్గర్లో షికారు చేసుకొందురు, పదండి అన్నాడు' రమేష్.

అడవిలో వేట సులభమని, ఎదురుగా కనిపించే కొండను ఎక్కి, అవతలికి దిగేసరికి తాము వేటను పూర్తి చేసుకొని వచ్చి కలుస్తామని బ్రతిమిలాడారు. రమేష్ ఒప్పుకొన్నాడు.

పనివారు ఆ లోయలోపడి ఎటో వెళ్ళిపోయారు. రమేష్ కొంచెం దూరం నడిచేసరికి, ఒక క్రొత్త రకమయిన శిల కనిపించింది. సుత్తితో దాన్ని పగులుగొట్టి పరీక్ష చేశాడు. ఆ రోజు ప్రొద్దుటినుంచి అటువంటి రాయిని అతను చూడలేదు. ఇంటరెస్టుతో, ఆ రాయి వ్యాపించినవైపు నడక సాగించాడు. అలా పరీక్షలో మునిగిపోయి తను వెళ్ళవలసిన కొండను వదిలి యింకోవైపు పోసాగాడు.

గడియారం చూస్తే సాయంత్రం నాలుగు దాటింది. పనివాళ్ళు చూపిన కొండ కొరకు కళ్ళతో గాలించాడు. అతని చుట్టూవున్న కొండలు అన్నీ ఒకేరకంగా కనిపించాయి. అయిదు నిమిషాలసేపు చూచి, బహుశ అదే అయ్యుంటుందని ఎదురుగా వున్న కొండవైపు బయలుదేరాడు.

ఆ కొండని ఎక్కేసరికి అతనిలో పూర్తిగా ఓపిక నశించింది. ప్రొద్దుటినుంచి తిరుగుతున్నాడు. కొండలు ఎక్కి దిగడంతో శరీరంలో బలం పూర్తిగా తగ్గిపోయింది. కొండ శిఖరాన్నుంచి చూస్తే ఎదురుగా మరొక ఎత్తైన కొండ కనిపించింది.

రమేష్‌కి పూర్తిగా దారితప్పినట్లు అనుమానం కలిగింది. పనివారిని పేర్లతో నాలుగైదుసార్లు పిలిచాడు. జవాబు లేదు. ఎవ్వరినైనా దారిగురించి వాకబు చేద్దామంటే, మరో మానవ ప్రాణి ఆ ప్రాంతంలో లేదు.

పైమిని చూస్తే అయిదవవుతోంది. ఆకాశంలో నల్లని మేఘాలు కమ్ముకుని వస్తున్నాయి. వర్షం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. ఆ అడవిలో చిక్కుకుపోవలసి వస్తుందేమోనని అతనికి ఆందోళన కలగసాగింది.

మరో నాలుగుసార్లు పనివారిని పేర్లతో పిలిచాడు. నిశ్శబ్దంగా వున్న ఆ కొండ శ్రేణులలో అతని పిలుపే జవాబుగా మళ్ళీ పలికింది.

ఆ కొండను దిగి, మళ్ళీ రెండవ కొండను ఎక్కసాగాడు రమేష్. అంతలో వర్షం మొదలైంది. నల్లని మబ్బుల చాటున దాగిన సూర్యుడు ఆ రోజు చీకటికి త్వరగా విముక్తి కలిగించాడు.

రమేష్ వర్షంలో తడుస్తూనే కొండను ఎక్కుతున్నాడు. చెట్ల మొదల్లో ఆశ్రయం తీసుకొందామంటే అవి గాలికి బాగా ఊగుతున్నాయి. ఎప్పుడైనా అవి విరిగి పడవచ్చనే భావన కలుగుతోంది.

ఇంకా కొంచెం ముందుకు వచ్చేసరికి పైనుంచి జారిన రెండు పెద్ద రాతి బండలు ఒకదానిపై యింకొకటి నిలిచి, ఒక మనిషి తలదాచు కునేలా వున్నాయి.

కింద పాములేమైనా వున్నాయా అని చూచి అందులోకి దూరాడు. రమేష్ అడవిలో తోడేళ్లు, ఎలుగుబంట్లు వెనకప్రక్కగా దాడి చేస్తాయని తెలిసి, వీపుని బండకి ఆనించాడు. చేతిలో సుత్తిని పట్టుకొన్నాడు.

వర్షం పూర్తిగా ఆగిపోయింది. చల్లని ఈదర గాలి మొదలైంది. బట్టలు, శరీరం పూర్తిగా తడిసిన రమేష్‌కి వణకు ప్రారంభమైంది. ఆ చలి ఎముకలని కొరికివేస్తున్నట్లు బాధ కలగసాగింది.

ప్రొద్దంతా చేసిన ఫీల్డు పనిలో శరీరం బాగా అలసిపోయి వుంది. తినడానికి ఏమీలేదు, త్రాగడానికి నీరు కూడా లేదు. కొద్దిసేపటికి అతని శరీరం విపరీతంగా వేడెక్క కాసాగింది. తనకి తీవ్రమైన జ్వరం వచ్చిందని రమేష్ గ్రహించాడు.

ఒకవైపు చలి, జ్వరం. మరొకవైపు ఎదురుగా యేమైనా జంతువులు వస్తా యేమోనన్న భయం అతన్ని కన్ను మీద రెప్పను వేయనీయలేదు.

*　　　*　　　*

పనివారు ఒక కుందేలుని వేటాడి, వారు గుర్తు చెప్పి నకొండ దగ్గరకి వచ్చేసరికి రమేష్ జాడ కనిపించలేదు. నాలుగైదుసార్లు 'సాబ్' అని కేకలువేశారు. ఇంకో అరగంటసేపు అక్కడే వుండి కుందేలుని కాల్చి వండటానికి సిద్ధం చేసుకొన్నారు. అప్పటికీ రమేష్ రాకపోయేసరికి మరో నాలుగైదుసార్లు పిలిచారు. సాబ్ అలసిపోయుంటారు. బహుశ క్యాంపుకి నేరుగా వెళ్ళి వుంటారనుకొని పనివాళ్లు క్యాంపుకి బయలుదేరారు.

పనివాళ్లు క్యాంపుకి చేరేసరికి ఏడవుతోంది. అమర్‌సింగ్ ఆత్రంగా ఎదురు వచ్చాడు. సాబ్ ఏరి అని అమర్‌సింగ్ అడిగేసరికి పనివాళ్లు తెల్లబోయారు. జరిగిన విషయం చెప్పారు.

అమర్ సింగ్ వాళ్ళని నోటికి వచ్చినట్లు తిట్టాడు. వెంటనే వెళ్లి వెదుకుదామన్నాడు. చీకట్లో ప్రయోజముండదని, ప్రొద్దున్నే వెళ్దామని పని వాళ్లు నచ్చచెప్పారు.

తెల్లవారేసరికి అమర్ సింగ్, కూలీలతో రమేష్ విడిపోయిన లోయ దగ్గరికి వచ్చాడు. అమర్‌సింగ్, కూలీవాడు ఒక వైపు, యింకో యిద్దరు మరోవైపు 'సాబ్ సాబ్' అనిపిలుస్తూ వెదకసాగారు.

తెల్లవారే సమయానికి రమేష్‌కి కొంచెం నిద్ర వచ్చింది. అమర్ సింగ్ కేకలు చెవుల సోకాయి. అతనికి ప్రాణము లేచివచ్చినట్లయ్యింది. వెంటనే లేవబోయాడు. కాని బాగా చలి కొట్టిన కాణ నిర్వీపమై అతన్ని లేవనీయలేదు. అతను మెల్లగా యివతలకి జరిగి 'అమర్‌సింగ్, యిటు' ఓపిక చేసుకొని గట్టిగా కేకలు వేశాడు.

ఆ కేకలు వినగానే అమర్‌సింగ్ తుపాకీ గుండులా పరుగెత్తు కొచ్చాడు దగ్గరికి.

ఒంటిమీద చేయివేసి చూస్తే జ్వరముంది. మిగతా పనివారిని రమ్మని పిలిచాడు అమర్‌సింగ్. అతను జేబులోంచి ఒక బ్రాందీ సీసాను

తీశాడు. అది యింతకుముందు రమేష్ యిచ్చిందే. కలకత్తా నుంచి బయలు దేరేముందు, రమేష్ మిత్రుడొకడు 'వైద్య సదుపాయం లేని ప్రదేశానికి వెళ్లుతున్నావు. చలితో కూడిన జ్వరం ఎప్పుడైనా వస్తే ఈ బ్రాందీని మందులా సేవించు,' అని బలవంతంగా ఆ సీసాను యిచ్చాడు. రమేష్ అది అమర్‌సింగ్‌కి యిచ్చి వాడుకోమన్నాడు.

ఎప్పటికైనా అవసరమౌతుందని అమర్‌సింగ్, ఆ సీసాను అలాగే వుంచాడు.

'సాబ్ యిది మందులా కొంచెం త్రాగండి' అని సీసాను రమేష్‌కి యిచ్చాడు. అతను సీసాను తీసుకొని గబగబ నాలుగైదు గుక్కలు త్రాగాడు.

రమేష్ శరీరంలోకి ఏదో నూతన శక్తి వచ్చినట్లయ్యింది. జ్వరం కూడా తగ్గుముఖం పట్టినట్లనిపించింది. కాళ్లు, చేతులు, నరాలు తేలికపడ్డాయి. రమేష్ లేచి అమర్‌సింగ్ భుజం పట్టుకొని నెమ్మదిగా నడవసాగాడు.

# 15

ఆరు నెలల తర్వాత రమేష్ కలకత్తాకు తిరిగి వచ్చాడు. అతను కనీసం ఏడెనిమిది పౌన్లబరువు తగ్గివుంటాడు. అద్దంలో ముఖాన్ని చూచుకుంటే టోపీ పెట్టుకున్నంత భాగం తెల్లగా, మిగతాది నల్లగా కనిపించింది. ఆ అలుపు పోవాలంటే కనీసం ఒక వారం రోజులైనా పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి అనుకొన్నాడు రమేష్.

ఆ రోజు ఆఫీసు నుంచి తిరిగి రాగానే ప్రక్కింటతను ఒక టెలిగ్రాం రమేష్ చేతికి అందించాడు. అది ఏడు రోజుల క్రింద యిచ్చిన టెలిగ్రాం. ఇంతకుముందు తను వున్న క్యాంపు నుండి తిరిగి ఇక్కడికి వచ్చింది.

ఆత్రంగా టెలిగ్రాం విప్పాడు రమేష్. 'నాన్నగారు పోయారు, వెంటనే రావలసింది' అని రమేష్ అన్న నారాయణ యిచ్చిన టెలిగ్రాం అది.

సామాను ఒక చిన్న సూటుకేసులో పడేసుకొని టాక్సీ ఎక్కి స్టేషనుకి బయలుదేరాడు. నాన్నగారు పోయారే అనే షాక్ రమేష్‌కి యేమాత్రం కలుగలేదు. ఏదో దూరపు బంధువు పోయారనే భావన తప్పితే వేరే బాధ కలుగలేదు.

రమేష్, వాళ్ల నాన్న నర్సయ్య మధ్యవున్న సంబంధం అలాంటిది. నర్సయ్యకు రమేష్ నడివయస్సు దాటిన తర్వాత కలిగాడు. అతని పెద్ద కొడుకు నారాయణకి, రమేష్‌కి మధ్య పదిహేను సంవత్సరాల తేడా వుంది.

రమేష్‌కి అయిదవ ఏటనే తల్లిపోయింది. ఆ మరుసటి సంవత్సరం నారాయణ పెళ్ళి జరిగింది. వదిన నిర్మల, రమేష్‌ని తల్లిలా ఆదరించింది.

రమేష్‌కి పదవఏడు వచ్చేసరికి లోకం కొంచెం తెలిసివచ్చింది. చాలమంది తల్లితండ్రులు తమ పిల్లల్ని బుజ్జగించి లాలించడం చూస్తే అతనికి ఎంతో ఈర్ష్య కలిగేది. ఒక్కరోజుకూడా తనని తండ్రి ఎత్తుకోలేదు, బుజ్జగించలేదు. ఏవైనా వస్తువులు కావాలంటే 'అన్నని అడుగు పో' అని కసరి కొట్టేవాడు నర్సయ్య.

నర్సయ్య యిద్దరి కూతుళ్ళ వివాహాలు జరిపించిన తర్వాత మొత్తం పొలం బాధ్యత, సంసార బాధ్యత నారాయణకే అప్పగించాడు. ఎప్పుడూ పదిమంది ఊళ్లో వారు, నర్సయ్య యింటిముందు వుండేవారు. వాళ్ళ తగాదాలు విని తీర్పులు చెప్పేవాడు. ఏవైనా యిబ్బందులు వస్తే, వారికి సలహాలు యిచ్చేవాడు. అలా అతనికి కాలం గడిచిపోయేది.

ఆ రోజు స్కూల్లో సంవత్సరం పరీక్ష ఫలితాలు తెలిశాయి. రమేష్ తరగతిలో ఫస్టుగా ఉత్తీర్ణుడయ్యాడు. అతను ఆనందంతో ఎగిరి, యింట్లో అందరికీ చెప్పుదామని ఎంతో ఆదుర్దాగా వచ్చాడు.

నారాయణ పొలం పనిమీద వెళ్ళాడు. వదిన పేరంటానికి వెళ్ళింది. బయట ఆవరణలో కూచున్న తండ్రికి చెప్పాలని కుతూహలం కలిగింది. తండ్రి మెప్పుని పొందాలని, ఆప్యాయంగా వచ్చి వెనకనుంచి మెడను పట్టుకొంటూ, 'అయ్యా! నేను స్కూలులో ఫస్టుగా పాసయ్యానే' అని

లాగబోయాడు రమేష్. అనుకోకుండా రమేష్ అలా పట్టుకోవడంతో నర్సయ్య ముందుకి పడబోయాడు.

నర్సయ్య, రమేష్‌ని విదిలించుకొని 'ఒరే వెధవా, అలా ప్రాణాలు తీస్తావేంరా? ఫసుగా పాసయితే కొమ్ములు మొలిచాయా? వెధవా........ ఫస్టుగా పాసయ్యాడట. ఫో, అవతలికి' అని చీదరించు కొన్నాడు.

రమేష్ నివ్వెర పోయాడు. తన సంతోషమంతా పొంగుతున్న పాలమీద నీళ్ళు చల్లినట్లు చల్లారిపోయింది. అతనికి ఏడ్పురాలేదు. ద్వేషం కలిగింది. తండ్రితో మళ్ళీ యింకోసారి తనకుతానుగా మాట్లాడవద్దని మనస్సులో ఒట్టు పెట్టుకొన్నాడు. అంతే! ఆ రోజు నుంచి నర్సయ్య రమేష్ తండ్రీ కొడుకులు అన్నమాటే కాని, ఒక్కరోజు కూడా మళ్ళీ మనస్సు విప్పి మాట్లాడుకోలేదు.

నారాయణ, నిర్మల రూపాలు కళ్ళముందర కదలగానే, అతని మనస్సులో ఒక విధమైన శాంతి కలిగింది. చిన్నప్పుడే తల్లి పరలోకానికి వెళ్ళినా, తండ్రిప్రేమను పొందలేక పోయినా, రమేష్ మనస్సుని ఊరడించి, ఆయన యోగక్షేమాలను చూచిన అసలు తల్లితండ్రులు – అన్నా వదినలు.

వేసవికాలంలో రమేష్ స్నేహితులతో కలసి బావిలో యీదడానికి వెళ్ళాడు. అందరూ దొంగాట ఆడుతున్నారు. రమేష్ ఆటలో దొంగ అయ్యాడు. నీళ్ళల్లో మునుగుతూ, గంటసేపు ప్రయత్నించి, ఆ ముగ్గురిలో ఒకరిని పట్టుకొన్నాడు.

నీళ్ళల్లోంచి యివతలికి రాగానే రమేష్ కళ్ళు ఎర్రబడ్డాయి. చెవులలో నుండి యేవో వేడిపొగలు వస్తున్నట్లు తోచింది.

ఇంటికి వచ్చి గదిలో ఒకమూల పడుకొన్నాడు రమేష్. దీపాన్ని వెలిగించి నిర్మల అతన్ని లేపబోయింది. ఆమె చేయికి అతని శరీరం చాల వేడిగా తగిలింది. మళ్ళీ చూస్తే అతనికి జ్వరం తీవ్రంగా వుంది.

నిర్మల వెలుపలకి వచ్చేసరికి అప్పుడే నారాయణ పొలంనుంచి తిరిగి వచ్చాడు. ఎదుర్గా అతని దగ్గరికి వచ్చి 'రమేష్‌కి బాగా జ్వరంగా వుంది. నేను యింతకుముందే చూశాను. శాస్త్రిగారిని తీసుకవస్తారా?' అని అడిగింది.

ఇప్పుడెందుకులే, ప్రొద్దున చూద్దాం అని అందామనుకొని, రమేష్ విషయంలో అటువంటి మాటలకు ఆమె విసుగు చెందుతుందని నారాయణ బయలుదేరాడు.

శాస్త్రిగారు పరీక్ష చేసి మాత్రలు, కషాయం ఇచ్చాడు. శీత జ్వరం, తగ్గిపోతుందని చెప్పాడు.

మందులు వాడుతూనే వున్నారు. కాని జ్వరం తగ్గటంలేదు. మూడు రోజులయింది. రమేష్ బలహీనతతో లేవలేకపోతున్నాడు. 'టైఫాయిడ్' అనే అనుమానం కలిగింది నిర్మలకు.

మరుసటి రోజు రమేష్‌ని హాస్పిటలుకు తీసుకెళ్ళాలని నిర్మల సలహా ఇచ్చింది. నారాయణ వెంటనే ఒప్పుకొన్నాడు. హాస్పిటలు పది మైళ్ళ దూరంలో సంగారెడ్డిలో వుంది.

అరగంటలో ఎడ్లబండి తయారయ్యింది. నిర్మల కూడా వస్తానంటే నారాయణ ఎదురు చెప్పలేకపోయాడు. ముందు నిర్మల బండి ఎక్కి కూచుంది. నారాయణ, యింకో పనిమనిషి రమేష్‌ని ఎత్తుకొని వచ్చి బండిలో పడుకోబెట్టారు. నిర్మల, రమేష్ తలని తన ఒళ్ళోకి తీసుకొంది. నారాయణ ఎడ్లను అదిలించాడు.

బండి కుదుపులకు రమేష్‌కి మెలకువ వచ్చింది. ఎదురుగా వదిన కనిపించింది.

'ఎక్కడికి వదినా?' నెమ్మదిగా అడిగాడు.

'జ్వరం తగ్గడంలేదు, హాస్పిటలుకు.'

'తగ్గిపోయేదిగా ! అంతదూరం ఎందుకు?' అంటూనే కళ్ళు మూసుకొన్నాడు.

అతని రెండు కళ్ళల్లో నుండి నీరు ధారగా కారసాగింది. అమ్మను మించిన ఆప్యాయతను చూచి రమేష్ కళ్ళల్లో నీరు ఆగలేదు.

జ్వర తీవ్రతకు నీరు వస్తుందని తుడుస్తూ, 'భగవంతుడా, మా రమేష్‌ని కాపాడు' అని కళ్ళల్లో నీరు నింపుకొంది నిర్మల.

సంగారెడ్డిలో, హాస్పిటలుకు రాగానే డాక్టరు పరీక్షచేసి ముందుగా గ్లూకోజ్ ఎక్కించాడు. గ్లూకోజ్ ఎక్కించడానికి నరాన్ని వెదికి రెండు

మూడు చోట్ల గాట్లువేసి చివరికి సూదిని ఎక్కించారు. నిర్మల మనస్సు అది చూచి తల్లడిల్లింది.

నారాయణ, నిర్మల క్షణం వదలకుండా అక్కడే వున్నారు. నాలుగు రోజుల తర్వాత జ్వరం పూర్తిగా తగ్గిపోయింది.

రమేష్ నారాయణ చేయిని పట్టుకొని 'అన్నయ్యా! నువ్వు, వదిన నిజంగా దేవుళ్లు. నా ఆరోగ్యం గురించి ఎంత ఆందోళనపడ్డారు!' అన్నాడు.

'అంతంత మాటలెందుకయ్యా! నీవు చల్లగా వున్నావు, మాకంతే చాలు' అని నిర్మల కళ్లు ఒత్తుకొంది.

'అంతే' అన్నట్లు తమ్ముని చేయిని నెమ్మదిగా ఒత్తాడు నారాయణ.

* * *

రమేష్ కందికి చేరుకొన్నాడు. ఆ మరుసటి రోజే కర్మకాండ జరిగింది. ఊరిలోని నలుగురు పెద్దలతోపాటు నారాయణ, రమేష్ కూచున్నారు.

'మీ నాన్న ఉన్నన్ని రోజులు నారాయణే సంసారం, పొలం అంతా చూస్తూ వస్తున్నాడు. నీవేమో దూరంగా ఎక్కడో వుంటున్నావు. ఆస్తి అంతా లెక్క చూసుకొని చెరి సగం పంచుకుంటే బావుంటుంది' అన్నాడు ఒకతను.

రమేష్‌కి ఒళ్లు మండింది. అంతలో నారాయణ 'అవునురా తమ్ముడు! లోకం నాలుగు రకాలుగా అంటుంది. ఆస్తిని రెండు భాగాలుగా పంచినా, నీ వాటా కొచ్చిన పొలాన్ని నేనే సేద్యం చేయించి దానిపై వచ్చిన ఆదాయాన్ని వేరుగా వుంచుతాను' అన్నాడు.

'ఏమిటన్నయ్యా నువ్వు కూడా! మా అన్నయ్యకు ఇప్పుడు ఇద్దరు పిల్లలున్నారు. వాళ్లు ఆస్తిని పంచమని ఎప్పుడయితే మా అన్నయ్య దగ్గరికి వస్తారో, అప్పుడే నాకుకూడా వాటా కలిపి మూడు భాగాలుగా పంచుతాడు. నన్ను కన్న తల్లితండ్రులు యింతకుముందే పోయారు. కాని నన్ను పెంచి, ఆదరించిన తల్లితండ్రులు మా వదిన, అన్నయ్యా. ఇక ఆస్తి విషయం ఎత్తవద్దు' అని రమేష్ లేచి లోపలికి వెళ్ళిపోయాడు.

అతని ఆప్యాయతకు, నారాయణ కంటిలో ఒక నీటి చుక్క తళుక్కుమంది.

ఆరోజు రాత్రి భోజనాలు వడ్డిస్తూ 'ఎవరైనా మంచి పిల్లని చూస్తే, యీసారి రమేష్‌కి పెళ్లి చేయొచ్చు' నిర్మల అంది.

నారాయణ తినబోతూ ఆగి, 'వాడు మనలాగ పాత విచారాలు కల మనిషి కాడు, మనం చూచిన అమ్మాయిని చేసుకోవడానికి. చదువుకొన్న వాడు, నాలుగు విషయాలు తెలిసినవాడు, ఏ అమ్మాయిని కావాలంటే ఆ అమ్మాయిని తెచ్చి పెళ్లి చేస్తాను' అన్నాడు.

నిర్మల నవ్వింది. 'బాగుంది వరస. పెద్దవారు నిర్ణయం చేస్తారంటే అతనికే వదిలేశారా? ఏమయ్యా, తొందరగా ఏదో నిర్ణయం చేయి' అని రమేష్‌ని కోరింది.

'చూద్దాంలే వదినా, సమయం రానీయి' అని తినడంలో నిమగ్నుడైనాడు రమేష్.

ఆ వారం రోజులు నారాయణ, నిర్మలకు యేదో పండగలా వుంది. ఇద్దరు పిల్లలు రమేష్‌ని ఒక్క క్షణం కూడా తీరికగా కూచోనిచ్చేవారుకారు.

# 16

రమేష్ కలకత్తాకు వచ్చి రెండు రోజులయ్యింది. ఆ రోజు సాయంత్రం రామనాథంగారిని చూద్దామని వెళ్ళాడు. ఇల్లంతా బోసిపోయినట్లుంది. తోటను ఎవ్వరూ పట్టించుకొన్నట్లు లేదు. పనిమనిషి తలుపు తెరిచాడు. అతను కూడా ఏదో దిగులుగా వున్నట్లనిపించింది. రామనాథం గురించి అడిగాడు రమేష్.

'అతను వస్తే వస్తాడు, లేకుంటే రాడు. ఈ రెండు నెల్లనుంచీ ఒక అమ్మాయితో వుంటున్నాడు'.

పనిమనిషి చెప్పిన మాటలను నమ్మలేకపోయాడు. అన్నీ తెలిసిన రామనాథం, వయస్సు వచ్చిన తర్వాత యిలా చేయగలడని రమేష్ ఎన్నడూ అనుకోలేదు.

ఎక్కడుంటున్నారో అడ్రసు యిమ్మంటే పనిమనిషి భయపడ్డాడు. అతనికి ఏమీ భయం అవసరం లేదని అడ్రసు తెలుసుకొని, బయలు దేరాడు రమేష్.

బేహాలాలో ఒక చిన్న యిల్లు అది. చుట్టూ కాంపౌండ్ వుంది. చక్కని పూలమొక్కలు ఆహ్లాదంగా వున్నాయి. తలుపుని తట్టిన మరు క్షణంలో ఎదురుగా నిలుచుంది సుధ.

ఈసారి నిజంగా రమేష్ షాక్ తిన్నాడు. పెదవులను తడుపు కొంటూ 'మీరా ?' అన్నాడు.

'మీరు....ఎవ్వరో....' సుధ తన జ్ఞాపకాలను ఖాయపరచుకొందా మని అడిగింది.

'నేను, మూర్తి వాళ్ళతో కలసి అసోసియేషన్ విరాళాలు వసూలు చేయడానికి వచ్చాం మీ దగ్గరికి.'

'అలాగా!' అని యింకా యేదో అంటూండగా, 'రామనాథంగారు వున్నారా? వారిని కలుద్దామని....'

'లోపలికి రండి, వారు వచ్చే వేళయ్యింది' అని జవాబుకి ఎదురు చూడకుండా లోనికి వెళ్ళింది. తప్పనిసరియై లోనికి వెళ్ళాడు రమేష్.

రూము చక్కగా అలంకరించబడివుంది. ఎదురుగా ఒక పెద్ద ఫొటో కనిపించింది. మధ్యలో ఒక నడివయస్కురాలు, ఒడి ప్రక్క ఇరవై సంవత్సరాల యువకుడు, ఎడమ ప్రక్క సుధ వున్నారు. సుధని చూడగానే అతని చూపు తిరస్కారంతో ప్రక్కకు మళ్ళింది.

అంతలో సుధ కాఫీ కప్పుతో ఎదురైంది. అయిష్టంగానే కాఫీ కప్పుని అందుకొన్నాడు రమేష్. కాఫీని చప్పరించ సాగాడు.

'నన్ను చూచి యిప్పుడు అసహ్యించు కొంటున్నారు కదూ ! ఆ రోజు ఉదారంగా విరాళం యిచ్చిన మనిషి ఈమేనా అని ఆశ్చర్య పోతు న్నారా?' సుధ అంది.

రమేష్ అంతగా ఆశ్చర్యపడలేదు. ఫ్రీ స్కూలు స్ట్రీటులో ఆ రోజు జరిగిన విషయాన్ని చెప్పుదామనుకొని, ఆమె బాధ పడుతుందని మాని వేశాడు.

'నేను ఊబిలో వున్నాను, నిజమే. రోజురోజుకి దిగిపోతున్నాను. దానికి కారణమెవ్వరు?' అని అడిగింది. ఆ తర్వాత రెండు క్షణాలు మౌనంగా ఉండిపోయింది.

'కారణం లేనిదే ఎవ్వరు, ఏ పని చేయరు నిజమే! కాని అవసరాలున్నంత మాత్రాన వ్యభిచారం చేయవలసిందేనా?' ఎదురు ప్రశ్నవేశాడు రమేష్.

'నేను అవసరముండి యీ పని మొదలుపెట్టలేదు. మా నాన్నగారు షాలిమార్ రంగుల కంపెనీలో ఫోర్‌మెన్‌గా పనిచేస్తూ హఠాత్తుగా మరణించారు. ఆ ఫొటోని చూడండి. వాడు మా తమ్ముడు. ఇంకా స్కూల్ ఫైనలులో వున్నాడు అప్పుడు. సంసారం బాధ్యత నా మీద పడింది. ఉద్యోగం కొరకు తీవ్రమైన ప్రయత్నం చేశాను. చివరికి ఒక రెడీమేడ్ దుస్తుల షాపులో సేల్స్‌గరల్‌గా కుదిరాను. ఒక పది రోజులు బాగానే జరిగింది. ఒకరోజు ఏడెనిమిది ప్యాకెట్టులు యిస్తూ, ఒకరి ఇంటికి వెళ్ళి, వాళ్ళ అమ్మాయికి ఏ జతలు నచ్చుతాయో యిచ్చి రావలసిందని టాక్సీని పిలిచాడు మా యజమాని రోషన్‌లాల్. నేను అమాయకంగా వెళ్లాను.

'తలుపుని తట్టి లోపలికి వెళ్ళగానే ఒక వ్యక్తి నవ్వుతూ ఎదురయ్యాడు. లోపల పాప వుంది వెళ్ళమన్నాడు. అడుగు లోపల వేయగానే తలుపుని మూశాడు. అంతే! నా ఒంటిమీద చేయివేశాడు. నేను వ్యతిరేకించాను.

'మీ బాస్ చెప్పలేదా? అయిదువందల రూపాయలు యిచ్చివచ్చాను అని అంటూంటే నేను ఆశ్చర్యపోయాను.

'లోకంలో ఇంత మోసగాళ్లు వుంటారంటే వినడమేకాని, యిప్పుడు నా విషయంలోనే అది జరిగింది.

'పది పదిహేను నిమిషాల పెనుగులాట తర్వాత అతని బలానికి నేను లొంగిపోక తప్పలేదు. ఆ యింటి నుంచి యివతలకి వచ్చిన తర్వాత నాకు ఏడుపు ఆగలేదు. అలా ఏడుస్తూనే యిల్లు చేరుకొన్నాను.

'అమ్మ, తమ్ముడు ఆందోళనపడ్డారు జరిగిన విషయం చెప్పాను.

'ఆఁ, రోషన్‌లాల్ యింత పనిచేస్తాడా? వాని అంతు చూస్తాను అని నా తమ్ముడు శ్రీహరి ఆవేశంగా వెళ్ళాడు. నేను, అమ్మ వద్దని ఎంత వారించినా వినిపించుకోలేదు.

'మరో రెండు గంటలకు మా యింటి ప్రక్కన వున్న వాటాలోకి నా కోసం టెలిఫోను వచ్చింది. వణుకుతూ ఫోన్ ఎత్తాను. సుధని అన్నాను.

'సబ్ఇన్స్పెక్టరు మాట్లాడాడు. శ్రీహరికి జీపుతో సీరియస్ ఆక్సిడెంట్ జరిగిందట. అంతకుముందే మరణించాడు. శవం పి. జి. హాస్పిటలులో వుందని తెలిపాడు.

'ఏడుస్తూ ఫోన్ క్రింద పెట్టేశాను. అమ్మ దగ్గరికి వచ్చి భోరున ఏడ్చాను. తెల్లవారి హాస్పిటలుకు వెళ్ళి శవాన్ని తెచ్చాం. అతని ముఖం గుర్తు పట్టలేనంతగా చితికిపోయింది. జేబులో ఒక చిన్నడైరీ, స్నేహితుడు రాసిన ఉత్తరం ద్వారా కనుక్కోగలిగారు.

'అంత్యక్రియలు జరిగిపోయాయి. కాని నా మనస్సులో బాధ ఎక్కువయ్యింది శ్రీహరి నా మూలంగానే చనిపోయాడు. నా మీద ఆ అత్యాచారం జరగకపోతే అతను రోషన్లాల్ దగ్గరికి వెళ్ళవలసి వచ్చేది కాదు. జీపు ఆక్సిడెంటులో మరణించాడో లేదా ఆ రోషన్లాల్ హత్య చేయించాడో ఎవ్వరికి తెలుసు ?

'వారం రోజుల తర్వాత ఫోన్వచ్చింది. నే ఫోన్ఎత్తగానే సుధా ! నేను రోషన్ని. మీ తమ్ముడు చనిపోయాడని తెలిసి చాల బాధపడుతున్నాను. నీవు రేపటినుంచైనా షాపుకి రావాలి అన్నాడు.

'నేను అస్సలు రాదలుచుకోలేదు అని మొండిగా అన్నాను

'నీవు రాకపోతే నేనే మీ అమ్మను కలసి కొన్ని విషయాలు మాట్లాడాలని' బెదిరించాడు.

'నేను భయంతో వణికిపోయాను. తమ్ముడు మరణించాడు. అమ్మ కూడా తన కారణంగా బాధలకు గురికాకూడదు. రోషన్లాల్ ఎంతకైనా తెగించే వ్యక్తిలా వున్నాడు.

'లేదు, లేదు. నేనే వస్తాను రేపు షాపుకి.

'ఆ మరుసటి రోజు షాపుకి వెళ్ళాను. రోషన్లాల్ని చెడా మడా తిట్టాను. నీవు మోసకారివి. అతనిదగ్గర డబ్బుతీసుకొని నన్నొక వేశ్యలా అక్కడికి పంపించావు అన్నాను కోపంగా.

'నీవు వేశ్యవు కావని ఎవ్వరు అంటారో అనమను అని కొన్ని ఫొటోలు టేబులుమీద వేశాడు.

'ఆ ఫొటోలు చూడగానే కళ్ళు బైర్లుకమ్మాయి. ఆ రోజు, ఆ వ్యక్తి నాతో చేసిన చేష్టలన్నీ ఫొటోలలో కనిపించాయి. కసిగా, కోపంగా వాటిని చించేశాను.

'రోషన్‌లాల్ బిగ్గరగా నవ్వాడు. పిచ్చి సుధా! వాటిని చించివేస్తే ఏమవుతుంది? రేపు ప్రొద్దునలోగా వందల కొలది కాపీలు వేయించగలను. నీవు నేను చెప్పినట్లు వినకపోతే వాటిని వీధి వీధికి సప్లై చేస్తాను. మొదటి కాపీ మీ అమ్మకు అందిస్తాను అన్నాడు.

'దానితో అతను చెప్పినట్లు చేయక తప్పలేదు. ఆ రోజు నుంచి వేశ్యగానే బ్రతుకుతున్నాను.

రమేష్ అంతా విని నిట్టూర్చాడు. సుధమీద నిజంగా జాలి కలిగింది. ఇటువంటి అత్యాచారాలు సినిమాల్లో, నవలల్లో జరిగినట్లు తెలుసుకాని, నిజ జీవితంలో కూడా వాటిల్లుతాయని ఊహించలేకపోయాడు.

'రామనాథంగారు ఎలా వచ్చారు మీ జీవితంలోకి? రమేష్ సందేహంగా అడిగాడు.

'మా అమ్మ మూడునెల్లక్రితం చనిపోయింది. నాకు యిక ఏం జరిగినా విచారం లేదని, రోషన్‌లాల్‌తో మొండిగా ప్రవర్తించాను. అతను కూడా మొన్ననే మరణించాడు. మరణించేముందు, ఆ నెగటివ్‌లు అన్నీ యిచ్చాడు.

'పాతవృత్తిని మానుకొని యేదైనా ఉద్యోగం చేసుకోవాలని తీవ్రంగా ప్రయత్నించాను కాని ఎక్కడా దొరకలేదు.

'ఒకనాడు గాలి పీల్చుకొందామని అలా లేక్ దగ్గరికి వెళ్ళాను. సిమెంటు బెంచీమీద కూచుని ఏదో బాధగా కళ్ళుమూసుకొని వున్న రామనాథంగారు కనిపించారు. ఆయన మన అసోసియేషన్ కార్యక్రమాల ద్వారా బాగా తెలుసు. నేను రెండుసార్లు పిలిచాను 'రామనాథంగారూ' అని. జవాబు రాలేదు. భుజంమీద చేయివేసి లేపాను. చేతికి వేడి చల్లదన తగిలింది.

'అతను నెమ్మదిగా కళ్లు తెరిచాడు, నేను సుధని.........ఏమ యింది? ఏమైనా బాధగా వుందా? అని ఆతృతగా అడిగాను.

'తలూపుతూ గుండె దగ్గర చేయిచూపారు. అతని నుదుటిమీద చెమట వస్తోంది. గుండె నొప్పి అని తెలిసిపోయింది.

'అల్లంత దూరంలో వున్న టాక్సీని పరుగెత్తి పిలుచుకొని వచ్చాను. నాకు తెలిసిన డాక్టరు దగ్గరకి తీసుకవెళ్లాను. డాక్టరు యింజెక్షనుచేసి, మాత్రలు వేశాడు.

'హార్ట్ ఎటాకు జాగ్రత్తగా చూడండి అని అన్నాడు.

'మా యింటికి వెళ్దాం, వస్తారా?' అన్న మాటలకు 'ఊ' అన్నాడు రామనాథం.

'నా అన్నవాళ్లు లేని నాకు, ఆయనకు సేవలు చేయడంలో ఎంతో సంతృప్తి కలిగింది. ఆ రోజునుంచి నేను అతన్ని వెళ్ళమనలేదు. ఆయన వెళ్తాననలేదు. అప్పటినుంచి ఇక్కడే వుంటున్నారు. మా ఇద్దరి వయస్సులో ఎంతో తేడా వున్నా, మా ఇద్దరి మనస్సులు ఒకరినొకర్ని అర్థం చేసుకొన్నాయి' ముగించింది సుధ.

రామనాథం కోసం ఇంకో గంట సేపు ఎదురుచూచి, తాను వచ్చినట్లు తెలియచేయమని కోరి, బయలుదేరాడు రమేష్.

# 17

ఆరోజు సాయంత్రం రమేష్ ఆఫీసునుంచి చౌరంలోగి ట్రాముని ఎక్కుదామని వస్తున్నాడు. ఆఫీసుల నుంచి యిళ్ళకు పోతున్నవారితో రోడ్లన్నీ పూర్తిగా నిండి వున్నాయి. కొద్ది దూరంలో ఎదురుగా జగదీష్ బాబు నడుస్తూ వస్తున్నాడు. రమేష్ నవ్వుతూ పలకరించాడు.

'మీరు కలకత్తా నుంచి మాయమైనట్లున్నారు. అసలు కనిపించడం లేదు' నవ్వుతూ అన్నాడు జగదీష్.

'అవును మొదటి ఆరు నెల్లు ఆఫీసు పని మీద క్యాంపుకి వెళ్లాను. తిరిగి రాగానే మా నాన్న చనిపోయిన వార్త తెలిసింది. పది రోజులు యింటిదగ్గర వుండి వస్తున్నాను

'అలాగా! ఈ విషయం రేణుకి కూడా తెలియదనుకొంటాను.'

'అవును. తెలియదు. మూడు రోజులుగా రేణు దగ్గరికి వెళదామను కొంటుంటే వీలుపడలేదు.'

'మీరు తొందరలో లేనట్లయితే....టీ తీసుకొందాం' ఆహ్వానించాడు రమేష్.

రెస్టారెంటులో టీ త్రాగుతున్నారు.

'మీ కార్యక్రమాలు ఎలా వున్నాయి?' అని కుతూహలంగా అడిగాడు రమేష్.

జగదీష్ బాబు తగ్గు కంఠంలో అన్నీ వివరించాడు. ఆ ఆరునెల్లు వాళ్ళ పార్టీ లెక్కలేనన్ని కష్టాలు అనుభవించింది. వేలకొలది వర్కర్లను ప్రభుత్వం కస్టడీలోకి తీసుకొంది. వందల కొలది మెంబర్లు ఘర్షణలలో గాయపడ్డారు. కనీసం వందమంది మరణించారట. జైల్లోవున్న కొంత మంది ఖైదీలు, తప్పించుకోడానికి ప్రయత్నించి, జైలు అధికారుల చేతిలో చనిపోయారు.

'ఈ సంవత్సరం మా పార్టీకి ఎన్నో యిక్కట్లు తెచ్చి పెట్టింది. అయినా మేం ధైర్యంగా పోరాడుతున్నాం' జగదీష్ వివరించాడు.

రమేష్ తన సానుభూతిని తెలియ చేశాడు. పెదవులు తడుపు కొంటూ 'మీ శిష్యురాలు రేణు యెలా వుంది యిప్పుడు? ప్రదీప్ పోయాడని ఆరోజు చాలా బాధ పడింది' అన్నాడు.

'ఇప్పుడు పరవాలేదు. కాని ఆమె యిన్ని సంవత్సరాలుగా మా పార్టీలో మెంబరుగా వుండి కూడా, ఆ పరిస్థితులకు అనుగుణంగా మారలేక పోతోంది. ఆమె మనస్సు సగం పార్టీ వ్యవహారాలవైపు లాగితే, మరో సగం మానవత్వం, స్త్రీ సహజమైన కారుణ్యం వైపు లాగుతోంది. ఆమె అప్పుడే జరిగిన నష్టాన్ని బాధని చూడగలుగుతోంది కాని, ముందు రానున్న లాభాల్ని గుర్తించలేకపోతోంది.'

'అంటే ఆమెవల్ల మీ పార్టీకేమీ ప్రయోజనం లేదంటారా?'

'అలా అని కాదు. ఆమె మనస్సులో నిర్ణయించుకొని, పార్టీ వ్యవహారాలలో పూర్తిగా లీనమైతే నిజమైన సేవ చేయగలుగుతుంది. కాని ఆమె అలా నిర్ణయం చేసుకోవడం కష్టమని నాకు తెలుసు. అందుకొరకే ఆమెని, పెళ్ళి ఎందుకు చేసుకోకూడదు అని అడిగాను.'

'ఏమంది?' మెల్లగా అడిగాడు రమేష్.

'ఏమంటుంది? సమయం రావాలి అంటుంది. ఆ మంచి సమయం అంటే నీలాంటి మంచి కుర్రాడు దొరకడం అన్నమాట' అంటూ నవ్వుతూ లేచాడు జగదీష్‌బాబు.

రమేష్‌లో ఆలోచనలు చెలరేగాయి. తాను యింతవరకు రేణుని పెళ్ళి దృష్టితో చూడలేదు. అందంగా, చలాకీగా వుండే రేణుని పెళ్ళి చేసుకోవడం నిజంగా అదృష్టం. అన్న, వదిన పెళ్ళిని తన యిష్టానికే వదిలేశారు.

ఈ విషయమై రేణుతో మాట్లాడాలని రమేష్ నిర్ణయించుకొన్నాడు.

# 18

రమేష్, రేణు కలసి దక్షిణేశ్వర్ వచ్చారు. అది హుగ్లీ నది ప్రక్కన వున్న కాళీ మందిరం. రామకృష్ణ పరమహంస ఆ గుడిలో పూజారిగా వుండేవాడు.

గర్భగుడి మధ్యన వుంది. దాని చుట్టు యితర చిన్న మందిరాలు వున్నాయి. రమేష్ గర్భగుడివైపు దారి తీస్తుంటే 'మీరు వెళ్ళిరండి, నేను యిక్కడ కూచుంటాను' అని గచ్చుమీద రేణు కూచుంది.

'మీకు భగవంతుని మీద నమ్మకం లేదా?' రమేష్ అనుమానంగా అడిగాడు.

'చిన్నప్పుడు భగవంతుని మూర్తిని చూడగానే బోలెడు భక్తి పుట్టుకు వచ్చేది. ఎవ్వరి మూర్తిని చూచినా భక్తిగా, శ్రద్ధగా మనస్సులో మ్రొక్కుకునే దాన్ని. కాని నాకు తెలివి వచ్చినతర్వాత యీ లోకంలో అత్యంత కష్టనిష్ఠూరాలను భరిస్తున్న పేద జనాన్ని చూచిన తర్వాత ఆ భ్రమ తొలిగిపోయింది. భగవంతుడు అనేది శక్తి అనుకొంటే,యిక్కడ చలామణీ అవుతున్నది ధనశక్తి. నిజంగా డబ్బుని పూజించాలి ఎవ్వరైనా' అని హేళనగా నవ్వింది.

రమేష్ కనుబొమలు ముడిపడ్డాయి. రేణు వెంటనే మాటమార్చి 'సారీ. నా మాటలతో మీ ఏకాగ్రతను భంగం చేసినట్లున్నాను. మీరు వెళ్ళిరండి' అని కోరింది.

'దాని దేముంది ? ఎవ్వరి నమ్మకాలు వారివి' అంటూ రమేష్. గుడివైపు వెళ్లాడు.

అమ్మవారి విగ్రహం చూచి పులకించాడు రమేష్. క్షణం సేపు రెప్పవాల్చకుండా అలాగే నిలుచున్నాడు. చిత్ర విచిత్రమైన మనుష్యులు, భిన్న మనస్తత్వాలు, వారు ఎదుర్కొంటున్న పరిస్థితులు యివన్నీ ఆ దేవి కాకపోతే ఎవ్వరు సృష్టిస్తున్నారు ? తన జీవితాన్నిఏ అడ్డంకులులేని ఒకనీటిపాయలాగా సాగిపోయేలా దీవించమని మనస్సులో పదే పదే ప్రాధేయపడ్డాడు.

రమేష్, రేణు గుడి వెలుపలికి వచ్చారు.

'నాకు ప్రసాదం యివ్వరే?' అడిగింది రేణు.

'భగవంతుని మీదే నమ్మకం లేదన్నారుగా! ఈ ప్రసాదం తీసుకొంటారా అని........' అంటూనే ఆమెకి ప్రసాదాన్ని యిచ్చాడు.

రేణు ప్రసాదాన్ని నోట్లోవేసుకొంటూ, 'నేను నమ్మేది మనిషిని, మానవత్వాన్ని. వాళ్ళే నాకు దేవునితో సమానం. పెత్తందార్ల స్వప్రయోజనాల రథచక్రం క్రింద నలిగిపోతున్న ఆ పేద జనాన్ని కొందరినైనా తప్పించగలిగితే, వేయిపుణ్యాల ఫలితంతో సమానమని నా విశ్వాసం ?' అంది.

'ఆ నీతును కూడా మానవసేవ చేయవచ్చు. భక్తి అనేది మనస్సుకి సంబంధించినది. మనస్సు ప్రశాంతంగా వుండి, జ్ఞానంలో పరిపక్వం చెందిననాడే ఏ మనిషైనా మంచి పనులు చేయగలుగుతాడు.'

'కలుషితమైన మనపరిస్థితుల్లో మనస్సు ఎక్కడుంటుంది చెప్పండి? అది ఎప్పుడో రాయిగా మారిపోతుంది. మనం రెండు పూటలా భోంచేసి, యే యితర లోట్లు ఎదుర్కోం కాబట్టి సావకాశంగా మంచి, చెడు, భయం, భక్తి అని మాట్లాడగలుగుతాం. అదే కరకరలాడే ఆకలితో మాడుతున్న మనిషికి యివన్నీ ఎందుకు చెప్పండి? పిడికెడు అన్నం అతనికి యెవరైనా ప్రసాదిస్తే, అదే నిజంగా ప్రసాదమవుతూంది.'

'మళ్ళీ యీసారి మిమ్మల్ని నా వాదనతో ఒప్పించలేకపోయాను' అన్నాడు రమేష్.

'మీరు అన్నట్లు, ఎవరి నమ్మకాలు వారివి, రండి' అంటూ రేణు, నదివైపు దారితీసింది

నదిలోకి దిగటానికి గట్టుమీద మెట్లు వున్నాయి. నది విశాలంగా కనీసం ఒక మైలు వెడల్పు వుంటుంది. నీరు మందంగా ప్రవహిస్తోంది. అవతలి గట్టున బేలూరు మఠం వుంది. అక్కడ రామకృష్ణ మఠం వారు నిర్మించిన పూజా భవనాలు వరుసగా, నిండుగా వున్నాయి.

దక్షిణేశ్వర్ నుంచి, బేలూరు మఠం వరకు లాంచీలు, చిన్న పడవలు వెళ్తుంటాయి.

అంతలో రేణు వేరుశనగలు అమ్ముతున్న కుర్రవాణ్ణి పిలిచి ఒక పొట్లం తీసుకొంది. రమేష్‌కి అందించింది తినమని.

అతను నవ్వుతూ 'ఇవ్వాళ 'ముడి' తినరా' అన్నాడు.

ఆమె కూడా నవ్వుతూ, 'మన యిద్దరి ఆలోచనలు, అభిప్రాయాలు, నమ్మకాలు ఎలాగూ భిన్నంగా వున్నాయి. వాటిలో మన యిద్దరికి పొత్తు కుదరదనుకొంటాను కనీసం తినేవాటి దగ్గరైనా మీ మాట విందామని ....'' అంది

'థాంక్స్!'

మెట్లు దిగి పడవ దగ్గరికి వచ్చి 'మనం కూడా బేలూర్ మఠ్‌కి వెళ్దాం' అని రేణు గోముగా అంది.

ఆమెని వుడికించాలని 'ఎందుకు? మళ్ళీ పూజామందిరం వెలుపల కూచోడానికా? భగవంతుడు, మతం అంటే విశ్వాసం లేనప్పుడు ఎందుకు అక్కడికి వెళ్లడం? అన్నాడు.

'నిజమే, నాకు వాటిమీద విశ్వాసం లేదు. కాని బేలూరు ప్రార్థనా మందిరంలో ఒక విశిష్టత వుంది. ఎటుచూచినా నిశ్శబ్దతతో కూడిన ఒక పవిత్ర ముద్రవేసి నట్లనిపించింది.కల్మషమైన ఎడారిలాంటి యీ ప్రదేశంలో చల్లని ప్రశాంతత నిచ్చే ఒయాసిస్సులాంటిది ఆ పూజామందిరం.'

' సరే మీ యిష్టం పదండి' అనగానే యిద్దరూ పడవెక్కారు.

పడవవాడు గట్టుకి కట్టివున్న త్రాడుని విప్పి చేతిలోవున్న గడని గట్టిగా నీటిలోకి త్రోశాడు. పడవ ముందుకి ఉరికింది.

ఉదయం పదకొండు గంటలవుతోంది. సూర్యుడు మబ్బుల మాటున దోబూచులాడుతున్నాడు.

కదులుతున్న పడవలో కూచుంటే దక్షిణేశ్వరం మందిరం నదిని ఆనుకొని విశిష్టంగా కనిపిస్తోంది. దాన్ని చూస్తూ, ఏవో ఆలోచనల్లో రమేష్ మునిగిపోయాడు.

'ఏమిటి ఆలోచిస్తున్నారు?' నెమ్మదిగా అడిగింది రేణు.

'అదే, శారదాదేవి గురించి. ఆమె ఎంత ఉత్తమురాలు. రామకృష్ణ కాళీపూజలో నిమగ్నుడై అహర్నిశలు గడుపుతూంటే, ఆమె వ్యధ చెంద లేదు. శరీర వాంఛలకు లొంగిపోయి అతన్ని యిబ్బదులు పెట్టలేదు. రామకృష్ణ ఆమెని 'అమ్మా' అని సంబోధించి, తనలో వున్న జీవునికి ముక్తినిచ్చుకోవాలంటే భక్తి మార్గం అనుకరించమని ఆమెకి బోధించాడు. ఆమె ఆయన మాటను నిలబెట్టింది. తన తపస్సు, పూజలు కొనసాగిస్తూ, రామకృష్ణుని దగ్గరికి వచ్చిన శిష్యజనానికి అన్నివసతులు కల్పించి అందరిచేత 'అమ్మా' అనిపించుకొంది. ఆమె నిజంగా ఎంత ధన్యురాలు. ఒక్కోసారి ఆమె నాకు రామకృష్ణుని కంటే మిన్నగా అనిపిస్తుంది.'

రేణు యీసారి ఆలోచనలో మునిగిపోయింది. 'ఆనాడు భర్త మాట విని అడవులకు వెళ్ళిన సీత, అలనాడు యమధర్మరాజుతో పోట్లాడి పతి ప్రాణాలు తిరిగి తెచ్చుకొన్న సావిత్రి, సత్యాన్ని ప్రాణంగా ఎంచుకొన్న హరిశ్చంద్రుడు బజారులో నిలిపి అమ్మివేసినా నోరు తెరవని చంద్రమతి — అందరూ గొప్పవాళ్ళే. అలాగే శారదాదేవి, భర్త ఆదేశాలను పాటించి, ఆయన ముక్తిని పొందడానికి దోహదంచేస్తూ, ఆమె కూడా తరించింది. వీళ్ళందరూ పుణ్యమూర్తులే, నేను కాదనను. కాని అప్పటి పరిస్థితులువేరు, యిప్పటి పరిస్థితులువేరు. ఆడది కూడా మనిషేనని ఆమెకు కూడా మనస్సు, వ్యక్తిత్వం వుంటుందని చాలమంది గ్రహించరు. పెళ్ళికాగానే ఆమె మాటకు విలువలేదని, నోరు మూసుకోవాలని, పెత్తనం భర్తే చలాయిస్తాడని అనడం నిజంగా అన్యాయం.'

'భార్య ఎప్పుడూ భర్తకు బానిసకాదు. కాని ఆయన ఆలోచనలకు, చేస్తున్న పనులకు ఆమె సహకారం, ప్రోద్బలం ఎంతో అవసరం. అవి లేని నాడు అతను విజయాన్ని పొందలేడు' అన్నాడు రమేష్.

'అదే భార్య విషయంలో కూడా ఎందుకు కాకూడదు? భార్య చేస్తున్న పనులకు కూడా భర్త మెప్పుదల, అంగీకారం ఉండితీరాలి. మన దేశ జనాభాలో సగంమంది ఆడవారే. వారిని ఉత్త బుట్టబొమ్మల్లా వుంచక ముందుకి రానివ్వాలి— వారి ఆలోచనలకు విలువనివ్వాలి. ఇదంతా విద్య వల్ల వస్తుందనుకోండి. ఆధునిక వనితలు ఎంతో మారిపోయారు. ఇప్పుడు వారి ఆలోచనల్లో ఎంతో తేడా వచ్చింది. ఈనాటి సీత అయితే మీరు అడవికి వెళ్ళండి. నా పాతివ్రత్యాన్ని కాపాడుకొంటూ బీదజన సేవ చేస్తూ కాలం గడుపుతానంటుంది. ఈనాటి చంద్రమతి అయితే భర్త సత్యవ్రతానికి దోషం కలగకుండా, దుష్టులని కోర్టుకి లాగి ఓ ఆట ఆడిస్తుంది. ఈనాటి సావిత్రి అయితే మరణం ప్రకృతి సహజమని మనస్సుని ఊరడించు కొంటుంది. మనస్సు దాంపత్య సుఖాలకై యిష్టపడితే, మళ్లీ పెళ్ళిచేసు కొంటుంది. ఈ కాలంలో యివన్నీకూడా మంచి పనులే' అంటూ వాదించింది రేణు.

రమేష్ నిరుత్తరుడైనాడు. ఆమె చెప్పినదాంట్లో సత్యం లేకపోలేదు కాలం మారుతోంది. పరిస్థితులు మారుతున్నాయి. మనుష్యుల ఆలోచనా విధానంలో మార్పులు వస్తున్నాయి. అలాంటప్పుడు సీతా, సావిత్రి అంటూ నీతులు వల్లించడం భావ్యం కాదు. భార్యాభర్తలు ఒకరి ఆలోచనలకు ఇంకొకరు విలువ నిచ్చి, మిత్రులుగా మెలిగినప్పుడు ఆ దాంపత్యం పరిపక్వం చెందుతుంది.

ఆలోచనలనించి బయటపడగానే పడవ ఆగిపోయినట్లు గమనించాడు రమేష్. ఎందుకు ఆపావు అని అడుగుదామనుకునే లోపల ఎదురుగా ఉప్పెనలాగా నీరు పొంగుతూ ఉరికి వస్తోంది. మామూలు నీటి మట్టం కంటే ఆరు అడుగుల ఎత్తుతో ఉధృతంగా అలలు లేస్తూ ఉరికి వస్తు న్నాయి. చూస్తుండగానే అలలు వారి పడవ దగ్గరికి వచ్చాయి. క్షణంలో

అవి పడవని చుట్టు ముట్టాయి. రమేష్‌కి ఏమీ తోచలేదు. రేణు చేయిని గట్టిగా పట్టుకొన్నాడు.

బలంగా తన్నిన అలలకు పడవ పైకి ఎగిరి మళ్ళీ నీటి మీద పడి అటూ, యిటూ ఊగ సాగింది. ఎగిరి నప్పుడు ఎక్కడ పడిపోతామో అని యీ సారి రేణుని యింకా గట్టిగా పట్టుకొన్నాడు.

ఇంకో నిమిషం తర్వాత అలలు విరిగిపోయాయి. పడవ చుట్టూ మామూలు పరిస్థితి ఏర్పడింది. అనుకోని ఆ పరిస్థితికి వేగంగా కొట్టుకొన్న రమేష్ గుండెదడ కొంచెం కొంచెంగా తగ్గసాగింది.

'భయపడ్డారా? ఇప్పుడు వచ్చిన అలలని నీటి తెప్ప అంటారు. చంద్రమండలం ఆకర్షణతో సముద్రంలో నీరు ఉప్పొంగుతుంది. ఆ నీరు నదిలోకి ఉరికివస్తుంది. ఇలాగ ప్రతిరోజు పది, పదకొండు గంటల మధ్య చంద్రమండలం, భూమికి దగ్గరికి వచ్చినప్పుడు వస్తుంది. అమావాస్య, పౌర్ణమి రోజులలో యీ అలలు యింకా ఎక్కువగా విజృంభిస్తుంటాయి.'

రమేష్, యింకా రేణు చేయిని పట్టుకునే వున్నాడు.

"నాకు నిజంగా భయమేసింది. మీరు చెప్పిన విషయం చదివాను కాని, యిప్పుడే కళ్ళతో ప్రత్యక్షంగా చూశాను. ప్రకృతి విజృంభిస్తే మనిషి ఎంత నిస్సహాయుడో చూడండి."

'ఈ పడవ నడిపేవారికి, యే టైంలో అలలు వస్తాయో తెలుసు. అది వచ్చేముందు పడవను నిలిపివేస్తారు.'

పడవను గడతో ముందుకి త్రోశాడు నడిపేవాడు. నెమ్మది నెమ్మదిగా పడవ ముందుకు సాగుతోంది.

'రేణూ, మీతో ఒక విషయం చెప్పాలని ఎప్పటినుంచో అనుకొంటున్నాను' అన్నాడు రమేష్.

ఆమె చేయిని నెమ్మదిగా విడిపించుకొని, 'ఏమిటో చెప్పండి?' అని కుతూహలంగా అడిగింది.

"మన ఆలోచనలు వేరు కావచ్చు. మన సిద్ధాంతాలు కూడా వేరు కావచ్చు. కాని మీరంటే నాకు ఎంతో యిష్టం. మీరు కూడా యిష్టపడితే.... నేను పెళ్ళి చేసుకొంటాను."

ఒక్క-క్షణం పడవ ఆగిపోయి నట్లనిపించింది రేణుకి. ఈ మాటలకు ఆమె ఎదురు చూడలేదు. మనస్సులో, ఒక చేపపిల్ల గాలిలోకి ఎగిరి మళ్లీ నీళ్ళల్లోకి దుమికినట్లనిపించింది. నెమ్మదిగా ఆమె బుగ్గలు లేత ఎరుపు రంగును సంతరించు కొనసాగాయి.

'మాట్లాడరేం ? నేనేమైనా తప్పుగా మాట్లాడానా?' అని రమేష్ అనుమానంగా అడిగాడు.

రేణు కళ్లు పైకెత్తి మందహాసం చేసింది. ఆమె కళ్ళల్లో యేదో వింత వెలుగు మెరిసిపోతోంది.

'ఏం చెప్పమంటారు? పార్టీ వ్యవహారాలలో నేను ఎంతోమందిని కలిశాను. ఎంతోమందితో చనువుగా తిరిగాను. కాని మిమ్మల్ని కలిసిన మొదటి రోజునుంచి నా మనస్సులో మీకు ఒక విశిష్టస్థాన మేర్పడింది.'

'అది నా అదృష్టం. మీరు సరేనంటే, రేపే మీ నాన్నగారితో యీ విషయం మాట్లాడుతాను.'

'తొందరపడకండి. నా గురించి మీకు తెలుసు. నా మనస్సు ఎప్పుడు పార్టీ పనుల వైపు పరుగెత్తుతుంది. మీరు అనుకొన్న సీతా, సావిత్రిల్లా నేను ఉండలేనేమో' అనుమానంగా చెప్పింది రేణు.

'నేను అప్పుడు అన్నదాంట్లో నా ఉద్దేశ్యం మీ వ్యక్తిత్వాన్ని చంపుకొనమని కాదు రేణూ. మనం యిద్దరం ఒకరి ఆలోచనలకు, పనులకు మరొకరు తగిన విలువనిస్తే ఎటువంటి ఇబ్బందులు రావు. అవి మన దాంపత్య జీవితంలో ఎప్పటికీ అడ్డు గోడలు కావు' అని ఆమె సందేహాలకు జవాబుగా చెప్పాడు రమేష్.

'సరే, మా పార్టీ వారితో యీ విషయం సంప్రదించి, తర్వాత చెప్తాను' అంది రేణు.

రమేష్ యీసారిమళ్లీ రేణు చేయిని, తన చేతుల్లోకి తీసుకొన్నాడు.

'రేణు ! మొన్ననే జగదీష్ బాబు కలిశారు. మాటల్లో మీ విషయం కూడా వచ్చింది. మీరు పెళ్ళిచేసుకోవడం మంచిదని, మీతో ఆ విషయం చెప్పానని కూడా అన్నారు. మీ పార్టీ వారు అడ్డు చెప్పరు. ప్లీజ్, ఒప్పు కొన్నానంటే, నా మనస్సు కుదుటపడుతుంది.'

రేణు గల గల నవ్వింది. 'రేపు సాయంత్రం యింటికి రండి. అన్ని వివరాలు బాబాతో మాట్లాడవచ్చు.'

రమేష్ ఆమె చేయిని మెత్తగా ఒత్తుతూ అంగీకారం తెలియచేశాడు.

పడవ వేగంగా పరుగెడుతున్నట్లనిపించింది రేణుకి. సన్నని అలలు, పడవకి తగిలి చేసే గలగల చప్పుడు రేణు నవ్వుని అనుకరిస్తున్నా యనుకొన్నాడు రమేష్.

# 19

కాల ప్రవాహంలో, రోజులు ఎంత వేగంగా కొట్టుకుపోతాయో ఆశ్చర్యపోయాడు రమేష్. ఆ రోజుకి వాళ్ళ పెళ్లి జరిగి సంవత్సర మవుతోంది.

రేణు యింకా నిద్రపోతోంది. ఆమె కలలు కంటోంది కాబోలు, నిద్రలోనే మందహాసం చేస్తోంది. ఆ ప్రక్కనే వున్న తొట్టిలలో రెండు నెలలు నిండిన బాబు నిరంజన్ హాయిగా నిద్దురపోతున్నాడు.

రేణులో యీ సంవత్సర కాలంలో ఎంతో మార్పు వచ్చింది. ఇంటి పనులు పూర్తిచేసి భర్తతోపాటు ఆఫీసుకి వెళ్తుంది. సాయంత్రం రాగానే వంట పూర్తిచేసి వీలయితే పార్టీ ఆఫీసుకి వెళ్తుంది. భర్తతో యే ఒక్కరోజూ కూడా ఏ విషయంలోను వాదనకి దిగలేదు.

రమేష్ ఆశ్చర్యపోయాడు. తనని చూచి భయపడుతుందేమోనని, ఆమె మనస్సులోని మాటలను బైటికి అనాలని ఎంతో ఉత్సాహపరిచేవాడు. ఆమెకు నచ్చని విషయమైనా, ఆమె ఏకీభవించలేని ఆలోచనైనా ఆమె ఎదురు చెప్పడం లేదు. కేవలం నవ్వి ఊరుకొంటుంది.

ఆడవారు స్త్రీ సహజమైన మనస్తత్వంతో పెళ్లికాగానే చాలమంది తమకు తెలియకుండానే భర్త యిష్టానుగుణంగా ప్రవర్తిస్తారు. అందులో భర్త ప్రోద్భలం వుండకపోవచ్చు. తమ మనస్సులో భర్తకై ఏర్పడిన ఉన్నత రూపమే దీనికి కారణమై వుండవచ్చు.

రమేష్ నెమ్మదిగా ముంగురులను తాకాడు. ఆమె మత్తుగా అటూ యిటూ కదిలి కళ్లు తెరిచింది. తననే చూస్తున్న భర్తముఖంలోకి ఒక చిరునవ్వు పెసిరింది.

'మెనీ హాపి రిటర్న్స్ ఆఫ్ ది డే! మన పెళ్లి జరిగి సంవత్సర మయిందంటే నమ్మలేకుండా వున్నాను' అన్నాడు రమేష్.

రేణు మెల్లిగా ముందుకు జరిగి రమేష్ తొడమీద తలను వాల్చింది.

'నాకైతే ఒక కలలా వుంది' అంది రేణు.

ఆరోజు యిద్దరూ సెలవుపెట్టారు. రేణు రకరకాల వంటలు చేసింది. సాయంత్రం షికారుకి వెళ్ళారు.

* * *

ఉద్యోగానికి రాజీనామా చేయవలసిందని రమేష్ ఎంతగా చెప్పినా, రేణు వినిపించుకోలేదు. ధరలు మండిపోతున్నాయి యీ రోజుల్లో, ఎంత సంపాదించినా సరిపోదని ఆమె వాదన.

అప్పలస్వామి అప్పుడప్పుడు వచ్చి చూచిపోతుంటాడు. పెద్ద వారైనారు, ఒంటరిగా ఎందుకు తమతో వుండిపొమ్మని ఎన్నోసార్లు చెప్పాడు రమేష్. అతను నవ్వుతూ, నమ్రతగా, తాను అటూయిటూ కదలగలిగినన్ని రోజులు వేరుగా వుండటమే పరువుగా వుంటుందన్నాడు.

ఆరోజు ఆఫీసులో పని వుండటంచేత రమేష్‌కి కొంచెం సేపు ఎక్కువగా వుండవలసి వచ్చింది. ఆ తర్వాత ట్రాములు అందక పోవడంతో, బాగా ఆలస్యంగా యింటికి వచ్చాడు.

ఇంటికి తాళంవేసి వుంది రేణు బయటికి వెళ్లినప్పుడు, పార్టీ పనుల మీద వెళ్లినప్పుడు తాళంచెవిని ప్రక్కింటి వారికి యిచ్చి వెళ్తుంది. మామూలు అలవాటు ప్రకారం తాళంచెవి అడిగి తీసుకుందామని ప్రక్కింట్లోకి వచ్చాడు. తలుపుతీసి వుంది.

ఎదురుగా చిన్న దుప్పటి మీద ఆరు నెలల నిరంజన్ గుక్క పెట్టి ఏడుస్తున్నాడు. వాడిదగ్గర ఎవ్వరూలేరు. రమేష్ గుండెను ఎవ్వరో పిండి నట్లు బాధపడ్డాడు. కన్నవారే పిల్లల్ని చూస్తూండమని ప్రక్కవారికి అప్ప గిస్తే. వాళ్లకు మట్టుకు ఆదరాభిమానాలు ఎందుకు వుంటాయి ?

రేణు యీ రోజు మొదటిసారిగా నిరంజన్‌ని యిక్కడ వదిలి వెళ్ళింది. సామాన్యంగా రమేష్ వచ్చేవరకు వుంటుంది. అవసరమని పిస్తే బాబుని అప్పలస్వామి దగ్గర వదిలి వెళుతుంది. ఏ రాచకార్యానికి వెళ్ళిందని యిక్కడ వదిలింది అని కోపగించు కొన్నాడు రమేష్.

రమేష్ వచ్చి నిరంజన్‌ని ఎత్తుకోగానే, వాడు ఏడుపు మానేశాడు. ఏడుపు ఆగిపోగానే లోపలనుంచి మాధవి బయటికి వచ్చింది

రమేష్‌ని చూడగానే సంజాయిషీగా అంది "ఇప్పుడే లోపలికి వెళ్ళాను— కాఫీ దించుదామని...."

'ఫరవాలేదు' అని ఆమె అందించిన తాళంచెవి తీసుకొని నడిచాడు రమేష్.

బాబుకి పాలు పట్టి పడుకోబెట్టాడు. రేణు వచ్చి తలుపు తట్టేసరికి రాత్రి తొమ్మిదవుతోంది. తలుపు తీసి మారు మాట్లాడకుండా పడక గదిలోకి వెళ్ళిపోయాడు రమేష్.

కోపం వచ్చినప్పుడు మాటలు మానేస్తాడని రేణుకి బాగా తెలుసు. వంట గదిలోకి వెళ్ళి భోజనానికి అన్నీ సిద్ధంచేసి భర్త దగ్గరికి వచ్చింది.

'రండి, భోంచేద్దాం' ఆప్యాయంగా అంది రేణు.

'నాకు ఆకలిగా లేదు' అని పొడిగా అన్నాడు రమేష్.

'కోపంగా వుంటే ఆకలి కాదా? ఎందుకంత కోపం?' నెమ్మదిగా అడిగింది రేణు.

'అవున్లే, నీకు ఎలా తెలుస్తుంది? మన బాబుని నీవు చూడమని ప్రక్కింటివారికి యిస్తే, వాళ్ళు కుక్కపిల్లని పడేసినట్లు ఒక మూలన వేశారు. వాన్ని ఆ స్థితిలో చూచి నా గుండె ద్రవించిపోయింది.'

రేణు క్షణంసేపు నిర్ఘాంతపోయింది. 'నన్ను క్షమించండి. నాన్న దగ్గరికి తీసుకవెళ్ళే టైము లేక....' ఏదో చెప్పబోయింది.

'అందుకని, యిక్కడే వదిలేశానంటావ్? ఏమంత అర్జెంటుపని? నీ పార్టీ పనులు నేను వచ్చేదాకా ఆగలేవా?' కోపంగా అన్నాడు రమేష్.

రేణుకి ఏడుపు ముంచుకొచ్చింది. ఆమె కళ్ళనుండి నీరు టపటప మని రాలసాగింది.

'పార్టీపనులు కాదండి. ఈరోజు జరిగిన పోలీసు ఘర్షణలో జగదీష్‌బాబుగారి చేతికి తీవ్రమైన గాయం తగిలింది. ఎడమచేయి మూడు వేళ్ళను తీసివేయవలసి వచ్చింది.'

రమేష్ కోపం వెంటనే ఎగిరి పోయింది. అతను ఎంతో పశ్చాత్తాప పడ్డాడు. రేణు దగ్గరికి వచ్చి కళ్లను ఒత్తుతూ 'ముందే ఎందుకు చెప్పలేదు? కనీసం ఒక కాగితం ముక్కైనా వ్రాసిపెట్టలేదు.' అన్నాడు.

రేణు ఏడుపు మాని, మామూలు మనిషి కావడానికి ఒక నిముషం పట్టింది.

'ఇప్పుడెలా వుంది జగదీష్‌బాబుకి?' అడిగాడు రమేష్.

'అరెస్టు చేస్తారేమోనని ఆయన హాస్పిటల్‌కు కూడా వెళ్ళలేదు. తెలిసిన ఒక డాక్టరుని పిలిపిస్తే, అతను వేళ్లను తీసేసి కట్టుకట్టాడు. ఆ నొప్పితో అతనికి జ్వరం కూడా వచ్చింది.'

'అలాగా, రేపు వెళ్ళి నేను కూడా చూచివస్తాను. పద, భోంచేద్దాం' అనగానే, రేణు వంటగదివైపు దారితీసింది.

# 20

రమేష్‌కి హైదరాబాదు ట్రాన్స్‌ఫర్ అయ్యింది. ప్రతి సంవత్సరం ఆఫీసులో కొన్ని ట్రాన్స్‌ఫర్లు అవుతుంటాయి. ఈసారి రమేష్ పేరుని కూడా ఆ జాబితాలో తగిలించారు.

అతనికి ఆనందం. అనుమానం రెండూ కలిగాయి. తన స్వంత ప్రదేశానికి వెళ్లుతున్నాననే ఆనందం, రేణు కలకత్తా వదిలి రావడానికి ఎంత బాధ పడుతుందోననే అనుమానం అతని మనస్సులో మెదిలాయి.

ఆమె అందించిన టీని తీసుకొని చప్పరిస్తూ, 'రేణూ, నాకు హైదరాబాదుకి ట్రాన్స్‌ఫర్ అయింది' అన్నాడు రమేష్.

ఆమె క్షణంసేపు నమ్మలేకపోయింది. కొత్తప్రదేశాలను చూడాలని, క్రొత్తమనుష్యులని కలవాలని ఆమె మనస్సు ఎప్పటినుంచో ఉబలాట

పడుతోంది. ఈ సారి ఆ అవకాశం కలిగినందుకు ఆమె ఎంతో సంతో షించింది.

'అలాగా! నాకు ఆనందంగా వుంది. ఎప్పుడు వెళ్ళాలి మనం?' అడిగింది రేణు.

రమేష్ యీసారి చిత్తైపోయాడు. రేణు నుంచి ఎలాంటి సమాధానం వస్తుందోనని ఉక్కిరిబిక్కిరి అవుతున్న రమేష్‌కి యిది ఆశ్చర్యాన్ని కలిగించింది.

'ఒక్క నెల రోజుల్లో వెళ్ళిపోవాలి. అవసరమనుకుంటే యింకో నెల పొడిగించవచ్చు. కాని... పార్టీ, పనులని....నాన్నగారని....నీవు అభ్యంతరం చెప్పుతావనుకొన్నాను' అనాడు రమేష్.

'భవేవారు....మా బాబా యిక్కడ హాయిగా వుంటారు. నాకు క్రొత్త ప్రదేశాలను చూడాలని ఎంతో ఉబలాటంగా వుంది. మీ ట్రాన్స్ ఫర్ నాకు వరప్రసాదంలా వుంది.'

నెలరోజుల్లో రేణు ఉద్యోగానికి రాజీనామా చేయడం, యితర విషయాలు సరిచూచుకోవడం చేసింది.

ఆ తర్వాత వారు హైదరాబాదుకి బయలుదేరారు.

* * *

రేణుకి హైదరాబాదు జీవితం ఎంతగానో నచ్చింది. మంచి బియ్యం, చేపలు ఎంతో చౌకగా లభించేసరికి ఆమె ఆశ్చర్యపోయింది. ప్రజలు కూడా ఎంతో నెమ్మదిగా కనిపించారు.

ఇరుకుగా వున్న రెండు గదుల్లో సంసారం చేసిన రేణుకి, యిప్పుడు కాంపౌండుతో వున్న యిల్లు అద్దెకు లభించేసరికి ఎంతో మురిసిపోయింది. ప్రొద్దున, సాయంత్రం రేణు పూలమొక్కలతో కాలక్షేపం చేస్తోంది.

రమేష్ వాళ్ళు వచ్చారని తెలియగానే నారాయణ, నిర్మల పిల్లలతో వచ్చారు. వారు తెచ్చిన బియ్యం, పప్పు దినుసులు, నేయి అన్నీ చూచి రేణు ఎంతో ఆశ్చర్యపోయింది. నెలనెలా అన్ని వస్తువులు పంపిస్తా మన్నారు వారు. ఉప్పు మాత్రం యిక్కడ కొనుక్కొంటే చాలనుకొంది రేణు.

నవ్వుతూ మాట్లాడుతున్న రేణు నిర్మలకి ఎంతో నచ్చింది.

'పిల్లల్ని యిక్కడే వుంచితే, మంచి స్కూల్లో వేద్దాం' అన్నది రేణు.

ఆమె ప్రేమకు అబ్బురపోయింది నిర్మల. 'వచ్చే సంవత్సరం చూద్దాం లేమ్మా! వాళ్ళని వదిలి నా మనస్సు నిలవదు' అంది.

నాలుగు రోజుల తర్వాత వెళ్ళొస్తామంటే, రమేష్ బస్సు డిపో వరకు వెళ్ళాడు వారితో.

# 21

రమేష్, రేణు, బాబు నిరంజన్‌తో కలసి టాంక్‌బండ్ దగ్గరికి వచ్చాడు. సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది. సూర్యుడు మబ్బుల చాటున దాగి నలుదిక్కుల బంగారు కిరణాలను ప్రసరింపచేస్తున్నాడు. హుసేన్సాగర్ వెనకాల మింటు భవనాలు, పొగను వదులుతున్న ఎత్తైన చిమ్నీ ఎర్రని కిరణాలకు ఎదురుగా నల్లగా కనిపిస్తున్నాయి. మెల్లగా కదులుతున్న నీటి అలలు కొంచెం ఎరుపు, మరికొంచెం నలుపు రంగులను సంతరించు కొంటున్నాయి. ఆ వాతావరణం రేణుని ఎంతో ఆనందపరిచింది.

సిమెంటు బెంచీమీద కూచున్నారు. రమేష్ వేరుశనగలు కొన్నాడు. ఇద్దరూ నెమ్మదిగా తినసాగారు. నిరంజన్, రమేష్ ఒళ్ళో కూచుని వచ్చి పోయే కార్లను చూచి ఎగురుతూ చప్పట్లు కొడుతున్నాడు.

'కలకత్తా నుంచి వచ్చిన నాకు హైదరాబాదు నిర్జీవంగా తోస్తోంది. ఇటువంటి పిక్నిక్‌స్పాట్‌లో కూడా జనం పలుచగా వుంటారు. ఆటస్థలాలు చాల తక్కువగా వున్నాయనుకొంటాను. అస్సలు నాకు ఆటలు ఆడేవారే కనిపించలేదు' అంది రేణు.

రమేష్ ఒప్పుకొన్నాడు. రేణు మళ్ళీ మాట్లాడసాగింది. 'ఇక్కడ యింకో లోపం వుంది. సాంస్కృతిక కార్యక్రమాలు చాలా తక్కువగా

జరుగుతుంటాయి. కలకత్తాలో చూశారు కదా, పది పన్నెండు డ్రామా థియేటర్లు వున్నాయి. నాటకాలు, నాట్యాలు, సంగీత కచేరీలు ఎప్పుడూ జరుగుతుంటాయి. అదిగాక 'జాతర' అనే క్రొత్త రకం డ్రామాలు వుంటాయి.'

'జాతర' పద్ధతిలో ఒక నాటకం రమేష్ కలకత్తాలో చూశాడు. ఎంతో ముగ్ధుడైనాడు. సర్కస్ డేరాలాగా ఒక పెద్ద డేరాను వేశారు. మధ్యలో స్టేజీని నిర్మించారు. దానిచుట్టూ ప్రేక్షకులకు సీట్లు వేశారు. నటులు ప్రేక్షకుల మధ్యనుంచే స్టేజిమీదికి వస్తారు. ఒకసీను అయిపోగానే, మరో సీను కొరకు ఎంతో తెలివిగా లైట్లను మారుస్తూ సంగీతం వినిపిస్తారు. వారు ఎన్నుకునే నాటికలు కూడా ఎంతో రసవత్తరంగా వుంటాయి.

'జాతరకు సరితూగేలా మన ఆంధ్రలో యక్షగానం అనే సంగీత నాటకాలున్నాయి అవి ముఖ్యంగా పౌరాణికాలు. సినిమాల మోజుతో వాటి మీద ఆదరణ తగ్గింది. యక్షగానాల పద్ధతిని పునరుద్ధరించి, సాంఘికాలను కథగా ఎన్నుకుంటే ఎంతో రసవత్తరంగా వుంటుంది.'

బాగా చీకటి పడిపోయింది. టాంక్‌బండ్ చుట్టూ వెలుగుతున్న దీపాలు వింతగా శోభిస్తున్నాయి.

'అన్నట్లు, మనం యింకో మూడు రోజుల్లో క్యాంపుకి వెళ్ళాలి. అన్నీ సర్దివుంచుకో' అన్నాడు రమేష్.

'అన్నీ సర్దేశాను. బాబు కొరకు కొన్ని మందులు, అవి కొనాలి. అంతే.'

'అవును. క్యాంపు అడవి ప్రాంతంలో వుంటుంది. దగ్గర్లో వైద్య సదుపాయాలు వుండవు.'

'మీ ఆఫీసులో చాలమంది కుటుంబ సమేతంగా క్యాంపుకి వెళ్తారా?' అనుమానంగా అడిగింది రేణు.

'పెళ్ళయిన కొత్తలో అందరూ తీసుకెళ్తారు. పిల్లలు స్కూలు వయస్సు వచ్చేదాకా కొంతమంది తీసుకెళ్తారు. ఒకసారి పిల్లల స్కూలు మొదలయ్యిందంటే భార్యని వదిలి ఒంటరిగా వెళ్ళక తప్పదు.'

ఇంకో రెండు సంవత్సరాలదాకా భర్తతోపాటు క్యాంపులకి వెళ్ళ వచ్చని తృప్తి చెందింది, రేణు. ఆ తర్వాత భర్త ఆరు నెలలు క్యాంపులో వుంటే ఒంటరిగా ఎలా వుండాలో ఆమెకు అంతుపట్టలేదు.

# 22

సామాను జీపులో పెడదామని వచ్చాడు రమేష్. రేణు క్యాంపుకని తీసిన సామానుని చూచి అవిరిపోయాడు. దాదాపు యిల్లుని పూర్తిగా ఖాళీ చేసింది.

'రేణూ, నీవు తీసిన సామాను ఒక వాగెన్లో కూడా రాదు. మనం వెళ్తున్నది జీపులో' అని సగానికి పైగా వస్తువులని తగ్గించాడు.

రెండు రోజుల ప్రయాణం తర్వాత తను చేరవలసిన చోటుకి వచ్చారు. ఈసారి రమేష్ పరిశోధనలు జరుపవలసిన చోటు అరకులోయకు దగ్గర్లో వుంది.

కొండాపురం గ్రామానికి దగ్గర్లో నీటి వసతిని గమనించి క్యాంపుని వేశాడు రమేష్. కొంచెం దూరంలో డ్రైవరు తన డేరాలు వేయించు కొన్నాడు.

సాయంత్రం ఆరవుతోంది. నీరెండలు పారాడుతున్నాయి. మేతకు పోయిన గోవులు గుంపులు గుంపులుగా తిరిగి వస్తున్నాయి. వాటి నడకకు లేచిన దుమ్ము ఊరుని కనపడనీయకుండా చేస్తోంది.

ఇంకా కొంచెం దూరంలో ఓ పది మంది స్త్రీలు తలమీద కుండ లను పెట్టుకొని వస్తున్నారు.

'వాళ్లు నీళ్లు మోసుకొస్తున్నారా?' కాఫీ అందిస్తూ అడిగింది రేణు.

'అలాగే వుంది, దగ్గర్లో బావులు లేవను కొంటాను.'

'మనకి స్వాతంత్ర్యం వచ్చి ముప్ఫయి సంవత్సరాలు దాటాయి. కదా, త్రాగడానికి మంచినీళ్లు కూడా ప్రభుత్వంవారు ఏర్పాటు చేయలేక పోతున్నారంటే ఎంతటి దౌర్భాగ్యమో చెప్పండి.'

'నిజమే ! ప్రభుత్వం వారు ఎన్నో పథకాలను చేపట్టారు. ప్రతి గ్రామానికి వారు సాయం చేయాలంటే డబ్బు సరిపోదు. సమయం కూడా కలసిరాదు. గ్రామస్తులే ఒక్కుమ్మడిగా చేరి శ్రమదానం చేసి, వీలైతే డబ్బుని కూడా ప్రోగుచేసి బావులను త్రవ్వకలిగితే బావుంటుంది.'

రేణు నిట్టూర్చింది. 'ఈ గ్రామస్థులలో అటువంటి మేలుకొలుపు ఎప్పటికి వస్తుందో?'

* * *

రేణు ఏడింటికల్లా టిఫిను రెడీ చేసింది. అన్నీ ముగించుకొని అర గంటలో తయారై సర్వేకు బయలుదేరాడు రమేష్.

ఆ ప్రదేశానికి దక్షిణాన కొండ శ్రేణులలో అల్యూమినియం ఖనిజాన్ని కనుగొన్నారు. అది కొండ శిఖరాలలో నలభై, యాభై అడుగుల మందంతో లభిస్తోంది. అక్కడ సర్వే జరిగిన తర్వాత త్రవ్వకాలు కూడా పూర్తయినాయి. కొండాపురం ప్రాంతంలో కూడా ఆ ఖనిజం విస్తరించి వున్నదీ లేనిదీ కనుక్కోడానికి రమేష్ వచ్చాడు.

ఎత్తైన కొండ శిఖరాలను చూడగానే అతని మనస్సు ఉత్తేజపడింది. హిమాలయ శిఖరాలలో విచిత్రానుభూతిని పొందిన రమేష్ మనస్సుకి మళ్లీ అటువంటి కొండలను చూడగానే ఉల్లాసమనిపించింది.

ఒక్కొక్క కొండను ఎక్కుతూ, రాళ్లను పరీక్ష చేయసాగాడు. కంపాస్‌తో కొలతలు తీసుకొని మ్యాపుమీద వేయసాగాడు. పని ముగించు కొని క్యాంపుకు వచ్చేసరికి మధ్యాహ్నం రెండు దాటింది.

డేరా ముందు చెట్టుక్రింద రేణు కుర్చీలో కూచుంది. ఆమె చుట్టూ గ్రామీణ స్త్రీలు ఓ పదిమంది వున్నారు. ఆమె వారికి యేదో బోధిస్తుంది.

రమేష్‌ని చూడగానే ఆమె లేచి 'ఇక మీరు వెళ్లిరండి' అని డేరా వైపు వచ్చింది రేణు.

'ఏమిటో కబుర్లు చెప్పుతున్నావు వారితో?' నవ్వుతూ అన్నాడు రమేష్.

'నీళ్ళు తీసుకరావడానికి వెళుతున్న యిద్దరు స్త్రీలతో యింతకుముందు కుతూహలంగా మాట్లాడాను. వాళ్లకి ఏదో అనారోగ్యంగా వుందంటే మన

దగ్గర వున్న హోమియో మాత్రలను యిచ్చాను. అంతే. యిప్పుడు వచ్చిన వారు తయారయ్యారు - నేను డాక్టరుని అయినట్లు....' వివరంగా చెప్పింది రేణు.

'నీవు డాక్టరు కంటే తక్కువా? కలకత్తా నుంచి బోలెడు పుస్తకాలు, హోమియో మందులు తెచ్చావు. నీకు తెలిసినంతమట్టుకు వారికి మందులు యివ్వు.'

ఆ విధంగా ఆమెకి కాలక్షేపం అవుతుందని ఊహించాడు రమేష్. కలకత్తాలో నూటికి తొంభై శాతం హోమియో మందులే వాడతారు. చాలమంది యిళ్ళల్లో స్వయంగా వైద్యం చేసుకొంటుంటారు. ఆ అలవాటు తోనే రేణు అన్ని మందులు తెచ్చుకొంది.

'త్వరగా స్నానం చేసి రండి, నాకు ఆకలేస్తోంది' అని రేణు తొందర చేసింది.

* * *

పదిహేను రోజులలో రేణు ఆ చుట్టూవున్న నాలుగు గ్రామాల ప్రజలతో కలసిపోయింది. ఆరోగ్యం గురించి, పిల్లల విషయంలో తీసుకో వలసిన జాగ్రత్తల గురించి, ముఖ్యంగా కుటుంబ నియంత్రణ గురించి బోధించసాగింది. తనతోపాటు మందులపెట్టెని తీసుకొనివెళ్లి అవసరమైన వారికి మాత్రలు యివ్వసాగింది.

ఆమె వెళ్లలేని రోజు, గుంపులుగా జనం ఆమె దగ్గరికి రావడం మొదలు పెట్టారు.

ఈ కొద్ది రోజుల్లోనే, ప్రతి గ్రామంలో ఒకరిద్దరు భూకామందులు మిగతావారిని అదుపులో వుంచుకొన్నట్లు గ్రహించింది. రేణు రాకపోకలను చూచి వాళ్లు మరీ ఎక్కువగా ఆందోళన పడసాగారు.

ఇన్ని రోజులుగా, బయటి ప్రపంచాన్ని తెలియనీయకుండా, వారి హక్కులేమిటో గుర్తించనీయకుండా, ఆ గ్రామస్తులను జాగ్రత్తగా కాపాడు కొంటున్నారు ఆ భూకామందులు. ఆమె అన్ని విషయాలూ బోధిస్తూ వారిని రెచ్చగొడుతుందేమోనన్న భయం కూడా వారికి కలిగింది.

ఆ రోజు హరిజనవాడలోకి వచ్చింది రేణు. జ్వరంతో వున్న ఒక కుర్రవాని రోగ లక్షణాలు తెలుసుకొని ఏవో మాత్రలు తీసి యిచ్చింది.

ఇంతలో ఆ యింటి ప్రక్కన ఒక ముసలతను బిగ్గరగా కేకలు వేస్తున్నాడు. బాధతో ఎవ్వరినో తిడుతున్నాడు.

'ఏమయ్యింది?' అని అక్కడ వున్న స్త్రీని అడిగింది రేణు.

క్రిందటి సంవత్సరం ఆ ముసలతను తిండికిలేక ఆ గ్రామ పెద్ద దగ్గర ఒక బస్తా జొన్నలు అప్పుగా తెచ్చుకున్నాడట. ఒక బస్తా జొన్నలకు అప్పు తీర్చడానికి ఒక బస్తా నువ్వులను ముట్టజెప్పాలి. ఆరోజు బస్తా నువ్వులను యివ్వడానికి వెళ్లితే, రెండు బస్తాలు అప్పుగా తీసుకొన్నావని గదమాయించాడు' అని వివరించింది ఆ స్త్రీ

రేణు ఆశ్చర్యంలో మునిగిపోయింది. జొన్నల ధర బస్తాకి నూరు రూపాయలు వుంటుంది. అదే నువ్వుల ధర నాలుగు వందల రూపాయలకు తక్కువ వుండదు. సంవత్సరానికి నూరు రూపాయలకు, మూడు వందలు వడ్డీగా తీసుకోవడం చక్రవడ్డీలను కూడా మించిపోతుంది. అందులో ఒక బస్తాకి రెండు అని మారుస్తే ఆ పేద ప్రజలు ఏం కావాలి అని కోపంతో ఆమె ఊగిపోయింది.

రేణు ఆ ముసలతని దగ్గరికి వచ్చింది.

'ఏం తాతా! నీవు ఒక్క బస్తానే తీసుకొన్నట్లు యీ గూడెం ప్రజలందరు సాక్ష్యం వున్నారు కదా! ఆ మాట నీవు గట్టిగా చెప్పలేక పోయావా?' అని అడిగింది.

ఎముకల గూడులా వున్న ఆ ముసలతను, వీపుమీద వున్న దెబ్బల గుర్తులు చూపుతూ 'దొరా! నేను ఒక్క బస్తానే పట్టుకెళ్లాను. మీరు మళ్లా లెక్కసూడండి అన్నాను. అంతే! 'మేము దొంగ లెక్కలు వ్రాస్తామా? దొంగ వెధవా?' అని చెప్పుని తీసుకొని బాదాడు. నా కొడుకు మల్లడు వారి దగ్గరే జీతము. అడ్డుపడితే, వాడ్ని కూడా చితకబాదారు' కళ్ళల్లో నీరు గ్రుక్కుకున్నాడు.

'మీరు పోలీసు రిపోర్టు యిస్తే....'

ముసలతను భయంతో వణికిపోయాడు. 'పోలీసా? ఆ పోలీసోళ్లు కూడా భూకామందులు చెప్పినట్లే వింటారు. పోలీసు కాడికి పోయామని తెలిస్తే, మమ్మల్ని ఉప్పుపాతర వేస్తారు.'

మారు మాట్లాడకుండా బయలుదేరింది రేణు. ఇన్ని అత్యాచారాలు జరుగుతున్నా కిక్కురుమనకుండా వున్నవారిని చూస్తే బాధ కలిగింది. వీరి బలహీనతను చూచి భూకామందులు యింకా రెచ్చిపోతున్నారు. వారికి యిప్పట్లో విముక్తి కలుగుతుందని ఆమెకు నమ్మకం కుదరలేదు.

పార్వతీపురం పొలిమేర దాటి వస్తుంటే, రేణుకి లక్ష్మమ్మ, ఆమె భర్త ఒక చెట్టు క్రింద కనిపించారు. వాళ్లు కట్టుకొన్న కొత్త బట్టలు మార్చి పాతవి చిరిగిన గుడ్డలను వేసుకొంటున్నారు.

'ఏం లక్ష్మమ్మా! ఊరు దగ్గరికి వచ్చి పాత బట్టలు వేసుకొంటున్నారు?' రేణు ప్రశ్నించింది.

'ఊరుకి దూరంగా వున్నప్పుడు మేము ఎలాగైనా వుండొచ్చు. కాని యీ కొత్త బట్టలతో ఊరిలోకి వెళ్తే మునసబు కళ్లల్లో నిప్పులు పోసుకొంటాడు. తెల్లగా బట్టలు వేసుకొంటే వాన్ని నాశనం చేయాలని చూస్తాడు. మా బ్రతుకులన్నీ వాళ్ళ చేతుల్లో వున్నాయి' అన్నాడు లక్ష్మమ్మ భర్త.

రేణు రక్తం ఉడికిపోయింది. మనిషికి ఉన్నదాంట్లో మంచిగా బ్రతుకుదామనుకుంటే ఓర్వనివాళ్లు వున్నారంటే ఎంత అమానుషం?

'మీరంతా కలసి మునసబుని ఎందుకు ఎదిరించరు? అతను ఒక్కడూ తను వందలకొద్దీ వున్న ప్రాణాలతో ఆడుకొంటూంటే ఎలా ఓర్చుకొంటున్నారు?'

'ఏం చేయం తల్లీ! మాలో కొంతమంది ఆయన చుట్టూ తోకని వూపుతూ తిరుగుతారు. మిగతా వారిలో చాలమందికి త్రాగుడుతోనే బ్రతుకు తెల్లవారుతోంది. మాలాంటి కొంతమంది ఏదైనా అన్నామంటే పెదవికి చేటవుతుంది.'

ఇంకా అక్కడ నిలువలేకపోయింది రేణు. ఇంకా కొన్ని తరాలు మారినా, వారి పరిస్థితి అలాగే వుండటం తథ్యం అనుకొంది.

# 23

రమేష్ అప్పుడే ఫీల్డునుంచి తిరిగి వచ్చాడు. పనివాడు ఆడిస్తూంటే, నిరంజన్ మట్టిలో కూచుని ఆడుకొంటున్నాడు.

స్నానానికి వెళ్ళబోతూ రమేష్ దృష్టి వంటచేసే డేరావైపు పడింది. ముందు భాగాన్ని బిగించిన త్రాళ్లు వదులై ప్రక్కకు తప్పుకొంది. అనుమానంగా గుడ్డను ప్రక్కకు జరిపి చూశాడు. వంటలనన్నింటిని రుచి చూచి, పడుకొని వున్న ఊరకుక్క బయటపడింది. వంట గిన్నెలన్ని చిందర వందరగా పడివున్నాయి. సగం చారు భూమిమీద ఒలికింది. ఒకవైపు చీమలు, మరొకవైపు ఈగలు దాన్ని అనుభవిస్తున్నాయి. అతని కడుపులో తిప్పినట్లయ్యింది. రేణు అలక్ష్యానికి ఒళ్లు మండిపోయింది.

రెండురోజుల క్రిందటే కొండాపురం పటేలు దారిలో కలసి, రమేష్‌ని హెచ్చరించాడు. తను చేయవలసిన పనిని చూచుకొని మర్యాదగా వెళ్ళిపొమ్మని, రేణు ఊళ్ళోవారిని రెచ్చగొట్టితే బావుండదని బెదిరించాడు.

ఎవ్వరినీ రెచ్చగొట్టడం లేదని, అనారోగ్యంగా వున్న వారికి మందులిస్తున్నదని సమాధానం చెప్పినా, అతను తృప్తి చెందలేదు.

ఈ సంగతి గుర్తుకి రాగానే రమేష్‌లో కోపం యింకా పెరిగిపోయింది. దూరం నుంచే డేరాలోంచి కుక్క బయట పడటం చూచిన రేణు ఆదుర్దాగా వచ్చింది.

'ఏమయ్యింది ?' అని ఆత్రుతగా అడిగింది.

'ఏమయ్యిందా? చూడు నీవు చేసే నిర్వాకం?' అని డేరా బట్టను జరిపి ప్రక్కకు విసురుగా చూపాడు.

'నన్ను క్షమించండి, పొరపాటు జరిగిపోయింది' అని గిన్నెలు సర్దడానికి ఆమె డేరాలోనికి వెళ్ళబోయింది.

'పొరపాటు........అది పొరపాటుకాదు. నేను, బాబు అంటే నీకు లక్ష్యం లేదు. ఊరూర తిరిగి ఆ ముష్టి వెధవలకు సేవలు చేయటానికే నీకు టైము సరిపోదు.'

క్షణంసేపు రేణు నివ్వెరపోయింది. ఒకరి ఆలోచనలకు, పనులకు మరొకరు గౌరవం యివ్వాలని నీతులు చెప్పిన వ్యక్తేనా తన భర్త! ఆ రోజు ప్రొద్దుటినుంచి జరిగిన సంఘటనలకు, యీ మాటలుతోడై, ఆమెను జుగుప్స పరిచాయి.

'అయితే, నేను చేసే పనులు మీకు తప్పుగా కనిపిస్తున్నాయా?' అని మాత్రం అనగలిగింది.

ఆమెతో వాదన పెంచుకోదలచుకోలేదు. ఈసడింపుగా 'ఊఁ' అని విసురుగా రమేష్ వెళ్ళిపోయాడు.

రేణు డేరాలోకి వచ్చి, క్రిందపడ్డ వస్తువులు ఎత్తసాగింది. తను ఎంతో జాగ్రత్తగా వున్నా, యీరోజు ఎన్ని మాటలు వినవలసి వచ్చింది. వంట ముగించిన తర్వాతనే గ్రామస్థుల దగ్గరికి వెళ్తోంది. పొరపాటున డేరా త్రాళ్లు గట్టిగా ముడివేయలేదు. దానికి ఇంత రాద్ధాంతమా? ఆమె కళ్ళల్లో నుండి నీరు కారుతోంది.

మరో గంటలో మళ్ళీ వంట పూర్తి చేసింది. వడ్డించి రమేష్‌ని పిలిచింది. ఇద్దరూ మౌనంగా భోంచేశారు.

ఆ రోజు బరువుగా గడిచింది. మామూలు సమయం కంటే ముందుగానే ఆరోజు పడకచేరింది రేణు. రమేష్ ఏదో చదువుతూ కూచున్నాడు. ఒగంట తర్వాత నిద్రవచ్చినట్లనిపిస్తే, అతనుకూడా ప్రక్కలోకి చేరాడు.

రమేష్ పడుకోగానే రేణు అటువైపు తిరిగింది — ఇంకా కోపం తగ్గనట్లు, రమేష్ విసుక్కున్నాడు

'మధ్యాహ్నం జరిగిన సంగతికి నన్ను క్షమించండి. ఇకముందు అటువంటి పొరపాట్లు జరగవు. మీరు వద్దంటే, నేను గ్రామస్థుల దగ్గరికి వెళ్లను, అస్సలు వారితో మాట్లాడను' అంటుందని రమేష్ ఆశపడ్డాడు.

అటువెపు తిరిగిన రేణులో ఏవో ఆలోచనలు. 'రేణూ, నను క్షమించు! ఆవేశంలో యేవో అన్నాను. అవి పట్టించుకోకు. నీ మనస్సు నాకు తెలుసు. పేదప్రజల కష్టాలను చూచి నీవు సహించలేవు. నీకు తోచిన రీతిగా వారికి సాయం చేయి' అంటారని ఎంతో ఎదురుచూచింది.

అయిదు నిమిషాలు గడిచిపోయాయి. రమేష్ నెమ్మదిగా ఆమె మీద చేయి వేశాడు. ఏ మాటలులేక, తన కోరికను తీర్చుకోవాలనే

ఉద్దేశ్యంతో వేసిన చేతి స్పర్శ తగలగానే, ఆమెలో అసహ్యం పుట్టు కొచ్చింది. దానితో ఆమె కుంచించుకుపోయింది.

రమేష్ చేతికి ఆమె శరీరం చల్లగా తగిలేసరికి, అతనిలో వేడి తగ్గిపోయింది. ముడుచుకొని వున్న ఆమె శరీరాన్ని చూడగానే అతనికి ఊపిరి ఆడలేదు. లేచి యివతలికి వచ్చి వేరే పక్క వేసుకొని నిద్ర పోయాడు.

రేణుకి ఎంతసేపటికీ నిద్ర పట్టలేదు.

రమేష్ నిద్ర లేచేసరికి ఎదురుగా కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యింది. ఇద్దరి కళ్ళూ కలిశాయి. అంతకుముందు రాత్రి పేరుకొన్న మనస్పర్థ ఛాయలు దూరమైనాయి. ఇద్దరూ ఒకేసారి నవ్వారు. ఇద్దరి కోపాలూ ఒకేసారి ఎగిరిపోయాయి. ఇద్దరి మధ్యా కూచున్న నిరంజన్ యేదో తెలిసినట్లు నవ్వు తున్నాడు.

# 24

రామనాధంగారి దగ్గరి నుంచి ఉత్తరం వచ్చింది. అది రెండు, మూడుచోట్లు తిరిగి యిక్కడికి వచ్చింది. చాల రోజులుగా ఆయన సంగ తులు ఏమీ తెలియలేదు. ఆత్రంగా వుత్తరాన్ని చించాడు రమేష్.

'మైడియర్ సన్,

నీతో మాట్లాడక ఎన్నో యుగాలైనట్లనిపిస్తోంది. నాకు నాగపూర్‌కి ట్రాన్స్‌ఫర్ అయ్యింది. నా అనే వాళ్లులేని నన్ను ఏమూలకి వేసినా ఒక్కటే.

నీవు హైదరాబాదుకి వెళ్ళిన తర్వాత ఒక విచిత్రం జరిగింది. ఒక విధంగా నేను పుణ్యకార్యం చేశాను.

సుధ ఒక అబ్బాయితో కలసి తిరుగుతోందని నాకు తెలిసింది. నాలో ఈర్ష్యకాని, ఏహ్యాభావంకాని కలగలేదు. ఆమె వయస్సులో వుంది. మనిషన్న ప్రతివారికి వాంఛలు వుంటాయి. అదీగాక తన జీవితానికి ఒక స్థిరత్వం ఏర్పరచుకోవాలను కొంటారు. జీవితంలోని అంతిమ పాదంలో

వున్న నేను అవి రెండూ కలిగించలేనని నాకు తెలుసు, ఆమెకూ తెలుసు. అందుకే నాకు తప్పుగా అనిపించలేదు.

ఒక రోజు నేను ఆఫీసునుంచి యింటికి రాగానే సుధ, భూపేంద్ర అనే అబ్బాయితో మాట్లాడుతూ కూచుంది. నన్ను చూడగానే ఆమె ముఖం పాలిపోయింది. నేనే కల్పించుకొని, 'హలో, నేను సుధ మేనమామని' అని పరిచయం చేసుకొన్నాను. అతను తేరుకొని తనని పరిచయం చేసుకొన్నాడు. సుధ విచిత్రంగా నా ముఖంలోకి చూచింది.

'సుధా, ప్రొద్దున పనివాడు వస్తాడు. నా సామానులన్నీ సర్ది పంపించేయి' అని జవాబుకి ఎదురు చూడకుండా యివతలికి వచ్చేశాను. అంతే, మరో పది రోజులకు వాళ్లు రిజిష్టరు పెళ్లి చేసుకొన్నారని మిత్రుల ద్వారా తెలిసింది. నేను సుధని మనసారా ఆశీర్వదించాను. దారితప్పి యెన్నో యిబ్బందులకు గురి అయిన ఆమె బ్రతుకు, యిప్పటికైనా సాఫీగా నడవాలని కోరుకొన్నాను.

కలకత్తాలో వుంటే నేను బాధ పడతానని కాబోలు భగవంతుడు నన్ను నాగపూర్‌కి ట్రాన్స్‌ఫర్ చేశాడు. కాని యిక్కడకూడా నా జీవితం దుర్లభమైంది. మాట్లాడ్డానికి స్నేహితులు లేరు. నేనెందుకు జీవిస్తున్నానో నాకే తెలియదు.

రఘు పెళ్లికూడా చేసుకొన్నాడట. నన్ను పిలవలేదు. అయినా వాడు సుఖంగా జీవించాలని ఆశీర్వదిస్తున్నాను. కాని నాలాంటి దౌర్భాగ్యపు బ్రతుకు మరెవ్వరికీ యివ్వవద్దని ఆభగవంతుని పదేపదే కోరుకొంటున్నాను.

రేణు ఎలా వుంది ? అడిగానని చెప్పు. బాబుకి నా ఆశీస్సులు.

సెలవ్,

రామనాథం'

రమేష్ ఎంతో బాధపడ్డాడు. సుధ సహకారం అందినట్లే అంది దూర మైంది రామనాథంగారికి. చివరికి ఆమెకూడా దూరం కావడంతో ఆయన జీవితం మరీ దుర్భరమయ్యుంటుందని ఊహించాడు రమేష్.

# 25

ఆ రోజు ఆదివారం. రమేష్ కుటుంబ సమేతంగా కొండ మీద వున్న గుడికి బయలు దేరాడు. రేణు భోజనానికి ఏర్పాట్లు చేసి అక్కడికే తీసుకొని వచ్చింది.

కొండమీద చిన్న కట్టడం వుంది. అది పురాతనమైన దానిలా కనిపిస్తోంది. పైకి వెళ్ళడానికి మెట్లు లేవు. బండలమీద నెమ్మదిగా ఎక్కుతూ వెళ్ళాలి.

ఒక చేతిలో నిరంజన్‌ని ఎత్తుకొన్నాడు రమేష్. నడుస్తుండగా చీర అంచులు కాలిక్రింద పడి ముందుకు దుమికింది రేణు.

'ఏమయ్యింది?' అని రమేష్ ఆమెని అందుకొన్నాడు. 'ఏం లేదు, చీరకొంగు అడ్డొచ్చింది.'

చుట్టూ కొండలు వరుసగా ఏదో శిల్పకారుడు అమర్చినట్లు వున్నాయి. కొండాపురం గ్రామం బొమ్మరిల్లులా కనిపిస్తోంది.

గుడిప్రక్కన ఒక మర్రిచెట్టు వుంది. దానిప్రక్కన చదునైన బండలు పరిచి వున్నాయి. రేణు అక్కడే చతికిలబడింది.

'మీరు గుడిలోకి వెళ్ళిరండి' అని ప్రోత్సాహించింది.

'ఓహ్! భగవంతుని మీద నీకు యింకా నమ్మకం కుదరలేదా?'

రేణు నవ్వింది. 'గుళ్ళో దేవుని పూజించే అవసరం నాకు యింకా రాలేదు' నెమ్మదిగా అంది.

'సరే. నీ యిష్టం' అంటూ రమేష్, నిరంజన్‌తో లోపలికి వెళ్ళాడు.

బూజు కొట్టుకు పోయిన తలుపులను నెమ్మదిగా త్రోశాడు. ఎదురుగా శివలింగం వుంది. నల్లని రాయితో మలిచిన ఆ విగ్రహం కాంతులను విరజిమ్ముతోంది. పూజించి నమస్కరించాడు రమేష్.

బయటికి రాగానే ఫ్లాస్కులోంచి కాఫీని వంచి అందించింది రేణు. నిరంజన్ చేతిలో ఒక బిస్కట్టు వుంచింది

'నేను యింతకుముందు కొండలను, పర్వతాలను పుస్తకాలలో చదవడం, సినిమాల్లో చూడడమేకాని స్వయంగా వాటిని ఎక్కలేదు. చిన్న

ప్పటి నుంచి కొండలను ఎక్కాలని ఎంతో ఉబలాట పడేదాన్ని. ఈ రోజు నా కోరిక తీరింది!' రేణు సంతోషంగా అంది.

'నిజం! ఈ కొండలను పర్వతాలను చూస్తుంటే, నా మనస్సు యేవో ఎత్తులకు ఎదిగి పోతుంది. వాటిని చూస్తూ ఎన్ని గంటలైనా గడిపి వేయవచ్చు.'

రేణు కూడా ఒక కప్పులో కాఫీ వంచుకొని త్రాగసాగింది.

'మీ నాన్నగారి వద్ద నుంచి ఉత్తరాలు ఎక్కువగా రావటం లేదు. ఎలా వున్నారో?' రమేష్ అన్నాడు.

'మనం యిక్కడికి వచ్చిన తర్వాత ఆయనకి రోజులు గడవటమే కష్టమౌతోందట. నాకంటే ఎక్కువ నిరంజన్ జ్ఞాపకం వస్తున్నాడట. ఇంటి దగ్గర తోచకపోయేసరికి పనిలో యెక్కువ నిమగ్నుడౌతున్నాడట. అందుకొరకే ఉత్తరాలు ఎక్కువగా వ్రాయలేకపోతున్నానని క్రిందటి ఉత్తరంలో తెలిపాడు.'

'అలాగా.... అన్నట్లు మీ జగదీష్‌బాబు విశేషాలేమిటి?'

'ఆయన ఉత్తరాలు ఎక్కువగా వ్రాయరు. మనం కలకత్తా వదిలిన తర్వాత ఒకే ఒక ఉత్తరం వ్రాశారు. అందులో కూడా పార్టీ విషయాలు అసలు ఎత్తలేదు.'

అలా మాట్లాడుతూ మధ్యాహ్నం భోంచేసి సాయంత్రం మూడు గంటల ప్రాంతంలో క్రిందికి దిగారు.

రేణు పార్వతీపురం నుంచి తిరిగి వస్తోంది. ఆ ఊరి మధ్యలో చింత చెట్టు క్రింద జనం బాగా వున్నారు మధ్యలో నలుగురు వ్యక్తులు కూచున్నారు. వారికి ఎదురుగా చాలమంది కూచునివున్నారు. ఎవరో ఒక వ్యక్తి నిలబడి, ఏదో విషయం చెప్పబోతున్నాడు.

ఇంతలో ఎదురుగా, ఆ ఊరి నుంచి వస్తున్న ఒక వ్యక్తి కనిపించాడు. 'ఏం జరుగుతోంది అక్కడ?' అనుమానంగా అడిగింది రేణు.

'పంచాయతీ జరుగుతోందమ్మా' అని చెప్పాడు '

పంచాయతీ మంచిపద్ధతి. దగ్గర్లో పోలీసుకాని, కోర్టులుకాని లేని యీ

# 25

ఆ రోజు ఆదివారం. రమేష్ కుటుంబ సమేతంగా కొండ మీద వున్న గుడికి బయలు దేరాడు. రేణు భోజనానికి ఏర్పాట్లు చేసి అక్కడికే తీసుకొని వచ్చింది.

కొండమీద చిన్న కట్టడం వుంది. అది పురాతనమైన దానిలా కని పిస్తోంది. పైకి వెళ్ళడానికి మెట్లు లేవు. బండలమీద నెమ్మదిగా ఎక్కుతూ వెళ్ళాలి.

ఒక చేతిలో నిరంజన్‌ని ఎత్తుకొన్నాడు రమేష్. నడుస్తుండగా చీర అంచులు కాలిక్రింద పడి ముందుకు దుమికింది రేణు.

'ఏమయ్యింది?' అని రమేష్ ఆమెని అందుకొన్నాడు. 'ఏం లేదు, చీరకొంగు అడ్డొచ్చింది.'

చుట్టూ కొండలు వరుసగా ఏదో శిల్పకారుడు అమర్చినట్లు వున్నాయి. కొండాపురం గ్రామం బొమ్మరిల్లులా కనిపిస్తోంది.

గుడిప్రక్కన ఒక మఱ్ఱిచెట్టు వుంది. దానిప్రక్కన చదునైన బండలు పరిచి వున్నాయి రేణు అక్కడే చతికిలబడింది.

'మీరు గుడిలోకి వెళ్ళిరండి' అని ప్రకటించింది.

'ఓహ్! భగవంతుని మీద నీకు యింకా నమ్మకం కుదరలేదా?'

రేణు నవ్వింది. 'గుళ్ళో దేవుని పూజించే అవసరం నాకు యింకా రాలేదు' నెమ్మదిగా అంది.

'సరే. నీ యిష్టం' అంటూ రమేష్, నిరంజన్‌తో లోపలికి వెళ్ళాడు.

బూజు కొట్టుకు పోయిన తలుపులను నెమ్మదిగా త్రోశాడు. ఎదురుగా శివలింగం వుంది. నల్లని రాయితో మలిచిన ఆ విగ్రహం కాంతులను విరజిమ్ముతోంది. పూజించి నమస్కరించాడు రమేష్.

బయటికి రాగానే ఫ్లాస్కులోంచి కాఫీని వంచి అందించింది రేణు. నిరంజన్ చేతిలో ఒక బిస్కట్టు వుంచింది

'నేను యింతకుముందు కొండలను, పర్వతాలను పుస్తకాలలో చదవడం, సినిమాల్లో చూడడమేకాని స్వయంగా వాటిని ఎక్కలేదు. చిన్న

ప్పటి నుంచి కొండలను ఎక్కాలని ఎంతో ఉబలాట పడేదాన్ని. ఈ రోజు నా కోరిక తీరింది!' రేణు సంతోషంగా అంది.

'నిజం! ఈ కొండలను పర్వతాలను చూస్తుంటే, నా మనస్సు యేవో ఎత్తులకు ఎదిగి పోతుంది. వాటిని చూస్తూ ఎన్ని గంటలైనా గడిపి వేయవచ్చు.'

రేణు కూడా ఒక కప్పులో కాఫీ వంచుకొని త్రాగసాగింది.

'మీ నాన్నగారి వద్ద నుంచి ఉత్తరాలు ఎక్కువగా రావటం లేదు. ఎలా వున్నారో?' రమేష్ అన్నాడు.

'మనం యిక్కడికి వచ్చిన తర్వాత ఆయనకి రోజులు గడవ టమే కష్టమౌతోందట. నాకంటే ఎక్కువ నిరంజన్ జ్ఞాపకం వస్తున్నాడట. ఇంటి దగ్గర తోచకపోయేసరికి పనిలో యెక్కువ నిమగ్నుడౌతున్నాడట. అందుకొరకే ఉత్తరాలు ఎక్కువగా వ్రాయలేకపోతున్నానని క్రిందటి ఉత్తరంలో తెలిపాడు.'

'అలాగా.... అన్నట్లు మీ జగదీష్‌బాబు విశేషాలేమిటి?'

'ఆయన ఉత్తరాలు ఎక్కువగా వ్రాయరు. మనం కలకత్తా వదిలిన తర్వాత ఒకే ఒక ఉత్తరం వ్రాశారు. అందులో కూడా పార్టీ విషయాలు అస్సలు ఎత్తలేదు.'

అలా మాట్లాడుతూ మధ్యాహ్నం భోంచేసి సాయంత్రం మూడు గంటల ప్రాంతంలో క్రిందికి దిగారు.

రేణు పార్వతీపురం నుంచి తిరిగి వస్తోంది. ఆ ఊరి మధ్యలో చింత చెట్టు క్రింద జనం బాగా వున్నారు మధ్యలో నలుగురు వ్యక్తులు కూచున్నారు. వారికి ఎదురుగా చాలమంది కూచునివున్నారు ఎవరో ఒక వ్యక్తి నిలబడి, ఏదో విషయం చెప్పుకు పోతున్నాడు.

ఇంతలో ఎదురుగా, ఆ ఊరి నుంచి వస్తున్న ఒక వ్యక్తి కనిపిం చాడు. 'ఏం జరుగుతోంది అక్కడ?' అనుమానంగా అడిగింది రేణు.

'పంచాయతీ జరుగుతోందమ్మా' అని చెప్పాడు.

పంచాయతీ మంచిపద్దతి. దగ్గరలో పోలీసుకాని, కోర్టులుకాని లేని యీ

మూల గ్రామాల్లో న్యాయ విచారణ చెట్లక్రింద జరిగే పంచాయతీ జరుపు తుంది. పంచాయితీ నిర్ణేతలు పక్షపాతానికి తావు యివ్వకుండా తీర్పు చెప్పగలిగితే, తక్కువ ఖర్చులో తగవులు పరిష్కారం అవుతాయి.

రేణు ముందుకు సాగింది. పంచాయితీ జరుగుతోంది.

'అరేయ్ సోమా! ఈ రెండో పిల్లని ఎప్పుడు కలిశావురా?' అడిగాడు పంచాయితీ పెద్ద, ఆ ఊరి పటేలు నాగయ్య.

సోమనికి యింతకుముందే వెంకమ్మతో పెళ్ళి జరిగింది. అతను త్రాగి తందనాలాడుతుంటే ఆమె ఎదిరించింది. దాంతో సోముడు రోజూ ఆమెని చితక బాదేవాడు. ఆ బాధని భరించలేక సంవత్సరం వయస్సున్న కొడుకుని చంకన వేసుకొని తల్లిగారి ఊరుకి చేరుకొంది.

'ఏం సెప్పను దొరా! నా పెళ్లాం సెప్పా సేయక ఎల్లిపోనాది. పొద్దంతా రెక్కలు ముక్కలు సేసుకొని వస్తే యింత కూడుబెట్టే దిక్కు లేక పోనాది. అందుకే నర్సమ్మని కట్టుకున్నాను.'

వెంకమ్మ తరపు మనుష్యలు చివాలున లేచారు. 'అందరూ ఒక్క సారే మాట్లాడవద్దు' అని ఆజ్ఞాపించాడు నాగయ్య. ఆరోజు ప్రొద్దున్నే ఆయన దగ్గరకు వచ్చి, వందరూపాయలు సమర్పించి 'మీరే కాపాడాలి, యీ విపత్తునుండి' అని శరణు వేడుకొన్నాడు సోముడు. అందుకొరకనే నాగయ్య, వెంకమ్మ తరపున వచ్చిన మనుష్యలను ఎక్కువగా మాట్లాడ నివ్వడం లేదు.

అందులో ఒకడు లేచి నిలబడి 'భార్యాభర్తలన్న తర్వాత ఏవో తగాదాలు వుంటాయి. దెబ్బలపోరు పడలేక, ఆ పిల్ల పుట్టింటికి వెళ్ళిందే అనుకో. అంత మాత్రాన యింకో పిల్లని మనువు చేసుకోవడమేనా? ఇంత అన్యాయమెక్కడైనా చూశారా?' అన్నాడు.

'పోనీ, ఒక్కసారైనా వచ్చి దాన్ని యింటికి రమ్మని అడిగాడా?' మరొకడు అడిగాడు.

'ఆడదానికే అంత బిగుసు వుంటే ఎలా వస్తాడోయ్ మగవాడు? అప్పటికే ఆ ఊరికి వెళుతున్న యిద్దరు మనుషులతో కబురు సెప్పాం, పిల్లని పంపమని. సంసారం చేయించే బుద్ధే వుంటే, ఆ పిల్లని ఎందుకు తేలేదు అంట?' అని ఎదుటి పక్షం వారి వాదన.

ఇలా వాదనలు సాగుతునే వున్నాయి. సాయంత్రం నాలుగు కావ నోంది. నాగయ్య వెంకమ్మని ముందుకి పిలిచి, 'నీవు మొగున్ని వదిలి పోవడం తప్పు. అందుకే వాడు యింకొక దాన్ని చేసుకొన్నాడు. నీకు సంసారమే కావాలంటే, ముగ్గురు కలసి బ్రతకండి' అన్నాడు.

సోమడు మురిసిపోయాడు - పొలంలో పనిచేయడానికి కూలీ అవసరంలేని పనిమనిషి దొరుకుతుందను కొన్నాడు.

'నా ప్రాణం పోయినా దాని ముఖం చూడను. ఆయనతో నాకు సంసారం వద్దు' ఖచ్చితంగా అంది వెంకమ్మ.

'మరి సోమనికి చెప్పి రెండవ పిల్లని తెగతెంపులు చేయిస్తాం. దాని మనువు కయిన పైకం యిస్తారా ?' అన్నాడు నాగయ్య.

వెంకమ్మ అన్న, మరి ఇతర పెద్దలు ఒకరి ముఖం యింకొకరు చూచుకోసాగారు.

అంతలో రెండవసారి చేసుకొన్న అమ్మాయిని పిలిచి 'నీకు కొంత పైకం యిప్పిస్తాం, సోమని వదుల్తావా?' అని అడిగాడు.

ఆమె ఏడ్వసాగింది. 'తెలిసో, తెలియకో ఆయన చేయిని పట్టుకొని యీ ఊరు వచ్చాను. ఇప్పుడు నన్ను రెంటికి చెడిన రేవడిలా చేస్తానంటే మీకే తెలుసు. మీ ఊరు ఎలా చెప్తే అలా వింటాను' అని తెలివిగా అంది.

ఆ ఊరిలో చాలమంది ఆ పిల్లని వదిలేయడానికి వీల్లేదు అన్నారు. అందులో ఒకడు లేచి, 'ఆడది ఎంత పొరుషాలకు పోయినా పనికిరాదు. మనం భార్యాభర్తలని కలపాలని చూడాలి. సోమడు యిద్దరిని ఏలుకోవడమే న్యాయం. ఒరేయ్ సోమా, లేచి మీ బావమరిదిని సముదాయించు. జరిగినవి మరిచిపొమ్మను' అనగానే సోమడు లేచివచ్చాడు.

వేరే మార్గం లేక వెంకమ్మ అన్న, పెద్దలు ఒప్పుకొన్నారు ఇష్టం లేకపోయినా, సవతిని వెంటబెట్టుకున్న సోమనితో, ఊళ్లోకి బయలుదేరింది వెంకమ్మ.

# 26

కొండాపురానికి పడమర పెద్ద అడవి వ్యాపించి వుంది. అడవి దాదాపు ఊరి పొలిమేరలోకి విస్తరించివుంది. జనసంచారం. పశువుల త్రొక్కిడి, అవసరమయినప్పుడు దగ్గర్లో వున్న చెట్లను నరుక్కుపోవడంతో ఒక మైలు మేరకు అడవి బాగా పలుచబడింది. ఆ అడవి ప్రాంతానికి దగ్గర్లో పొలాలున్న రైతులు, నెమ్మదిగా సంవత్సరానికి కొంత అడవి భాగాన్ని రూపుమాపి, ఆ భూమిని దున్ని పొలంగా మార్చుకొంటున్నారు.

ఆ విధంగా పదిహేను కుటుంబాలు కనీసం ఓ వంద ఎకరాల భూమిని దక్కించుకొన్నాయి. ఇది చూచి, బొత్తిగా భూమిలేని హరిజనులు, లంబాడీలు యింకా స్త ముందుకి పోయి, నిండుగా ఉన్న అడవిని కూడా నరికివేసి పొలాలుగా మార్చుకొన్నారు.

అడవి ప్రాంతం యిలా పొలాలుగా మారిపోతున్నా, అది అధికారుల దృష్టిలోకి రాలేదు. కాని నాగయ్య దృష్టిలో ఎప్పుడో పడింది. పూర్తిగా తిని బలవనీ, ఆ తర్వాతనే కోసేస్తానని మేకకు మేతవేసే కసాయి వానిలా, ఏమీ పట్టనట్లు ఊరుకున్నాడు.

అడవిని నరికి పొలంగా మార్చిన భూమి మంచి సారవంతంగా వుంది. దానికి తోడు వర్షాలు కూడా బాగా సహకరించాయి. ఆ పంట అయిపోగానే రెండవ పంటగా నువ్వులు, జొన్నలు చాలమంది వేశారు. పేద ప్రజలు రెక్కలు విరుచుకొని పండించి సత్ఫలితం పొందితే, ఆయనకు తన యింటిలో నుంచి ధాన్యం తీసుక వెళ్తున్నట్లు అనిపించింది.

నాగయ్య ఆ రోజు సాయంత్రం ఊళ్లో చాటింపు వేశాడు. 'ఇంత వరకు అడవిని నరికి పొలంగా మార్చిన భూమిని దొరగారు సర్కారు దగ్గర కొన్నారు. పంటలు పండిస్తున్న ప్రతివాడు అందులో సగం దొరగారికి ముట్టజెప్పాలి. దీని విషయమై రేపు ప్రొద్దున దొరగారిని కలవాలి' అని చాటింపు వేస్తూ వెళ్ళాడు ఒకడు.

ఆ పొలాలు దున్నుకొని బ్రతుకుతున్న వారి గుండెల్లో రాయిపడింది. ప్రభుత్వం వారిదగ్గర కొన్నది అనేది ఉత్తమాట అని అందరికీ తెలుసు.

కాని నాగయ్య చూపు పడింది. అంటే, అతను ఏదో ఒకటి చేస్తాడు. అందుకని అతను ఎలా చెప్తే అలా విందామనుకొన్నారు.

ప్రొద్దున్నే ఆ యిరవై మంది నాగయ్య భవంతి దగ్గర హాజరైనారు. వాళ్ళు వచ్చిన తీరుని చూడగానే ప్రకటన వేయించింది ఒప్పుకున్నట్లే కనిపించింది. మెడలు వంచిన వారిమీద యింకొంత బరువును పెట్టాలనే పద్ధతిని సమర్థించేవాడు నాగయ్య. ఆయనలో యింకా దురాశ ప్రబలింది.

'ఏమిరా ? నిన్న వేయించిన చాటింపుని విన్నారా !'

'విన్నాం దొరా : మా కష్టసుఖాలు తెలిసిన దొరలు మీరే : మీరు చెప్పినట్లు వింటాం' ఏకకంఠంతో అన్నారు.

'అదేరా, ఈ భూమిని కొన్నానా? దాని ఖర్చులు, ఆఫీసర్లకు తినిపించిన లంచాలు చాల ఎక్కువైనాయి అందుకొరకే యీసారి మూడింట రెండు భాగాల పంట యివ్వండ్రా ! వచ్చేసారి నుంచి సగం యిద్దురు గాని' అన్నాడు.

వారి నాలుక మీద తడి ఆరిపోయింది సగం పంటను పంచి యిస్తేనే సగం ఆకలితో మాడవలసి వస్తుంది. ఇప్పుడు రెండు భాగాలు యిచ్చేస్తే ఆకలితో చస్తారు.

'దొరా! మీకు తెలియనిదేముంది? పొలానికి అయిన ఖర్చులు షావుకారి దగ్గర అప్పు తీసుకొన్నాం. అవి పోతే మాకు మిగిలేదేమీ వుండదు. కనికరం చూపాలి మీరు. ఈసారి కూడా సగంపంట తీసుకొని రక్షించాలి' అని ప్రాధేయపడ్డారు అందరు.

నాగయ్య ఉగ్రుడైనాడు. 'ఏమిరా మిరనేది ? ఎన్నో కష్టనష్టాలను భరించి భూమిని తీసుకుంటే, మీరేమో యిష్టమొచ్చినట్లు మాట్లాడుతున్నారు. అదేమీ కుదరదు. ఎల్లుండి నామనుష్యులు వస్తారు. ధాన్యం అప్పజెప్పండి. ఇక వెళ్ళండి,' అని గొఱ్ఱెల మందని అదిలించినట్లు బెదిరించాడు.

ఇంకా ఎక్కువసేపు నిలబడితే ఆయన తంతాడేమో అనే భయంతో యివతలికి నడిచారు.

ఎదురుగా రేణు వస్తోంది. తల వ్రేలాడవేసుకొని వస్తున్న వారి ముఖాలను చూడగానే ఎంతో జాలి వేసింది ఆమెకి. అంతకుముందే హరిజనవాడలో ఆమెకు అన్ని విషయాలు తెలిశాయి.

'మీకు అభ్యంతరం లేకపోతే, నేను రెండు మాటలు చెప్పుతాను వింటారా?' అంది రేణు. వారు ఆశతో ఆమె వైపు చూశారు.

"ఈ లోకంలో ధనికులు ఎప్పుడూ బీదవారిని దోచుకుంటూనే వున్నారు. పెదవి కదపని పేదవారిని చూస్తే వారికి యింకా పేరాశ కలుగుతుంది. బస్తా జొన్నలకు బస్తా నువ్వులు తీసుకోవడమే అన్యాయం. మీరు ఎదురు పలకలేదనే, వాళ్లు ఒక్కబస్తా యిచ్చి, రెండు బస్తాలు యిచ్చామని బొంకుతున్నారు. అయినా మీరు కుక్కిన పేనుల్లా పడివున్నారు. ఇప్పుడు చూడండి. యీ క్రొత్త ఆపద వచ్చిపడింది. అడవిని కొట్టి పొలంగా మార్చుకొన్న భూమిని ఆయన ఎలా కొనగలుగుతాడు? ప్రభుత్వం అలా ఎన్నడూ అమ్మదు. అవన్నీ బూటకాలు. మీరు ఎదురు తిరగాలి. మీలో చీమూ నెత్తురూవుంటే యీ అన్యాయాన్ని కొనసాగనివ్వద్దు. నోరులేని పిల్లల నోట్లో మట్టికొట్టి, ఆయన గోదాములు నింపుదామనుకొంటున్నారు. ఇప్పటికైనా కళ్లు తెరవండి. గింజలు ఆయనకిచ్చి ఆకలితో గిజగిజ చచ్చేకంటే, అందరూ కట్టుగా ఎదిరించండి. మీరందరూ ఒక్కటైతే అతను ఏమీ చేయలేడు. నామాట వినండి. ఇది మంచి సమయం. ఎదిరించండి' ఆవేశంగా ఉద్బోధించింది రేణు.

ఆ మాటలు వారికి సరిగ్గా తలలోకి పోకాయి. ఆకలితో చచ్చేకంటే ఎదురించడం మేలు అనుకొన్నారు. ఒకరివైపు మరొకరు చూచుకొని ఆమె చెప్పినది అంగీకరించినట్లు తలలూపుకొన్నారు.

'అమ్మగారూ నీవు చెప్పినట్లే చేస్తాం మాకు యీ మునసబు కలిగిస్తున్న బాధలతో బేజారెత్తింది. ఈ దెబ్బతో ఆయన అంతుతేలుస్తాం' అని ఆవేశంగా మాట్లాడారు

రేణు ఆనందంగా ముందుకి సాగింది.

బలంగా నేలకేసి నలపబడుతున్న వారి మధ్యలో ఒక క్రాంతి రవ్వ పడింది. అది ఒక రోజు తప్పనిసరిగా జ్వాలగామారి విప్లవం వచ్చి తీరుతుందని ఆమెకు విశ్వాసం కలిగింది.

వారు ఎదిరించి తమ శృంఖలాలు త్రెంచుకోగలిగితే, ఆమె యిచ్చిన సలహాకు సత్ఫలితం లభించినట్లే అనుకొంది.

# 27

నాగయ్య మనుష్యులు పొలాల దగ్గరికి వచ్చారు. నూర్పుడు చేసు కొంటున్న రైతులు వారిని చూచి ఒక్క చోటికి చేరారు.

నాగయ్య సమ్మెననబంటు చంద్రయ్య ఆశ్చర్యంగా చూశాడు వారిని. ఒక వ్యక్తిని ఉద్దేశించి 'ఏంరా,మల్లా! ఎంత పండిందిరా నీ చేను?' అని అడిగాడు.

'ఎంత పండితే నీకెందుకురా?' జవాబు.

వారి మాటల్లో వచ్చిన తేడాను చూచి చంద్రయ్య ఏదో అనుమాన పడ్డాడు.

'అదేంరా! నాగయ్య దొరకు గింజలు యిస్తానంటిరి గదా !'

'ఈ భూమిలో పండిన గింజలు యివ్వడానికి యిది దొర అబ్బదా ? లేదా నీ అబ్బదా?' మల్లని సవాలు.

'ఏం కూశావురా?' అని ఎగిరి చంద్రయ్య మల్లని గొంతు పట్టు కొన్నాడు. అంతలో ఇరవై కర్రలు గాలిలోకి లేచాయి.

'మర్యాదగా వదులు, లేదా నీ ఎముకలు ముక్కలౌతాయి' అన్న బెదిరింపుకి వెంటనే వదిలాడు చంద్రయ్య. వారి కోపాన్ని చూచి, చంద్రయ్యకి ఒళ్లు జలదరించింది. తనతో వచ్చిన మనుష్యుల్ని తీసుకొని పరుగెడుతున్నట్లు వేగంగా వెళ్ళిపోయాడు.

పీడ విరగడయిందని సంతోషించి, వారు పొలాల్లోకి వెళ్లిపోయారు.

ఎవరి పనుల్లో వారు మునిగిపోయారు. సూర్యుడు గూట్లో పడే సమయమది. నాగయ్య పొరుగూరి నుంచి వందమందికి పైగా రప్పించాడు. వారు గుంపులు గుంపులుగా ఒక్కొక్క పొలాన్ని చుట్టుముట్టారు.

పనుల్లో లీనమైవున్న వారిని వెనకనుంచి కొట్టేవరకు తెలియలేదు. అనుకోని యీ సంఘటనకు తమాయించుకో లేకపోయారు కొందరు. కొందరు ధైర్యంగా నిలబడి ఎదిరించారు. కూలీకని కోతకు వచ్చినవారు పొలాల వెంబడి పరుగెత్తసాగారు. ఎదురుగా నిలబడి పోరాడుతున్న వారి చేతిలోని కర్రలు ఒక్కక్షణంలో గాలిలోకి ఎగిరిపోయాయి. ఆ తర్వాత వారి శరీరాల మీద దెబ్బలు విపరీతంగా పడసాగాయి.

చంద్రయ్య మల్లని పొలానికి వచ్చాడు. 'ఏంకూశావురా అప్పుడు? నలుగురు అండగా వున్నారని కుక్కలా అరుస్తావా? ఇప్పుడు అనరా ఆ మాటలు?' అని వీపుమీద రెండు దెబ్బలు వేశాడు.

'ఒరేయ్, కుక్కవు నీవురా! తోక ఆడించుకొంటూ ఆ నాగయ్య మూతిని నాకుతావు. ఛీ నీది ఒక బ్రతుకేనా?' అని చీదరించుకొన్నాడు మల్లడు.

చంద్రయ్య కోపంతో దహించుకు పోయాడు. కర్రతో సర్గా మల్లని నెత్తిమీద వేశాడు. రక్తం ధారగా కారిపోతుంది.

'ఒరేయ్, సమయం వచ్చినప్పుడు నీవు యింతకంటే ఎక్కువ తన్నులు తింటావురా. పని అయిపోగానే నీ దొరే నిన్ను ఊబిలోకి త్రొక్కతాడురా.... అబ్బా....' అని మూలిగాడు.

మల్లడు మాటలు అంటూనే వున్నాడు. చంద్రయ్య కర్రతో తల మీద దెబ్బలు వేస్తూనే వున్నాడు. మల్లడు స్పృహతప్పి నేలకొరిగాడు.

సాయంత్రం ఏడు కావస్తోంది. వంట ప్రయత్నం చేద్దామని లేచింది రేణు. అంతలో యిద్దరు స్త్రీలు ఆత్రంగా పరుగెత్తుకొచ్చారు ఆమె దగ్గరికి.

'ఏమయ్యింది. అలా వున్నారు?' అడిగింది రేణు.

'మల్లడు మూసిన కన్ను తెరవటం లేదు. తల బాగా చితికిపోయింది. రక్తం ధారగా కారుతూనే వుంది. బాధగా మూలుగుతున్నాడు. ఇంకో అయిదుగురికి కూడా దెబ్బలు తగిలాయి' అని వారు చెప్పారు.

'అలాగా,'అని మాత్రం అనగలిగింది రేణు ఆమె సలహాప్రకారం వారు నిలబడి ధైర్యంగా ఎదిరించారు. ఇది విప్లవానికి తొలిమెట్టు. కాని యీ ఘర్షణతో ఎంతమంది వెనక్కి తగ్గుతారో తెలియదు అని అనుమాన పడింది.

'మల్లన్నని ఆసుపత్రికి తీసుకపోవాలి. చాలదూరం .... ...ఏమైనా సాయం చేస్తారేమోనని' నాన్చింది ఆ వచ్చినామిడ.

'అంటే....జీపు కావాలా?' అనగానే, వెంటనే తలాడించింది ఆమె.

కొండాపురానికి దగ్గరున్న ఆస్పత్రి కనీసం ఇరవై మైళ్ళుంటుంది. ప్రాణాపాయ స్థితిలో వున్నాడంటే అక్కడ రవాణా వసతులు ఏమీ లేవు. బస్సు లేదు. ఎడ్లబండిలో వెళ్ళాలంటే కనీసం ఒక్క రోజు పడ్తుంది.

'వస్తాను, ఆగు' అని రేణు నెమ్మదిగా రమేష్ దగ్గరికి వచ్చింది.

రమేష్ పెట్రోమాక్సు కాంతిలో ఏదో చదువుకొంటున్నాడు. అతను తలెత్తకపోయేసరికి, కొద్దిగా దగ్గింది.

'ఊర్లో ఎంత ఘోరం జరిగిందో విన్నారా ? నాగయ్య మనుషులు పాపం ఆ పేద రైతులను చితకబాదారు. అందులో యిద్దరు ముగ్గురు చావు బ్రతుకుల్లో వున్నారు....'

రేణు మాట పూర్తయ్యే లోపలే 'నీవు వాళ్ళ సంగతి పట్టించుకో వద్దని నాలుగైదుసార్లు చెప్పాను. వినిపించుకోవడంలేదు. ఆ నాగయ్య నన్ను అయిదారుసార్లు హెచ్చరించాడు, ఊరి సమస్యలలో తలదూర్చ వద్దని' రమేష్ అన్నాడు.

'ఈ ఊరి సమస్యలతో మన కొరిగే లాభం ఏముందండి? ఏదో నాకు తెలిసిన మందులిచ్చాను.'

'మందులివ్వడం కాదు.... నీవు వారికి ఉపదేశాలు యిచ్చి రెచ్చ గొడుతున్నావట. రేణూ నీకు తెలియదు, అతను ఎంత కర్కోటకుడో! మనకు కూడా ఏదైనా ఆపద రావచ్చు'

మొట్టమొదటిసారి రేణు, రమేష్ని ఏవగించుకుంది. అతను పిరికి వాడా ? తాము ఏం తప్పు చేస్తున్నామని, ఒకరు బెదిరిస్తే భయపడడానికి ?

'నాకు వారిగురించి బాగా తెలుసు మనలాంటి వారిని ఏమీ చేయ లేరు. మూఢులని, నోరులేని వారిని హింసించి, దోచుకు తింటారు. నేను వచ్చింది, వేరే పనిమీద. ఆ దెబ్బలు తగిలిన మనిషి చావు బ్రతుకుల్లో వున్నాడట. సెరిబ్రల్ హెమరేజ్ అని నాకు అనుమానం వస్తోంది. హాస్పిటల్కు తీసుకవెళ్తారట.... మీరు కొంచెం జీపుని యిస్తే....'

'వాట్? నీవు మతి వుండే మాట్లాడుతున్నావా? గవర్నమెంటు జీపుని ఆ అల్లరిమూకకు సాయం చేయడానికి యివ్వడం వీలుపడదు.'

రేణుకి కోపంతో చెవులు ఎర్రబారాయి. 'అల్లరిమూక అని ఎవరు చెప్పారు? మీరూ ఆ నాగయ్య చెప్పిన మాటలు నమ్ముతున్నారా? ఒక మనిషి చావు బ్రతుకుల్లో వుంటే, సాటి మనిషిగా యీ మాత్రం సాయం చేయలేరా ?'

'రోజుకి ఎంతోమంది చస్తున్నారు, అందరికీ సాయం చేస్తూ కూచుంటే, నా ఉద్యోగ బాధ్యత ఏంకావాలి? నా జీవితం ఏం కావాలి?' అని నిష్ఠూరంగా అన్నాడు రమేష్.

'మీరు అంటున్న మాటలకు నాకు జుగుప్స కలుగుతోంది. ఆ దెబ్బలు తిన్న వ్యక్తి ఎవ్వరోకాదు. నేను చెప్పిన మాటలు విని ధైర్యంగా నిలిచి భూకామందుని సవాలు చేసిన మనిషి. నేను చేస్తున్నకృషికి నా సిద్ధాంతాలకు యిది క్లిష్టమైన పరీక్ష. ప్లీజ్ ఈ ఒక్కసారి జీపుని యివ్వండి. ఆ వ్యక్తికి ఏమైనా జరిగితే, నేనే బాధ్యురాలినని నా అంతరాత్మ క్షోభిస్తుంది. ప్లీజ్!' అని ప్రాధేయపడింది రేణు.

'నీకు నీ సిద్ధాంతాలు ఎంత ముఖ్యమో, నాకు నా ఉద్యోగ బాధ్యత అటువంటిది. ఇంతకుముందే చెప్పాను. యిటువంటి పరిస్థితుల్లో జీపుని యివ్వడం జరగదు' ఖండితంగా చెప్పాడు రమేష్.

రేణు చెక్కిళ్ల మీదుగా రెండు చుక్కలు రాలాయి.

'మీరు నాకు సాయం చేయదలుచుకోలేదు. నా సిద్ధాంతాలు, నమ్మకాలు మీకు ఎప్పుడూ నచ్చలేదు....అందుకొరకే కుంటిసాకులు చెప్పి మీరు జీపునివ్వడంలేదు. ఐ హేట్ యు, విన్నారా? ఐ రియల్లీ హేట్ యు' అని గిరుక్కున తిరిగి, వెనక్కి ఉరికింది రేణు

మందుల పెట్టెలోనుంచి నాలుగు మాత్రలు తీసి, ఆ స్త్రీలకు యిస్తూ 'ఇంతకన్న నేను ఎక్కువ ఏమీ చేయలేనమ్మా!' నేనుకూడా ఒక బందీని. నా యిష్టానికి యిక్కడ విలువ లేదు. నన్ను క్షమించండి.' అని డేరాలోకి తిరిగి వచ్చింది రేణు.

రమేష్ పై నిజంగా ఆమెకు అసహ్యం పుట్టుకొచ్చింది. పెళ్ళి అయిన తర్వాత ఆమె ఎంతగానో మారింది. తన అభిరుచులను, అలవాట్లను మార్చుకొంటూ ఆయన యిష్టప్రకారం తిరుగుతోంది. కాని ఆయన మట్టుకు ఒక్క మెట్టుకూడా దిగిరాలేదు. జీవితాంతం తను నమ్మిన విషయాలను, చేస్తున్న పనులను, యీ ఒక్క రోజులో అన్నింటినీ వమ్ము చేశాడు.

# 28

ఏదో వంటచేసి టేబిలుమీద పెట్టింది రేణు. అలా చీకట్లో చూస్తూ కూచుంది. తొమ్మిదింటికి ఆకలిగా ఉంటే లేచి వచ్చాడు రమేష్.

'నీవు భోంచేయవా?' అన్న ప్రశ్నకు జవాబు రాకపోయేసరికి, తనే వడ్డించుకొని భోంచేశాడు.

భోజనం తర్వాత ఏదో చదువుకొని, పడుకుందామని లేచాడు రమేష్. రేణు యింతకుముందు కూచున్న చోటు నుంచి కదలలేదు.

'నిద్ర రావడం లేదా?' అన్న మాటకు కూడా జవాబు రాకపోయే సరికి, ఆమె నిర్లక్ష్యాన్ని తిట్టుకొంటూ నిద్ర కుపక్రమించాడు రమేష్.

ఎప్పుడు ఏ వార్త వినవలసి వస్తుందోనని, రేణు భయంగా కుర్చీలో కూచుంది. మల్లనికి ఏమీ ప్రమాదం జరగకూడదని మనస్సులో కోరు కొంది. ఆమె మగతగా కళ్ళుమూసుకుంది.

'నన్ను వదలండిరా! ఆ దుర్మార్గుని రక్తం కళ్ళ చూస్తాను ఆ అమ్మగారు చెప్పిన మాటలు అక్షరాల నిజం! మనం ఊరుకుంటే మనల్ని సర్వనాశనం చేస్తాడు. నన్ను వదలండి' అంటూండగా వెనకనుంచి ఎవరో గట్టిగా బాదారు. అంతే, మల్లడు అక్కడే ప్రాణం వదిలాడు.

రేణు ఒక్కసారే ఉలిక్కిపడి లేచింది. ఆమె గుండె దడ దడ కొట్టుకుంటోంది. కుర్చీలో కూచుని, టేబిలు మీద ఆనుకొని అలాగే నిద్రపోయింది, ఆ కలలో నిద్రలో ఏవో భయంకరమైన కలలు.

రేణు లేచి క్రింద పక్క వేసుకొని పడుకోవాలని ప్రయత్నిం చింది. కాని ఆమెకు అస్సలు నిద్ర పట్టలేదు.

తెల్లవారక ముందే లేచి కాఫీ తయారుచేసి, ఒక కప్పు త్రాగగానే, ఒంట్లోకి కొద్దిగా ఉత్సాహమొచ్చింది.

ఇంకో అరగంట తర్వాత లేచిన రమేష్‌కి కాఫీ తెచ్చింది రేణు.

'రాత్రి ఎన్నోసార్లు చూశాను. నీవు అస్సలు నిద్రపోయినట్లు లేదు. ఎవరి గురించో బాధపడి లాభం లేదు. వాళ్ళని నీవేవో ఉద్ధరించాలను కోవడం నిజంగా నీ పిచ్చి' అన్నాడు రమేష్.

చాచి చెంపమీద కొట్టినట్లని పించింది రేణుకి. అలా కొట్టినా మన సులో రగులుతున్న యీ బాధలావుండేది కాదు.

'చూడండి, రాత్రే నేను కోపంలో ఒక మాట అన్నాను. ఇంకా యిలాంటి మాటలు అంటూ నా దృష్టిలో మీ వ్యక్తిత్వాన్ని కించపరుచుకో వద్దు' విసురుగా వెళ్ళిపోయింది రేణు. రమేష్ నివ్వెరపోయాడు.

రేణు మనస్సులో ఏవో ఆలోచనలు రమేష్ ఆస్తికల కుటుంబంలో పుట్టాడు. కాలేజీ చదువులు చదివి హాయిగా వుద్యోగం చేస్తున్నాడు. ఆయనకు పేదరికం, వారు అనుభవిస్తున్న కష్టాలు తెలియవు. తెలిస్తే యిలా మాట్లాడడు. కాని ఆరోజు పెళ్ళి చేసుకోమని అడిగిన రోజు, తన పార్టీ వ్యవహారాలు అన్నీ తెలిసినట్లు మాట్లాడారు. తన ఆలోచనలకి, తన వ్యక్తిత్వానికి పూర్తిగా గౌరవమిస్తానన్నాడు. అదంతా కపట నాటకమా? కాకపోతే మామూలు పరిచయంలో చక్కని నీతులు చెప్పి, పెళ్ళి కాగానే వాటి అవసరంలేదని మరిచిపోతారా ? అన్నివిషయాలు చర్చించకుండా రమేష్‌తో పెళ్లికి ఒప్పుకొన్నది పొరపాటుగా ఆమె భావించ సాగింది.

తన పెళ్లి కాకముందు, యిప్పుడు మల్లన్నకు జరిగినటువంటి పరిస్థితి ఏర్పడితే, ఎంతో ధైర్యంగా ఎదుర్కొన గలిగేది. తన మనస్సుకు తోచిన విధంగా నిర్ణయాలు తీసుకోగలిగేది. పెళ్ళితో ఏ చిన్న నిర్ణయం తీసుకోవాలన్నా, నాలుగైదుసార్లు చర్చించుకోవలసి వస్తోంది.

ఎనిమిది కాగానే సర్వేకు వెళ్లాలని రమేష్ బయలు దేరుతున్నాడు. అంతలో ఆ ఊరిలో నుంచి ఒక యువతి ఆదుర్దాగా పరుగెత్తుకొచ్చింది. ఆమె రేణుని చేరుకునేలోపల రమేష్ కూడా వచ్చాడు. ఆ యువతి ఏదో చెప్పబోయి ఆగింది.

'ఏమిటి, కొంపలంటు కొన్నట్లు అలా ఉరికి వస్తున్నావ్?' అని గదమాయించాడు రమేష్.

ఆమె ఏదో చెప్పాలనుకొంది, కాని పెదవులు వణకాయి.

'ఎందుకు వచ్చావో చెప్పమంటే, అలా గ్రుడ్లు అప్పగించి చూస్తావేం? చెప్పు ఎందుకు వచ్చావో?' అని గట్టిగా అరిచాడు.

'అయ్యగారూ! మామల్లన్న యింతకుముందే చచ్చిపోయాడు. తెల్లవాళ్లు ఏవో కలవరింతలు ! ఈ విషయం అమ్మగారికి చెబుదామని......'

'ఉద్ధరించావు. మీ వాడేవడో చస్తే ఊళ్లోకి వెళ్లి అఘోరించు. ఇక్కడికి వస్తే మేమేం చేయగలం?' అని కఠినంగా అనేసరికి ఆ యువతి వెనక్కి తిరిగి చూడకుండా ఊళ్లోకి పరుగెత్తింది.

రేణు గుండెల్లో అగ్ని పర్వతాలు బ్రద్ధలవుతున్నాయి. ఆమె మనస్సుని ఊరడించి, నాలుగు స్వాంత వచనాలు పలికితే ఆమె గుండెలు చల్లబడతాయి.

రమేష్‌కి యీ సంఘటనలన్నీ ఏవో అవమానకరంగా కనిపించాయి. ఆమె ఆ విషయాలలో జోక్యం కలిగించు కొన్నందుకు అతనికి ఆగ్రహంగా వుంది.

మనస్సు చల్లబడే మాటలేవైనా చెప్తాడేమోనని ధైర్యంగా రమేష్ వైపు చూచింది రేణు.

అతని ఆగ్రహాన్నంతా చూపుల్లో నిలిపి, 'నీవు చేసిన నిర్వాకం చూడు' అని విసురుగా జీపువైపు నడిచాడు.

రేణు బాధతో అలాగే కూచుండి పోయింది ఈత తెలియని మనిషికి నీవు అలా బావిలోకి దూకు యిలా నేను దూకి పైకితీస్తాను అని ధైర్యం యిచ్చి అతను దూకగానే, పక్షవాతం వల్లనో లేదా కళ్లమైకం చేత రెండవ వ్యక్తి కదలలేక, బావిలోకి దూకలేక పోయాడు. మొదటి వ్యక్తి నీటిలో మునుగుతూ, చావుకి దగ్గరవుతూ అశక్తుడై ఆ దృశ్యాన్ని కలలోలాగా చూస్తున్నాడు రెండవ వ్యక్తి. సరిగ్గా తన పరిస్థితి అలాగే వుందను కొంది రేణు. తన సలహా మీద ఎదిరించి యిబ్బందులు తెచ్చుకొన్న వారికి ఏ సాయం చేయలేకపోతోంది.

మధ్యాహ్నం పన్నెండు ఎలా దాటిందో ఆమెకి తెలియలేదు. ఆమెకు ఎన్నో ఆలోచనలు వస్తున్నాయి. ఏదో నిర్ణయం చేయాలను కొంటోంది. కాని ఏదీ నిర్ధారణ చేసుకోలేకపోతోంది.

మల్లన్న శవాన్ని స్మశాన వాటికకు తీసుకెళ్తున్నారు. దారి డేరాల దగ్గరినుంచే వుంది. డప్పుల చప్పుడు విని బయటికి వచ్చింది రేణు.

ఆ శవాన్ని చూడగానే ఆమె మనస్సులో యేదో త్రిప్పినట్లు అనిపించింది. కళ్ళనుండి బొట బొట నీళ్లు కారసాగాయి.

అంతలోనే ఊరిలో నుంచి ఒక జీపు వెలుపలికి వచ్చింది. డ్రైవరు సీటులో ఒక ఇన్‌స్పెక్టరు, వెనక యిద్దరు జవానులు వున్నారు. మధ్య నలుగురు మనుష్యులు వున్నారు కాని ఎవ్వరో తెలియడం లేదు.

రమేష్ జీపులో వచ్చాడు. జీపులోనుంచి దిగుతూ రేణుని ఉద్దేశించి, 'ఆ పోలీసు జీపు ఎందుకు వచ్చిందో తెలుసా?' అడిగాడు రమేష్.

తెలియదని తలూపింది రేణు.

'నిన్న మల్లనితోపాటు నాగయ్యని ఎదిరించిన మనుష్యులని అరెస్టు చేయడానికి. నలుగురు దొరికారు. వారు నక్సలైట్లని, ఈ పరిసర గ్రామాల శాంతికి విరోధులని రిపోర్టు యిచ్చాడు నాగయ్య. అంతే, ఆ అరెస్టు అయిన వారు మళ్ళీ నాలుగైదు సంవత్సరాల వరకు ఇంటి ముఖం చూడరు' మామూలు ధోరణిలో అన్నాడు.

అతను అరెస్టు అయినవారి గురించి జాలిగా మాట్లాడుతున్నాడో, తనని చూచి ఎగతాళిగా అంటున్నాడో రేణుకి పూర్తిగా బోధపడలేదు. ఆమెలో యిక ఓర్పు నశించింది. ఆమె వెంటనే ఒక నిర్ణయానికి వచ్చింది.

అరగంటలో సూట్‌కేసు సర్ది, నిరంజన్‌ని తయారుచేసి, ఆమెకూడా ఆత్రంగా తయారయ్యింది. బయటకు వచ్చి పనిమనిషితో డ్రైవరుని పిలిపించింది. ఆశ్చర్యంగా దగ్గరకు వచ్చాడు రమేష్.

'నన్ను దగ్గర్లో వున్న బస్సుస్టాండులో వదలి రమ్మని చెప్పండి. నేను కలకత్తాకు వెళ్ళిపోతాను' రేణు స్పష్టంగా అంది.

'మనస్సుని నిగ్రహించుకో రేణూ. ఏదో జరిగిందని నీవు వెళ్ళిపోవడం అనవసరం.'

'ఏదో జరిగిందని కాదు. నా మాటకు విలువ లేనప్పుడు, నా పనులు మీకు నచ్చనప్పుడు, ఇక నేను వుండడం అనవసరం.'

'పోనీ, నీ మనస్సు ఊరట పడేవరకు హైదరాబాదుకి వెళ్ళు లేదా మన ఊరికి వెళ్ళిరా.'

'నేను ఎక్కడికీ వెళ్ళను. నేను అనుకొన్నట్లు కలకత్తాకు వెళ్ళనీయండి.'

'ప్రతి దానికీ నీ మొండిపట్టే గెలవాలి అంటావు. ఇక్కడ చేసిన పనులు చాలక, నేనేదో తప్పు చేసినట్లు అలిగి పోతున్నావ్' కోపంగా అన్నాడు రమేష్.

అంతలో డ్రైవరు వచ్చాడు వాళ్ళ సంభాషణ ఆగింది 'జీపుని తీసుకురా, బయటకు వెళ్ళాలి.' అన్నాడు రమేష్.

'ఎండమావులని చూచి, నీరు అనుకొని ఏదో సాధిస్తానని ప్రయత్నించి ఓడిపోయిన మనిషివి నీవు. నీవు యిప్పుడు ఆలోచించే పరిస్థితుల్లో లేవు నా మాట విను రేణూ, యీ ప్రయాణం మానేయి' నెమ్మదిగా అడిగాడు.

'ఇప్పటికే నా తల ఆలోచనల వేడితో పగిలిపోతోంది. మీరు యింకో మాట అన్నారంటే, నాకు పిచ్చెక్కుతుంది' అని ఆవేశంగా అంది రేణు.

ఆ బెదిరింపుతో యిక మాట్లాడలేకపోయాడు రమేష్.

# 29

బస్సు ఆగే చోటురాగానే జీపు ఆగింది. రేణు దిగింది, మరుసటి రోజు బస్సుస్టేషనుకి రావలసిందని సూచనలిచ్చి జీపుని పంపించి వేశాడు రమేష్.

అంతలో బస్సు వచ్చింది. వెనక సీట్లు ఖాళీగా వున్నా, రేణు వెళ్ళి ముందు ఒక స్త్రీ ప్రక్కన కూర్చుంది. తనతో మాట్లాడడం యిష్టం లేదని తెలుసుకొన్నాడు రమేష్.

బస్సు విశాఖపట్టణం బయలుదేరింది. మధ్యలో ఏదో గ్రామంలో ఆగింది. అక్కడేదో గొడవ జరుగుతూంటే రమేష్ చూశాడు.

ఒక స్త్రీ వేగంగా వచ్చి బస్సు ఎక్కబోయింది. అంతే, వేగంగా ఒక యువకుడు వచ్చి ఆమె సిగని పట్టి క్రిందికి లాగుతున్నాడు.

ఎందుకు అలా చేస్తున్నాడో అందరికి అర్థమయ్యేలా 'చెప్పా చేయకుండా నీ అమ్మోరి యింటికి పారిపోవాలనుకొంటున్నావా? వెధవ

ముండా! ఇక్కడేమైనా బాధలు పెట్టామా? అన్నం సరిగ్గా వండలేదని ఒక్క దెబ్బవేస్తే యిలా పారిపోతావా?' అని తిడుతున్నాడు.

'నన్ను వదిలిపెట్టరా దొంగసచ్చినోడా? పొద్దుగూకంగానే మస్తుగా తాగి, నా ఎముకలన్నీ విరగ్గొడుతున్నావ్. నీతో ఒక్కరోజు గడపను. ఇక నీ దారి నీది, నా దారి నాది' అంటోంది ఆ స్త్రీ.

'అన్ని తప్పులు ఎన్నేదానివి, నలుగురిలో యీ విషయం చెప్పి వెళ్ళిపోవే.... ఇలా దొంగలా పోతావెందుకు ?' అని సిగను వదలకుండా ఆమె రెక్కనిపట్టి లాక్కుపోతున్నాడు.

ఆలుమగల విషయం మనకెందుకు ? అని అక్కడున్న వారిలో ఎవ్వరూ కల్పించుకోలేదు.

కుతూహలంగా చూస్తున్న రమేష్ దృష్టి ముందుకూచున్న రేణు వైపు మళ్లింది. రేణుకూడా అప్పుడే యిటు చూచింది. ఇద్దరూ సిగ్గుపడి చూపులు తప్పించుకొన్నారు.

బజారులో కొట్లాడిన ఆ భార్యాభర్తలకు, యింట్లో గుట్టుగా పేచీ పడిన రమేష్, రేణు దంపతులకు యిద్దరికీ భేదాభిప్రాయాలు వున్నాయి. కాని భర్త తన పరిధిని వదిలి మనస్ఫూర్తిగా ఆమెని వుండమని బ్రతిమాల లేదు. పోనీ తెగించి దండించలేదు. భార్యకూడా తన వలయాన్ని వదిలి, మిమ్మల్నివదిలి వుండలేను. జరిగిన తప్పులను ఒప్పుకొని మళ్లీ యిటు వంటివి జరగకుండా మాటయిస్తే వుండిపోతాను అనలేదు.

చదువుకొని, సంస్కారులైన యువతీయువకుల్లో భార్యాభర్త లైనప్పటికీ తమ చుట్టూ వ్యక్తిత్వ పరిధులను నిర్మించుకొని ఎవ్వరి పరిధులను వారు భద్రంగా కాపాడు కొంటూంటారు.

బస్సు విశాఖపట్టణంలో ఆగింది. స్టేషనులోకి వెళ్లి వాకబు చేస్తే మదరాసు జనతాలో ఒక సీటు దొరికింది.

రేణు రైలులో ఎక్కికూచుంది. ఒళ్ళో కూచున్న నిరంజన్‌కి అంతా క్రొత్తగా వుంది గుంపులుగావున్న జనం, అప్పుడప్పుడు పెద్దగా చప్పుడు చేస్తూన్న ఇంజన్ సైరన్ అతనికి ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

టికెట్టుని, కొంత డబ్బుని రేణు చేతికిస్తూ అన్నాడు రమేష్, 'ఇప్పటికైనా నీ మనసు్సు మార్చుకో. ప్రయాణం మానుకో....'

రేణు జవాబు యివ్వలేదు.

'పోనీ....మళ్ళీ ఎప్పుడొస్తావు?'

తీక్షణంగా చూచింది రేణు. 'మళ్ళీ రావాలని యీ మనసుకి తోచిన నాడు....కాని, ఎప్పటికీ రావొద్దనే యిప్పుడు నా మనస్సు గట్టిగా చెబు

రైలు గట్టిగా కేక వేయడంతో, రెండవ వాక్యం రమేష్‌కి వినిపించలేదు.

బండి కదిలింది. అప్పటివరకు ఎగురుతూ ఆడుకొంటున్న నిరంజన్‌కి నాన్నగారు క్రిందనే వుండటం తెలిసిపోయింది. రమేష్ కనుమరుగు కాగానే వాడు ఏడుపు లంకించుకొన్నాడు. రేణు ఎంతో సముదాయించింది. కాని, వాడు ఏడుస్తూనే వున్నాడు. ఆమెకి కూడా ఏడుపు ఆగలేదు.

ఎన్నో కొత్త ఆశలతో రమేష్‌ని పెళ్ళి చేసుకొంది. తన ఆశయాలకు, ఊహలకు సహకారమిస్తున్న ఉత్తమ పురుషుడని ఆరాధించింది. కలకత్తాలో పార్టీ పనులకు, సాంసారిక బాధ్యతలకు మధ్య నలిగిపోవడం దుర్భర మనిపించింది. ట్రాన్స్‌ఫర్ కాగానే ఆమె ఎంతో ఉల్లాసంతో, తన జీవితంలో క్రొత్త మలుపులు చూడాలని వచ్చింది. కాని అరకులోయలోకి వచ్చిన తర్వాత పేద ప్రజలను చూడగానే ఆమె మనస్సు ప్రజా సేవలోకి దారితీసింది. అప్పుడే ఆమె కళ్ళముందర నుండి చీకటి పరదా తొలిగిపోయినట్లయ్యింది. రమేష్ అసలు వ్యక్తిత్వం బయటపడింది.

కలకత్తా నుండి బయలుదేరేటప్పుడు ఎంత ఉత్సాహంగా వుందో! ఏదో కోల్పోయినట్లు యిప్పుడు బాధగా వుంది.

# 30

ఇంటి ముందుకి వచ్చిన టాక్సీని చూచి ఆత్రంగా బయటికి వచ్చిన అప్పలస్వామి ఆశ్చర్యానికి అంతులేదు. టాక్సీలో నుంచి దిగుతున్న కూతురు దగ్గరికి వెంటనే పరుగెత్తుకొచ్చాడు. టాక్సీలో నుంచి సామాను దించాడు.

నిరంజన్ బుగ్గమీద చిటికవేస్తూ 'వచ్చేముందు ఉత్తరం వ్రాయలేక పోయావా? నేను స్టేషనుకి వద్దును' అన్నాడు.

'అనుకోకుండా బయలుదేరాను బాబా' యింటి లోపలికి నడిచింది రేణు.

'రమేష్ ఎలా ఉన్నాడమ్మా? మీ బావ వాళ్ళంతా క్షేమంగా వున్నారా?' అన్న మాటలకు సమాధానం రాకపోయేసరికి, యేదో అనుమానం కలిగింది అప్పలస్వామికి.

'దెబ్బలాడి వచ్చావా? ఏమిటో చెప్పంది నాకు ఎలా తెలుస్తుంది?' ఆవేదనగా అన్నాడు.

'ఏమీ లేదు బాబా! ఆయనకు నేనంటే గౌరవం లేదు. నామాటకు విలువ లేదు. ఈ నెలరోజులుగా ఆయిన మాటలతో నాకు ఊపిరాడలేదు' కాస్త ఎక్కువగానే చెప్పింది రేణు.

'నీ మాటకు విలువ లేదంటే, నీవు సంసారంలో ఏవో లోట్లు చేసివుంటావ్. ఆయన అడ్రసు యివ్వు, నేను ఉత్తరం వ్రాసి పిలుస్తాను. మీలోవున్న మనస్పర్థలు నేను దూరం చేస్తాను.'

'లాభంలేదు బాబా! మనసుల్ని మధ్యపెట్టి కలుపలేం. ఆయన ఎంత లేసి మాటలన్నాడో కాపురం చేసిన నాకు తెలుసు. ఈ సంగతి నాకు వదిలేయ్. సమయం వచ్చినప్పుడు అదే పరిష్కారం అవుతుంది' అని సమాధానం చెప్పింది.

'ఇలాంటి పేచీ ఏదో ఒకటి తెచ్చుకొంటావని పెళ్ళిజరిగిన రోజు నుంచే అనుకొంటున్నాను. చిన్నప్పుడే మీ తల్లి పోవడంతో, నిన్ను గారాబంగా పెంచుతున్నాను. నీ యిష్టానికి వ్యతిరేకంగా యెన్నడూ ఏపనీ చేయలేదు దానితో, నీ యిష్టానికి భిన్నంగా యే చిన్నవిషయం జరిగినా, సహించలేని గుణం వచ్చింది నీకు. అదంతా నాదే పొరపాటు' అని వాపోయాడు అప్పలస్వామి.

'ఇప్పుడు అవన్నీ ఎందుకు బాబా?'

'అవసరమమ్మా.... పెళ్ళికి ముందు నీవు ఎలా తిరిగినా చెల్లింది. ఇప్పుడు నీవు వివాహితవు. భార్యకు సహనం వుండాలి. భర్త ఒక వేళ పొరపాట్లు చేసినా ఓర్చుకొని సంసారం విచ్ఛిన్నం కానివ్వొద్దు.'

'ఇప్పుడేం కొంప మునిగింది బాబా! రేపటి నుంచి నేను యేదో ఒక ఉద్యోగం చేస్తాను. కాలం వెళ్ళిపోతుంది. నా కొరకు ఆయన వచ్చినప్పుడు చూద్దాం.'

'మగవాణ్ణి ఎక్కువ కాలం ఒంటరిగా వదలడం మంచిదికాదు తల్లీ! నీవే ఉత్తరం వ్రాసి పిలువు. లేదా నేనైనా వ్రాస్తాను.'

'ఒంటరిగా వుండి ఏమి చేసుకుంటారో చేసుకోనీ.... ఆయనతో నాకు అవసరం లేదు' అని మాటలు విరిచి వంటగదిలోకి వెళ్లింది రేణు.

అప్పలస్వామి కుమిలిపోయాడు. కూతురు సంసారం పచ్చగా వుందని మురిసిపోయాడు. తన కూతురు అదృష్టం కొద్దీ బంగారంలాంటి మనిషి. కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకొన్నాడు. కూతురి సంతోషాన్ని ఎన్నో సౌధాలుగా వూహించుకొని ఆనందిస్తున్న అప్పలస్వామి, ఆ సౌధాలను ఒక్క త్రోపుతో కూలద్రోసి ఎదురుగా వచ్చి నిలబడిన కూతుర్ని చూచి ఆరాటపడ్డాడు.

# 31

రేణు కలకత్తాకు వెళ్ళిపోయి అప్పటికి రెండు రోజులయింది. ఆమె తోడు లేనందుకు రమేష్ మనస్సు బాధపడ సాగింది. పనిమీద ధ్యాస తగ్గిపోయింది.

మల్లడు చనిపోయినా, కొంతమందిని అరెస్టు చేసినా కొండాపురం పేద ప్రజల ధైర్యం సడలిపోలేదు. యువకులు ముందుకు వచ్చి చేనుల్లో పని కొనసాగిస్తున్నారు. కొంత ధాన్యం ఇళ్ళకు చేరవేశారు.

నాగయ్య మనుషులు ఆరోజు మధ్యాహ్నంవేళ గూడెం వచ్చి ధాన్యం ముట్టజెప్పమని బలవంతం చేయసాగారు. ఇళ్ళదగ్గర వున్న స్త్రీలు, ముసలివారు యివ్వమని మొరాయించారు.

నాగయ్య మనుషులు దౌర్జన్యానికి దిగారు. కంటికి కనిపించిన కుండలను, ముంతలను పగులకొట్టారు. అడ్డం వచ్చిన కొందరి స్త్రీలమీద

కూడా దెబ్బలు పడ్డాయి. అంతలోనే యీ విషయం తెలుసుకొన్న యువకులు మూకుమ్మడిగా కర్రల నందుకొని గూడెం వైపు పరుగెత్తుకు రాసాగారు.

రమేష్ ఫీల్డుపని ముగించుకొని జీపులో గూడెం ప్రక్కనుంచి వస్తున్నాడు. గూడెంలోని స్త్రీలు, పిల్లలు ఏడుస్తూ కేకలు వేస్తున్నారు.

రమేష్ జీపుని ఒకపక్కగా నిలిపించి కుతూహలంతో అక్కడే నిలచివున్న వృద్ధుని ద్వారా విషయమేమిటో కనుక్కొన్నాడు

పొలం నుంచి పరుగుతో వచ్చిన యువకులు ఆవేశంతో నాగయ్య మనుషులపై దాడి చేశారు. దెబ్బల ధాటికి తట్టుకోలేక ధాన్యానికి వచ్చిన వారు పరుగు లంకించుకొన్నారు.

కష్టించి పండించుకొన్న ధాన్యాన్ని ఆ పేద ప్రజలు దక్కించుకొన్నందుకు రమేష్ సంతోషించాడు. రమేష్ మనస్సులో రేణుపై అభిమానం పెరిగింది. నిద్రాణమై వున్న ఆ పేద ప్రజల జీవితానికి రేణు ఒక వెలుగుబాట చూపి వెళ్ళిందని, ఆమెని మనస్సులోనే మెచ్చుకొన్నాడు.

# 32

రేణు, జగదీష్‌బాబుగారి దగ్గరికి వచ్చింది. కొలను ప్రక్కన వున్న పాకను తీసివేశారు. ఆ స్థలం బోసిగా వుంది. జగదీష్‌బాబు కలవగానే ఆ వృద్ధుని సంగతి అడిగింది. అతను మరణించి ఆరునెల్లవుతోందని సమాధానం.

పాపం, అన్యాయమైతే కళ్ళతో చూశాడు. కాని, దానిని వ్యతిరేకిస్తున్న శక్తుల కృషి ఫలితాన్ని చూచేదాకా ఆగలేకపోయాడు. ఆ ఫలితాన్ని చూడటానికి ముందు యింకా ఎన్ని తరాలు తరలిపోవాలో !

ఏవో చిన్న పేచీలు వచ్చినంత మాత్రాన యిలా రావడం తప్పని రేణుని విమర్శించాడు జగదీష్‌బాబు.

'ఏవో నీతులు చెప్పిన వారు, వాటిని అక్షరాలా పాటిస్తున్నవారిని నేను యిలా చెప్పలేదు, అలా చేయవలసింది అని విమర్శించినట్లుంది మీరు అనేది. నా మనస్సు పూర్తిగా పేదవారి క్షేమం కొరకు తహతహ లాడుతోందని మీకు తెలుసు. మీ ముందే వారిని కొంతమంది ధనికులు దోచుకొని, హింసించుతుంటే చూస్తూ ఊరుకొంటారా?' ఎదురు ప్రశ్నిం చింది.

'మాలాంటివారు ఏ సాహసమైనా చేయవచ్చు. దానినుంచి వచ్చే ఫలితం మమ్మల్ని విచలితులను చేయలేదు. మాకు సంసారం లేదు. నా అన్నవారు లేరు. కాని నీ విషయం వేరు. రమేష్ వున్నాడు. బాబు వున్నాడు. మంచానపడిన తండ్రి వున్నాడు. వాళ్ళ యోగక్షేమాలు దృష్టిలో పెట్టుకొని నీవు ఏ పనైనా చేయాలి.'

'నిజమే! నా మాటను గుర్తించి, నాకు విలువ యిచ్చేవారికి అవసరమైతే నా ప్రాణాలు కూడా యిస్తాను. కాని నా వ్యక్తిత్వాన్ని పట్టించు కోని వారి కొరకు ఎందుకు బాధపడాలి?'

'నీకు చెప్పితే యిప్పుడు అర్థంకాదు. అనుభవమే నీకు తెలుపు తుంది. అప్పుడు ఆలస్యమయిందే అని నీవు బాధపడవల్సి వస్తుందేమో.'

'అప్పుడు పశ్చాత్తాప పడను. ప్రస్తుతానికి నాకు ఒక ఉద్యోగం కావాలి. మొన్న ఒక ఉద్యోగం వచ్చింది. కానీ, పార్టీ వర్కరని తెలిసి తీసేశారు.'

'అలాగా! నాకు తెలిసిన స్కూలు వుంది. అందులో టీచరు పని ఖాళీగా వుందని తెలిసింది. ప్రయత్నం చేయి' అని ఒక చీటీ వ్రాసి యిచ్చాడు.

'ఈరోజు నుంచి నేను పార్టీ పనులకి సిద్ధంగా వున్నాను. నాకు కూడా మీరు ముఖ్యమైన పనులు ఆదేశించాలి' అని రేణు కోరింది

'అలాగే' అన్నాడు జగదీష్‌బాబు

* * *

రేణు, జగదీష్‌బాబుకు సాయంగా వుండసాగింది. అంతకుముందు ఆమె పరోక్షంగా సాయం చేయడంవలన వారు చేస్తున్న పనులలో పూర్తిగా లీనమవడానికి వీలు కలగలేదు. ఇప్పుడు ఎక్కడ దాడులు జరగాలి అని ప్లాను వేసిన దగ్గరనుంచి, ఆ తర్వాత సంఘటనలు కూడా ఆమె తెలుసుకోసాగింది అవి తెలిసిన తర్వాత ఆమెలో క్రమేపీ మార్పు రాసాగింది. సమసమాజాన్ని స్థాపించడానికి, పేదరికం రూపుమాపడానికి హింసతో కూడుకొన్న చర్యలు నిజంగా అవసరమా అనే ప్రశ్నలు ఆమె మనస్సులో ఉద్భవించాయి.

నరేష్ బెనర్జి నాయకత్వంలో ఒక దళం సోనాపూర్ గ్రామంలో దాడి జరపడానికి వెళ్ళింది.

సతీష్‌దాస్ సోనాపూర్ పరిసర ప్రాంతంలో తిరుగులేని భూస్వామి. ఆ ఊరి చుట్టుప్రక్కల వున్న పది గ్రామాలలో అతని బంధువులే పెత్తందార్లు. వాళ్ళందరూ ఏకమై అక్కడవున్న పేదప్రజలని నానాహింసలు పెడుతున్నారు. సతీష్‌దాస్ అందరికంటే క్రూరుడు. పరమ నీచుడు. ఊరిలోని గ్రామస్థులకు అవసరానికి అడగ్గానే అప్పులు యిస్తాడు. ఆ అప్పుకి వడ్డీలు పెంచేసి మూడు, నాలుగు సంవత్సరాల తర్వాత ఆ వ్యక్తిని డబ్బు తిరిగి యివ్వమని బలవంతం చేసి, యివ్వలేని పరిస్థితిలో వారి భూమిని స్వాధీనం చేసుకొంటాడు.

ఆ విధంగా సతీష్‌దాస్ అక్రమంగా కొన్ని వందల ఎకరాల భూమిని సేకరించాడు. అతని వద్ద అప్పుగా తీసుకొన్న ఆసాములకు పండిన ధాన్యం తనకే విక్రయించాలని షరతులు విధించాడు. వారు తెచ్చిన ధాన్యంలో నాణ్యత లేదని తక్కువ ధరని ముట్టచెప్పుతాడు.

వీటన్నింటిని మించి అతను స్త్రీలోలుడు. కామం విషయంలో జంతువు లాంటివాడు. ఆ ఊరిలోని ఏ స్త్రీని అతను కోరినా ఆమె లొంగిపో వలసిందే! ఆమె వ్యతిరేకిస్తే ఆ కుటుంబాన్ని సర్వనాశనం చేసేవాడు.

ఆ విషయాలు తెలుసుకొని అటువంటి వ్యక్తులకు శాస్తి జరగవల సిందే అని రేణు అనుకొంది సతీష్‌దాస్ లాంటి క్రూరుల బారినుంచి ఆ గ్రామ పేద ప్రజలకు విముక్తి కలిగించడం మంచిపని అని ఆమె నిర్ధారించుకొంది.

నాలుగు రోజుల తర్వాత నరేష్ దళం తిరిగి వచ్చింది. సోనా పూర్‌లో జరిగిన విషయాలు తెలుసుకొని రేణు నిర్ఘాంతపోయింది.

అక్కడ జరిగిన దాడిలో సతీష్‌దాస్‌కి చెందిన యిద్దరు మనుష్యులు తీవ్రంగా గాయపడ్డారు. గడ్డివాముని తగులపెడితే పశువుల కొట్టం కూడా అంటుకొని నానా భీభత్సం జరిగిపోయింది. కాని ఆ సమయంలో సతీష్ దాస్ యింట్లో లేనందున తప్పించుకోగలిగాడు. భూములను పేదవారికి తిరిగి యివ్వమని సతీష్‌దాస్ భార్యని హెచ్చరించి వచ్చారు.

'ఆ భూములని అతను తిరిగి యిస్తాడని మీకు నమ్మకం వుందా?' అని రేణు నరేష్‌ని అడిగింది.

'ఆ భయంకర సంఘటనతో, భార్య ఒత్తిడితో, తన ప్రాణాలపై వున్న తీపితో సతీష్‌దాస్ భూములను తిరిగి యివ్వవచ్చు. అతను యివ్వ లేడని తెలుస్తే, మనం మళ్ళీ దాడి చేస్తాం' అని నరేష్ వివరించాడు.

'అంటే అతను మనస్సు మార్చుకొని భూములను స్వాధీనం చేసే వరకు మనం దాడులను చేస్తూనే వుండాలా?' రేణు అనుమానంగా అడిగింది.

'అవును రేణూ. యీ భూస్వాముల స్వార్థం అణగారే వరకు మనం యీ చర్య తీసుకోక తప్పదు' అన్నాడు నరేష్.

రేణు యింకా యేమీ మాట్లాడలేకపోయింది. కాని ఆమెలో ఆలోచన పరంపరలు కొనసాగుతూనే వున్నాయి. భూస్వాములు అత్యాశతో పేద జనాన్ని పీల్చి పిప్పి చేస్తున్నమాట వాస్తవమే కాని అక్కడక్కడ కొన్ని భయంకర చర్యలతో కొంతమంది భూస్వాములను మార్చాలని ప్రయత్నించడం ఎంతవరకు సమంజసమో ఆమెకి బోధపడలేదు. యీ వ్యవస్థను మార్చాలంటే యావత్తు పేదప్రజానీకాన్ని ఏకంచేసి ఒక్కపిడికిలిగా బలమైన త్రోవుయిస్తేగాని సాధ్యపడదని ఆమె అంతరాత్మ ఉద్బోధించ సాగింది.

# 33

అప్పలస్వామి పరిస్థితి మరీ విషమించింది. డాక్టరు దగ్గిర ఎన్ని మందులు యిప్పించినా ఫలితం లేకపోతోంది. రేణు ఆ రోజు స్కూలు నుంచి యింటికి వచ్చింది. నిరంజన్ క్రిందపడి ఏడుస్తున్నాడు.

అప్పలస్వామికి లేచే ఓపిక లేదు. కుర్రాడి ఏడుపుని వినలేక నెమ్మదిగా ప్రక్కకు జరిగి లేవబోయాడు అంతలో దగ్గు, ఆయాసం ఎగేసుకొని వచ్చాయి. అతను ఆయాసంతో మంచాని కొరిగాడు.

రేణు కుర్రాడ్ని చంకలో వేసుకొని గ్లాసెడు మంచినీరు తెచ్చి యివ్వబోయింది. అతని చేయి పైకి లేవలేక పోయింది. ఏదో చెప్పుదా మనుకుంటే మాట పెగిలి రావడం లేదు. నెమ్మదిగా సైగచేస్తూ గొంతులో క్రొద్దిగా నీరు విడువమన్నాడు.

రేణు నెమ్మదిగా క్రొద్దిగా గొంతులోకి నీరు పోసింది. ఒక గ్రుక్క వేశాడు. అంతే. రెండవ గ్రుక్కను మ్రింగడానికి తెలివిపోయింది. ఆయనలోని ప్రాణవాయువు ఎగిరిపోయింది.

రేణు ఘొల్లుమని ఏడ్వసాగింది. చంకలో వున్న నిరంజన్ బిత్తర పోయి ఏడుపు లంకించుకొన్నాడు. ఆ అలజడికి చుట్టుప్రక్కలవాళ్ళు గుమి గూడారు.

*   *   *   *

నరేష్ దళంతో జాల్‌పాయిగురికి బయలుదేరాడు. అక్కడ టీ తోటలలో పనిచేసే కార్మికులు ఎన్నో ఘోరాలు ఎదురుకొంటున్నారు. ఒక టీ ఎస్టేట్ యజమాని దురాగతాలకు అంతులేకుండా పోయింది. అతని మీద దాడి చేయాలని వారు వెళ్ళారు.

మూడు రోజులకు వస్తామన్న నరేష్ దళం వారు తిరిగి రాకపోయే సరికి జగదీష్‌బాబు, రేణు ఆందోళన పడసాగారు. వారం రోజుల తర్వాత వారు తిరిగి వచ్చారు.

నరేష్ ఎడమకాలు పిక్క భాగంలో కట్టు వుంది. ఏదో ఘోరం జరిగిపోయినట్లు గ్రహించి రేణు ఆమర్దాగా అతని దగ్గరికి వెళ్ళింది.

'పోలీసులకి మా ఆచూకీ తెలిసి నిఘా వేసినట్లున్నారు. వారితో జరిగిన ఘర్షణలో నాకు పిస్టలు గుండు తగిలింది' అని వివరించాడు నరేష్.

'ప్రమాదం తప్పిపోయింది. తూటా శరీరం పై భాగంలో ఎక్కడైనా తగిలివుంటే........' రేణు పూర్తి చేయలేకపోయింది.

'ఏముంది ? ప్రాణాలు పోయేవి నా స్థానంలో మరో కామ్రేడ్ యీ సమరాన్ని కొనసాగిస్తాడు. ఈ విప్లవం అలా కొనసాగుతూనే వుంటుంది రేణు' అన్నాడు నరేష్.

గత కొన్ని రోజులుగా రేణు మనసులో చెలరేగిన ప్రశ్నలకు, యీమధ్య జరిగిన దాడులను యే విధంగా సమన్వయించుకోవాలో యిప్పుడిప్పుడే ఆమెకి స్పష్టమవుతోంది. త్యాగాలు చేసి, ప్రాణాలు ఒడ్డి ఏవో కొన్ని ప్రాంతాలలో క్రూరులైన భూస్వాములపై ఘోరచర్యలు తీసుకోవడం ఆ సమస్య పరిష్కారంగా ఆమెకు తోచలేదు. మొత్తం వ్యవస్థను మార్చాలంటే, భూస్వాముల ఘోరాలను ఆపు చేయాలంటే, పేదజనాన్ని, బడుగువర్గాన్ని ఒక్క త్రాటి మీదికి తెచ్చి ఎదిరింప చేయాలి. అప్పుడే నిజమైన విప్లవం వస్తుంది అని రేణు తేల్చుకొంది.

'నన్ను క్షమించాలి జగదీష్‌బాబు ! నేను యిక పార్టీ పనులలో పాల్గొనలేను. నా మనస్సు మనం చేస్తున్న పనులతో రాజీపడలేక పోతు న్నది' అంటూ తనలో కలిగిన మార్పుని వివరించింది.

'రేణూ ! నీవు ఆ సంఘటనలను తట్టుకోలేవని నేను యింతకు ముందే చెప్పాను. మన కార్యాచరణకు నీ మనస్సు అంగీకరించకపోతే బలవంతం లేదు. నీకు తోచిన విధంగా నిర్ణయం తీసుకో' అంటూ జగదీష్ సలహా యిచ్చాడు.

'ఆ ఘోర చర్యలు విని నా మనస్సు చెదిరింది, నమ్మకం సడ లింది. అందుకొరకే ఆ పనులకు దూరంగా వుండదలచుకొంటున్నాను' అంది రేణు.

'అలాగే' అన్నాడు జగదీష్‌బాబు.

* * * *

రేణు వెళ్ళిపోయిన తరువాత రమేష్ ఎంతో వెలితిని అనుభవిస్తు న్నాడు. ఎప్పుడూ చిలిపిగా మాట్లాడుతూ, అటూ ఇటూ తిరిగే రేణు, తన బోసి నవ్వుతో పలకరించి ఉల్లాసం కలిగించే నిరంజన్ ఆయనకు పదే పదే జ్ఞాపకం వస్తున్నారు. వాళ్ళిద్దరితో కలసి వున్నప్పుడు రోజులు ఎంతో సునాయాసంగా గడిచిపోయేవి. ఇప్పుడు ఒక్కొక్క రోజుని లెక్క పెట్టవలసి వస్తోంది.

రమేష్‌కి జీవిత మెప్పుడు కలతలు లేకుండా హాయిగా గడిచిపోవా లనే ఆకాంక్ష. కాని ఆయన జీవితంలోనుంచి రేణు వెళ్ళిపోగానే సాఫీగా సాగుతున్న సెలయేటిముందు పెద్ద అడ్డు ఏర్పడినట్లు అయింది.

రేణుకి ఉత్తరం వ్రాయాలని ఎన్ని రోజులనుంచో అనుకొంటు న్నాడు. కాని ఉత్తరం మొదలు పెట్టగానే ఏమని వ్రాయాలో తెలి యదు. ఆమెకే పట్టింపు లేనప్పుడు నీవు మట్టుకు ఎందుకు వ్రాయాలి? అని మనస్సు ఎదురు తిరుగుతోంది. వ్రాస్తున్న ఉత్తరం చించి అవతలకి విసరగానే చిత్రమైన మనస్సు మళ్ళీ రేణు జాడలవైపు దారితీస్తోంది.

రమేష్ మనస్సుని ఏమాత్రం పనిమీద కేంద్రీకరించలేక పోతు న్నాడు. యాంత్రికంగా ఫీల్డుకివెళ్ళి వస్తున్నాడు.

అంతలో నారాయణ వెంటనే రమ్మని టెలిగ్రాం యిచ్చాడు. రమేష్ ఆదుర్దాగా కందికి చేరుకొన్నాడు. అన్నను కలిసి విషయాలేమిటని ఆత్రంగా అడిగాడు.

'ఆఁ ఏంలేదు భూ గరిష్టపరిమితివారు డిక్లరేషను అడిగారు. నీవుకూడా కొన్ని దస్తావేజుల మీద సంతకాలు చేయాలి.

రమేష్ ఎంత వద్దన్నా వినకుండా, అతనికి రావలసిన భూమిని రిజిష్టరు చేయించాడు నారాయణ డిక్లరేషన్ల తర్వాత ప్రభుత్వం వారు పరిశీలించి, పరిమితికన్న ఎక్కువగా వున్న భూములను అధీనంలోకి తీసుకొంటారు. అలా అధీనంలోకి తీసుకొన్న భూములను, బలహీన వర్గాలవారికి పంచి యివ్వాలని ప్రభుత్వంవారి ఆలోచన.

రమేష్‌కి కొంచెం సంతోషం కలిగింది. భూములను పేదవారికి పంచియిస్తున్నారని తెలిస్తే, రేణు వారి పార్టీ సభ్యులు సంతృప్తి పడతారు.

'ఈ పంపకాలు ఎప్పటిలోగా అవుతాయి?' అని కుతూహలంగా అడిగాడు రమేష్.

'పంపకాలేమిటి? ఇప్పుడేగా తంతు మొదలయింది. పంపకాలు వచ్చేసరికి కనీసం నాలుగైదు సంవత్సరాలైనా పట్టవచ్చు. అయినా పంచడానికి ఏముంటుందని? తెలివికల భూకామందులు చాలామంది ఇంతకుముందే భూములను పిల్లల పేరిట,' వారి పిల్లల పేరిట వీలైనంత మంది పేరున రిజిష్టరు చేయించి వుంచారు. అలా వీలుకాని పక్షంలో ... పడి, ఎందుకూ పనికిరాని భూమిని మిగులు భూమిగా చూపిస్తున్నారు. నాకు తెలిసినతను, ఆ ఊరిలోని బీదప్రజల పేర్లమీద భూములను రిజిష్టరు చేయించి, దస్తావేజులను తనదగ్గర వుంచుకొన్నాడు. ఆ ఊరివారికి తమ పేరునవున్న భూమి ఎక్కడవుందో తెలియదు. ఇలా జరుగుతున్న విష యాలను చూస్తుంటే, ప్రభుత్వంవారు సేకరించే భూమి బహుకొద్దిగా వుంటుందని, అది ఎందుకు పనికిరాదని నాఉద్దేశ్యం' అన్నాడు నారాయణ.

రమేష్ నిజంగా ఆశ్చర్యపోయాడు. ప్రభుత్వంవారు సోషలిజం అని ఎన్నో పథకాలను ప్రవేశపెట్టినా, ఇలాంటి లోపాలు వుండే అవి విజయవంతం కాలేవు.

నారాయణ మళ్ళీ మొదలు పెట్టాడు. 'అందులో ఇంకొక కష్ మొంది. బలహీనవర్గాలంటే ఎవ్వరు? పుట్టిన కులాన్ని బట్టి కొంతమంది, ఆర్థిక పరిస్థితినిబట్టి కొంతమంది వున్నారు. ఎవ్వరు ఎక్కువ చెలివిని ప్రద ర్శించి సర్టిఫికేట్లు సంపాదించుకుంటేభూములు వారికే లభిస్తాయి.'

రమేష్‌కి నిజమే ననిపించింది. అధికారులు ఎన్నో పనులు తల గించినా, మారుమూల గ్రామాల్లో అతి హీనస్థితిలో జీవిస్తున్న హరిజను లకు, యితర బలహీనవర్గాలకు అవి ఏమాత్రం అందటంలేదు. పట్టణాలలో వున్నవారు, అన్ని విధాల సంపత్తి కలవారు ఆ కులంలో పుట్టిన మూలా యీ సదుపాయాలు పొందుతున్నారు. రమేష్ కొన్ని విషయాలు ఇలా జరుగుతుంటే కళ్ళారా చూశాడు.

ప్రభుత్వం ఎన్ని తలపెట్టినా మనిషిలో చైతన్యం వస్తేనే ఫలితం దక్కుతుంది. సమాజం నిద్ర లేవాలి. అప్పుడే రాజకీయాలు తొలగిపోతాయి. సమ సమాజం ఏర్పడగలుగుతుంది. ఈ ఆలోచనలతో

రేణు గుర్తుకు వచ్చింది. ఆమె నమ్మిన సిద్ధాంతాలు సవ్యంగా కనిపించాయి. ఆమెని అభినందించక అనవసరంగా కించపరిచానని బాధపడ్డాడు.

'మరదల్ని తీసుకరాలేదేమి?' నారాయణ అడిగాడు. ఉలిక్కి పడ్డాడు రమేష్. 'అదే వాళ్ళ నాన్నని చూడాలని కలకత్తాకు వెళ్ళింది' అని బొంకాడు.

# 34

పోస్టులో యేదో పార్శిలు వచ్చిందంటే, కుతూహలంగా తీసుకొంది రేణు పార్శిలుపైన రమేష్ పేరుని చూడగానే ఆమె మనస్సు ఉవ్వెత్తున ఎగిరింది.

ఆమె కలకత్తాకు వచ్చి ఆరు నెల్లయ్యింది. ఒక ఉత్తరం లేదు. అవును, ఎలా వ్రాస్తాడు? తను అంత బింకంతో, అతని మాటలను లెక్క చేయకుండా వచ్చేసింది. ఆయనకు మాత్రం వ్యక్తిత్వం లేదా? తను అలా మొండిగా వచ్చేసినందుకు ఎలా వ్రాస్తాడు?

రేణు యింతకుముందు ఎన్నోసార్లు ఉత్తరం వ్రాయాలనుకొంది. 'క్షమించండి' అని మొదలు పెట్టగానే, అది ఆమెకు హాస్యాస్పదంగా వుండేది. తాను చేసింది తప్పు ఎలా అవుతుంది? మనస్సుకి నచ్చింది. నిర్భయంగా చేసింది. వెంటనే ఉత్తరం చెత్తబుట్ట పాలయ్యేది.

వణుకుతున్న చేతలతో పార్శిలుని విప్పింది. లోపల చక్కని ఆట బొమ్మ వుంది. ఒక చిన్న చీటీముక్క వ్రాసివుంది.

"నిరంజన్‌కి ముద్దులతో—జన్మదిన కానుక' అని ఆమెకి వెంటనే జ్ఞాపకం వచ్చింది. మరుసటిరోజు నిరంజన్ జన్మదినమని. ఎంతో జ్ఞాపకం, ప్రేమగా కానుక పంపినందుకు ఆమె మనస్సు హర్షించింది.

తన కొరకేమైనా ఉత్తరముంచారేమోనని మళ్ళీ నాలుగైదుసార్లు వెదికింది. ఆమె కన్నీటి చుక్కలు ఒక్కటొక్కటిగా రాలసాగాయి.

అప్పలస్వామి బ్రతికి వున్నంత కాలం, పార్టీ పనులలో నిమగ్నురాలై నంత వరకు, ఆమె మనస్సు రమేష్‌వైపు వెళ్ళలేదు. కాని యిప్పుడు ఎంతో లోటుని అనుభవిస్తోంది. ఆయనని చేరుకోవాలని మనస్సు తహ తహ లాడుతోంది.

# 35

కలకత్తాలో జియాలజీకి సంబంధించిన విషయంపై ఒక సెమినార్ ఏర్పాటయింది. ఆఫీసు తరపున, రమేష్ దానికి హాజరు కావాలని వచ్చాడు.

హౌరాస్టేషనులో దిగగానే ఆయన కాళ్ళల్లో నుంచి ఎవ్వరో బలాన్ని లాగివేసినట్లు ఫీలయ్యాడు. మనస్సు ద్విపాత్రాభినయం చేయ సాగింది. నేరుగా రేణు యింటికి వెళ్ళాలని ఒకవైపు, తనను తిరస్క రించి వచ్చి, యింతవరకు ఒక్క ఉత్తరం కూడా వ్రాయని మనిషి యింటికి ఎలా వెళ్ళగలుగుతావు అని యింకొకవైపు వాదన మొదలైంది. మనస్సుని నొక్కిపట్టి, హోటలుకి పద అని బుద్ధి ముందుకు త్రోసింది.

సెమినార్ రెండురోజులు జరిగింది. ఎంతో బరువుగా వెళ్ళాయి ఆ రెండు దినాలు. సాయంత్రం రూముకి రాగానే, రమేష్ మనస్సు నిలబడేది కాదు. రేణుని చూడాలని, నిరంజన్‌ని ఎత్తుకోవాలని పరితపించేది, ఎంతో బలవంతంమీద వెళ్ళకుండా నిగ్రహించుకొన్నాడు.

ఆ రోజు సాయంత్రం బజారులో తిరుగుదామని బయలుదేరాడు రమేష్. భవానీపూర్‌నుంచి కాళీఘాట్‌వైపు నెమ్మదిగా నడుస్తూ వెళ్తున్నాడు. రోడ్డుకి ఆనుకొనివున్న సందులో నుండి 'రమేష్‌బాబు' అన్న పిలుపు విన వడింది.

అటు తిరిగిన రమేష్ ప్రతిమలా నిలబడిపోయాడు. ఎదురుగా రేణు మరో యిద్దరు వ్యక్తులు. జగదీష్‌బాబు వస్తున్నారు రమేష్‌ని చూచి రేణు కూడ ఆశ్చర్యపోయింది. తమాయించుకొని, ఆయన్ని పిలువవల సిందిగా జగదీష్‌బాబుని కోరింది.

వారు రమేష్ వైపు నడుస్తూ వస్తున్నారు. ఈ సంవత్సరం లోపల జగదీష్‌బాబు, ఎంతో వయస్సు మళ్లిన వాడిలా కనిపిస్తున్నాడు. మూడు వ్రేళ్లుపోయిన చేయిని చూద్దామంటే, పొడుగ్గా వున్నలాల్చీ చేయిని కనపడనివ్వలేదు.

రేణువైపు చూచి రమేష్ ఎంతో ఆశ్చర్యపోయాడు. ఆమె ఎంతో మారిపోయింది. ముఖంలో యింతకుముందు వున్న కళ తగ్గిపోయింది.

'ఎప్పుడొచ్చారు రమేష్‌బాబు....?' అని ఆప్యాయంగా అడిగాడు జగదీష్‌బాబు.

'మొన్ననే.... ఆఫీసుపనిమీద....' పొడిగా అన్నాడు రమేష్

'అలాగా! అన్నట్లు రేణు యిప్పుడు పార్టీపనులు మానుకొంది. అదిగో అక్కడవున్న స్కూల్లో పనిచేస్తోంది!' అని దూరంగా వున్న బిల్డింగుని చూపాడు.

'అలాగా!' ముభావంగా అన్నాడు రమేష్.

వెళ్తున్న టాక్సీని జగదీష్‌బాబు ఆపాడు. 'రమేష్‌బాబు, మీతో రేణు ఎన్నోవిషయాలు చెప్పాలనుకొంది, దయచేసి ఆమెతో వెళ్లండి' అన్నాడు.

అంతవరకు రేణు నోటినుంచి మాటరాలేదు. జగదీష్‌బాబు మాటకు రమేష్ నుండి సమాధానం రాకపోయేసరికి, టాక్సీ తలుపుని తెరిచి, సూటిగా, ఆయన కళ్లలోకి చూస్తూ 'రండి' అని క్లుప్తంగా అంది రేణు.

రమేష్ టాక్సీలోకి వచ్చాడు. 'నేను వస్తాను' అని జగదీష్‌బాబు, మిగతావారితో కలిసి ముందుకి సాగిపోయాడు. రేణు కారెక్కి తలుపుని మూయగానే, అది ఉరికింది.

దారిలో ఎవ్వరూ ఏమీ మాట్లాడలేక పోయారు. ఒకరికొకరు క్రొత్తవారిలా కనిపిస్తున్నారు. మనస్సులో ఎన్నోమాటలువున్నా, ఎలా మాట్లాడాలో, ఎక్కడ మొదలు పెట్టాలో, తెలియడం లేదు.

ఇంటిముందు టాక్సీ ఆగగానే రమేష్ డబ్బులు యిచ్చాడు. రేణు ముందుకి వెళ్లి తలుపుని తట్టగానే, ఆయా తెరిచింది.

గదిలోకి అడుగు పెట్టగానే రమేష్‌కి ఎదురుగా అప్పలస్వామి ఫొటో, పూలదండతో కనిపించింది. 'మీ నాన్నగారు....!' అనుమానంగా అడిగాడు.

ఆయన పోయి మూడు నెలలవుతుంది. 'మీ గురించి ఎన్నోసార్లు అడిగారు'. కళ్లల్లో నీటిపొరలు కమ్ముకున్నాయి రేణుకి.

'నాకు అసలు తెలియలేదు. ఆయనకు సుస్తీగా వుందని తెలుస్తే వెంటనే వచ్చేవాణ్ణి.'

'నాదే పొరపాటు. మీ దగ్గరికి వెళ్లమని ఎంతో పోరాడాడు నాతో. నేను కాపురానికి వెళ్లడం లేదనే దిగులుతోనే కన్నుమూశాడు.' ఈసారి ధారగా నీరుకారుతోంది.

రమేష్ ఆమె దగ్గరగా వచ్చి, కన్నీరు నెమ్మదిగా తుడుస్తూ 'వయస్సు పెరిగినవారు ఎన్నాళ్ళని మనతో వుంటారు. నీ కారణంగానే ఆయన మరణించారనేది నిజంకాదు. అయినా నీవు నమ్మిన సిద్ధాంతాలకు, నాతో సరిపడక వచ్చేశావు. అది వారికి తెలిసి వుండదు' అన్నాడు.

'నా భ్రమ యిప్పుడు తొలగిపోయింది. నేను అనుకొన్న ఆశయాలు, నమ్మిన సిద్ధాంతాలు ఊహాగానాలని తెలిసిపోయింది. ఈ సమాజాన్ని మార్చడమనేది ఒక బృహత్కార్యం. కొనవ్రేళ్ళలోంచి క్రాంతి రవ్వలు చిటపటలాడుతూ రావాలి. దేశం నలుమూలలనుంచి అత్యధిక ప్రజానీకాన్ని అందులో పాల్గొనేలా చేయాలి. ఏదో నాలుగు హింసాకాండలు జరిపి, అలజడి లేపితే లాభం లేదు. విద్య అనే అమృతాన్ని మూల

మూలలా ఎడం పదలకుండా జనంలో వెదజల్లాలి. ఆ తర్వాత విప్లవం. సమసమాజం అనే మాటలకు అర్థం తెలిసిన జనం స్వయంగా మేలు కొంటుంది.

'ఇన్నిరోజుల కృషితో నేను సాధించిందేమిటి? మిమ్మల్ని బాధించి నేను క్షోభించడం తప్పితే ఆర్జించింది ఏమీలేదు. అందుకొరకే పార్టీపనులనుంచి పూర్తిగా తప్పుకొన్నాను' వివరంగా చెప్పింది రేణు.

ఆమె మనస్సు విప్పిచెప్పిన మాటలు, రేణుని రమేష్‌కి దగ్గరిగా చేసింది. వారిలో మనస్పర్థలు నిరాధారమైనవి అని ఆమెని యింకా దగ్గరిగా తీసుకొన్నాడు.

'నీవు అన్నట్లు పరిస్థితులు మారితే విప్లవం తప్పకుండా వచ్చి తీరుతుంది రేణూ' అన్నాడు రమేష్.

అంతలో నిరంజన్ ఎదురుగా వచ్చాడు. మొదట కొంచెం జంకినా, తర్వాత గుర్తించి రమేష్‌కి చేతులు అందించాడు.

రమేష్ అతన్ని ప్రేమగా ఎత్తుకొన్నాడు.

'మన కాలంలో కాకపోయినా, మన బాబు సమసమాజాన్ని చూస్తాడని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను' అని రేణు, నిరంజన్ వీపుమీద చేయివేస్తూ, రమేష్ భుజంపై ఒరిగింది.

**CHEELANI PAYALU**
**By Dr. Ponnala Yadagiri** **Rs. 8-00**



## డా॥ పొన్నాల యాదగిరి

స్వస్థలం హైదరాబాదు. వయస్సు 40 సంవత్సరాలు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం. యస్సి., ఎం. ఎస్సి (టెక్).. పి.హెచ్.డి. డిగ్రీలు పొందారు. ప్రస్తుతం హైదరాబాదులోని భారత భూగర్భ సర్వే క్షణలో జియాలజిస్టుగా పనిచేస్తున్నారు.

వీరి మొదటి కథానిక 'ప్రతిభ' 1960 కృష్ణా పత్రికలో అచ్చయింది. 'కలసిన మనసులు', 'వాయిదాలలో వరకట్నం', 'ముగిసిపోని మూఢ నమ్మకాలు' ఆ తర్వాత అచ్చయిన కథలు. మొదటి నవల 'అనుమానాలు_ అనురాగాలు' ఆంధ్రప్రభ వారపత్రికలో 1976_77 లో వచ్చింది. తర్వాత నవోదయ పబ్లిషర్స్ ద్వారా పుస్తక రూపంలో వచ్చింది. 'చీలని పాయలు' రచయిత రెండవ నవల.

S. A. P. Vijayawada-4.